





# వారేవ్వా!

ఒక కళాకారుడు తన చేతివేళ్లతో సృష్టించిన అద్భుత జంతుజాలం దృశ్యరూపాలు

మూడో కవర్‌లో మరికొన్ని...

# చతుర

సంపుటి -31
సంచిక -3
ఏప్రిల్ 2008
363వ సంచిక



అనుక్షణం ఊహల్లో తేలిపోతూ కాలక్షేపం చేసే ఓ యువకుడు మనసుకు నచ్చిన అమ్మాయిని ఏరికోరి పెళ్లిచేసుకున్నాడు. తీరా శోభనం ఘడియలు చేరువయ్యే సరికి అతడు కలవరపడిపోయాడు ఆ కలవరానికి కారణమేమిటి? **కోలపల్లి ఈశ్వర్** కడుపుబ్బ నవ్వించే నవల **ఆనందరావు శోభనం** 14 వ పేజీలో...

బొమ్మలు: బాలి



ముఖచిత్రం : ఐశ్వర్యారాయ్
చివరి పేజీ : హైదరాబాద్ భారతీయ విద్యాభవన్‌లో జరిగిన పాఠశాల వార్షికోత్సవంలో పాల్గొన్న చిన్నారులు -ఫొటో: మురళి

ఇన్నర్ కవర్స్ హస్తకళాకారుడు : గైడో డేనియల్
ముఖపత్రాలంకరణ : రాజు యాట

# మనసున ఉన్నదీ...



★ మార్చి చతుర ముఖచిత్రం ముగ్ధమనోహరంగా ఉంది. కొత్తగాలి... శీర్షికన హైకూలూ, నానీలు అందర్నీ అలరిస్తున్నాయి. 'వారెవ్వా' ఫొటోలు ఫ్రేమ్ కట్టించుకునేలా ఉన్నాయి. 'చతుర' కొత్తకొత్త శీర్షికలతో నవవధువులా ముస్తాబై పాఠకులకి ఆనందాన్ని కలిగిస్తోంది.

**–ఈ. వేమన, శ్రీకాకుళం**

★ అక్కినపల్లి సుబ్బారావుగారి నవల 'మరో వసంతం' అద్భుతంగా ఆరంభమై ఆసక్తికరంగా సాగినా చివరకు అనుకోని మలుపు తిరిగి పేలవంగా మారింది. పాత్ర చిత్రణ విషయంలో చాలా పరిపక్వత కుమార్ విషయంలోనూ, రాయుడి విషయంలోనూ కనిపించినా రోజీ పాత్రకు న్యాయం చెయ్యలేకపోయారనిపిస్తుంది. జలజ పాత్రను సమయోచితంగా, సందర్భోచితంగా తీర్చిదిద్దారు.

**-స్వాతి శ్రీపాద, శాన్ ఫ్రాన్సిస్కో, అమెరికా**

★ 'మరో వసంతం' వైవిధ్యంగా ఉత్కంఠభరితంగా, పట్టుగా చివరివరకూ సాగినా రాయుడు రోజీల అపజయపు ప్రేమబంధం, జలజ, కుమార్‌ల తెగిపోయిన బంధం పాఠకులకు తీవ్ర అసంతృప్తిని, నవలకు అసంపూర్ణత్వాన్ని ఆపాదించాయి.

**–బులుసు పద్మజాశాస్త్రి, రామచంద్రాపురం**

★ మార్చినెల 'చతుర' బాగా నచ్చింది. 'బాంబోపాఖ్యానం', చతురకత 'ఈవి', 'జవాబులేని ప్రశ్న' బాగున్నాయి. పత్రికల్లో కొత్తకొత్త శీర్షికలు ప్రవేశపెడుతున్నందుకు సంతోషంగా ఉంది. 'పదవినోదం'కూడా ప్రవేశపెడితే ఇంకాబాగుంటుందని మా సూచన.

**–కె.వి. లక్ష్మి, పెద్దపల్లి, ఆలమూరు మండలం**

★ 'మరోవసంతం' నవలలో ఉన్న పాత్రల హుందాతనానికి తగినట్లుగా బొమ్మలు లేవు. ఆర్టిస్ట్ ఇంకా శ్రద్ధ వహిస్తే మంచిది.

**–పి.వి.ఎన్. ప్రసాద్, తెనాలి**

★ 'చతుర' మార్చి సంచికలో ప్రచురించిన డాక్టర్ అక్కినపల్లి సుబ్బారావుగారి మనో విశ్లేషణాత్మక నవల 'మరో వసంతం' ఆద్యంతం రసవత్తరమైన ఉపమానాలతో సాగి, కుమార్ హత్యోదంతంతో ఊహించని మలుపు తిరిగి రక్తి కట్టించింది.

**–అక్కినపల్లి రామారావు, విశాఖపట్టణం**

★ మార్చి 'చతుర' నవల 'మరో వసంతం' మామూలు నవలలకన్నా భిన్నంగా ఉండి చకచకా చదివింపజేసింది. కుమార్ కన్నా డాక్టర్ రాయుడిది చక్కని పాత్ర. రోగుల ఆర్థిక ఇబ్బందులు ఆలోచించే డాక్టర్లు ఎంతమంది? కుమార్ చావకుండా జలజ, కుమార్‌ల స్నేహం కొనసాగింటే బాగుండేదేమో? 'కొత్తగాలి' శీర్షిక బాగుంది.

**–పి. దాక్షాయణి, హైదరాబాద్**

★ 'మరోవసంతం' నవల మనసును ఉత్సాహపరిచింది. ప్రేమించడానికి వయసుతో నిమిత్తం లేదని ఈ నవల తెలియజేసింది. అలాగే, 'అపార్ట్‌మెంటాలజీ', 'ఇదీవేదం' శీర్షికలు అద్భుతంగా సాగుతున్నాయి. 'కొత్తగాలి' చాలాబాగుంది. అలరించే శీర్షికలతో సాగుతున్న 'చతుర'కు అభినందనలు.

**–ముమ్మిళ్ల వందన, కిషన్‌పుర, హన్మకొండ**

---

చిరునామా: మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ –500 082

ఈ మెయిల్ చిరునామా: chatura@eenadu.net

# ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన కేరళ వారి ప్రత్యేక చికిత్సలు!!

❖ త్రాగుడు మానండి! మాన్పించండి!! STOP ALCOHOL!!! ❖ చుండ్రు, జుట్టు రాలుట, పేను కొరుకుడు, బట్టతల! నెరసిన జుట్టు!! ❖ ఉబ్బసం, ఎలర్జీ వ్యాధులు ❖ సంతానము లేని దంపతులకు సంతానోత్పత్తి కణాలు తక్కువగా ఉన్న మగవారికి కణాలలో కదలిక (Motility) లేనివారికి స్త్రీలకు అండాశయముల నుండి అండములు విడుదల కాకపోవుట, అండవాహికలు (FALLOPIAN TUBES) ముడుచుకొని పోవుట, ఎండోమెట్రియాసిస్, ❖ అన్ని రకముల గర్భకోశ వ్యాధులకు రసాయన, వాజీకరణ పద్ధతుల ద్వారా చికిత్స చేయబడును. ❖ స్త్రీల తెలుపు, ఎరుపు వ్యాధులు, బహిష్టు నొప్పిరుతుక్రమము సక్రమముగా లేకపోవుట, ❖ గర్భాశయ వ్యాధులకు గర్భసంచి తీసివేయకుండా (ఆపరేషన్ లేకుండా) ❖ ఆకర్షణీయమైన అందమునకు మొటిమలు, నల్లని మచ్చలు, మంగు, పొడ పొక్కులు, ముడుతలు ❖ నూతన యవ్వన శక్తికి, శీఘ్రస్కలనము, నపుంసకత్వము (IMPOTENCY) రతిమధ్యలో అంగము మెత్తబడి చిన్నగా ముడుచుకొని పోవుట, వృషణములు కుష్మించిపోవుట. ❖ సుఖవ్యాధులు, వ్రణములు, పుండ్లు, సవాయి, కొరుకుడు, గనేరియా, సిఫిలిస్, గ్లీట్ షాంక్రాయిడ్, హెర్పిస్ (HERPES) ❖ స్తనముల బిగువుకు, జారిన (వాలిన) మెత్తని, చిన్నగానున్న స్తనముల సైజును పెంచి, గట్టిగా, గుండ్రముగా స్త్రీలను అందముగా కనబడునట్లు చేయును. ❖ స్త్రీలకు పొత్తి కడుపుమీద గోకిన గీతలు, చారలు (SCRECH MARKS) పోవుటకు. ❖ మలబద్ధకము ❖ గ్యాస్ ట్రబుల్, ఎసిడిటి, అల్సర్స్, ❖ రక్త మొలలు, అర్శ మొలలు ఫిషర్స్, భగందరము (ఆపరేషన్ లేకుండా) ❖ చర్మవ్యాధులు, గజ్జి, జిల, దురద, ఎలర్జీ, దద్దుర్లు, తామర, చల్లీ, విసర్పి ❖ పులిపిర్లు, ఆనెలు ❖ సోరియాసిస్ (PSORIASIS) ❖ బొల్లి (LEUCODERMA) ❖ కుష్టు (LEPROSY) ❖ స్థూలకాయము (OBESITY) (NODIET, NOEXERCISE) సన్నగా, బలహీనముగా నుండువారు, బరువు, లావు పెరుగుటకు, (ఎత్తు పెరుగుటకు 21 వయస్సు లోపలవారు) ❖ మధుమేహము, షుగరు (DIABETES MELLITUS) అతిమూత్రము (DIABETES INSIPIDUS) ❖ షుగరు వలన మానని గాయములు, పుండ్లు, అల్సర్స్, గాంగ్రీన్ వంటివి మాన్పించుటకు ❖ రక్తపోటు (BP)అల్ప రక్తపోటు (LOW BP) ❖ పక్షవాతము (PARALYSIS) ❖ కీళ్ళు, కండరాల నొప్పులకు, కీళ్ళవాతము, నరములవాపు, మెడనొప్పి, తుంటి నొప్పి, సయాటిక, నడుము నొప్పి, వెన్ను నొప్పి ❖ మూర్ఛ, అపస్మారకము (FITS) (EPILEPSY) ❖ రాజక్షయ, క్షయ (PULMANARY TUBERCULOSIS) ❖ అండవృద్ధి - గిలక (HERNIA) (ఆపరేషన్ లేకుండా) ❖ వరి బీజము - బుడ్డ (HYDROCELE) (ఆపరేషన్ లేకుండా) ❖ పళ్ళ నొప్పులు, చిగుళ్ళ నుండి రక్తము, చీము కారుట, పుప్పి పళ్ళు, పళ్ళు కదలుట, పళ్ళు పచ్చగా నల్లగా రంగు మారుట, నోటి దుర్వాసన ❖ ముక్కు నుండి రక్తము కారుట ముక్కులో కంతులు (NOSAL POLIPS) (SINUSITIS) (ఆపరేషన్ లేకుండా) ❖ చెవిపోటు, చెవిలో చీముకారుట, చెవుడు, చెవిలో హోరు శబ్దము (ఆపరేషన్ లేకుండా) ❖ కంటి శుక్లములు (CATARACT) హ్రస్వదృష్టి, దీర్ఘ దృష్టి, దృష్టి మాంద్యము (ఆపరేషన్ లేకుండా) ❖ లివర్ వ్యాధులు, లివరు గట్టి పడుట (CIRRHOSIS) లివరులో పుండు (ABSCESS) లివర్ వాచుట, నొప్పి, వేడి, మంట మరియు పచ్చకామెర్లు (HEPATITIS, A,B,,NONA, NONB) మొ॥ ఒక వైరస్ వలన సంక్రమించిన కామెర్లు, ప్లీహము వాచుట (ENLARGE SPLEEN) ❖ మూత్రపిండముల వాపు (NEPHRITIS) మూత్రావయవములలో రాళ్ళు (RENALCOLIC & URINARY CALCULUS) ❖ మూత్రము వెళ్లునపుడు మంట నొప్పి, రక్తము పోవుట, పిత్తాశయములో రాళ్ళు (STONES IN GALLBLADER) ❖ క్లోమ గ్రంధి యందు రాళ్ళు (STONES IN PANCREASIS) ❖ ప్రొస్టేటు గ్రంధివాపు (ENLARGEMENT OF PROSTATE) ❖ గుండె నొప్పి గుండెదడ, గుండె రక్తనాళముల నుండి రక్తము సరిగా అందకపోవుట ❖ థైరాయిడ్ సమస్యలు (THYROID) ❖ ముసలితనం లేకుండా చేసి వయస్సును నిలుపుటకు ❖ నత్తిని తగ్గించుటకు ❖ జ్ఞాపక శక్తిని పెంచుటకు ❖ చనుబాలు వృద్ధి చెందుటకు ❖ స్త్రీల శరీరం పై వచ్చు అవాంచిత రోమములు తిరిగి మొలవకుండా చేయుటకు ❖ HIV/AIDS, CANCER/LUKEMIA, ALZHEIMERS, SCHIZOPHRENIA.

**అన్నిరకముల దీర్ఘకాల వ్యాధులకు సంప్రదించండి. మాకు మరెక్కడా బ్రాంచీలు లేవు.**

# కేరళ ఆయుర్వేద వైద్యశాల

**ఓడియన్ 70MM థియేటర్ దగ్గర, రెమాండ్స్ & Fantoosh Showroom ప్రక్కన, రూపాని టెక్స్‌టైల్స్ పైన, చిక్కడపల్లి మెయిన్‌రోడ్, హైదరాబాద్-20 ఫోన్: 65526109, 9866155109, 9392355590**

**Note:** పోస్ట్ ద్వారా కూడా చికిత్స కలదు ఉత్తరాల ద్వారా మీ సమస్యలను తెలియచేసి, మీ దగ్గర ఉన్న రిపోర్టు పంపి ఫోన్ ద్వారా సంప్రదించి చికిత్స పొందవచ్చును. మందు ఖరీదు మరియు పోస్టల్ ఛార్జీ రూ. 60/- కలిపి మనియార్డర్ లేదా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా మీ ఫోన్ నెంబరుతో సహా పంపించండి.

**Timings: 10 A.M to 8 P.M Sunday 10 A.M to 2 P.M**

అపార్ట్‌మెంటాలజీ -3

# ప్రీ నర్సరీ ఉయ్యాలా జంపాలా



(గత సంచిక తరువాయి)

యర్రంశెట్టి సాయి

"రేపు వాడిని ఇదే 'బాంబ్'కి సంబంధించి అనుమానితుడని చెప్పి తీసుకొచ్చి లాకప్‌లో పడేయండి. పాతిక లక్షలు మనకి మామూలివ్వందే వదలద్దు సాలేగాడిని!"

ఇదంతా చూస్తున్న టీవి చానెల్ తాలూకు గిరీశం ఆ అధికారి దగ్గరికొచ్చి గిరజాలు గోక్కుంటూ నిలబడ్డాడు.

"సార్! మీరు ఆ చాంద్ ఫైల్వాన్ గురించి మాట్లాడుకుంటున్న మాటలన్నీ లైవ్ టెలికాస్ట్ అవకుండా ఆపాను సార్" అన్నాడు రహస్యంగా.

"ఓ గాడ్" తలకొట్టుకున్నాడు పోలీస్ అధికారి.

"మీ చానెల్స్ వచ్చాక మాకు పెద్ద న్యూసెన్స్ అయిపోయిందయ్యా! మా సెటవ్‌ల ఇళ్ళకెళ్దామంటే భయం! పబ్లిగ్గా లంచాలు లాగుదామంటే భయం! ఆఖరికి మా పెళ్ళాం పక్కలో పడుకున్నా వదిలేటట్లు లేరు" విసుక్కున్నాడతను.

"న్యూసెన్స్ అన్నమాట నిజమేగానీ మరి మీరు చేసే పాజిటివ్ థింగ్స్ అన్నీ లైవ్‌గా చానెల్స్ చూపిస్తోంటే మీకెంత గ్లామర్ పెరిగిపోతోందో ఆలోచించారా? మా వీడియో కవరేజ్‌ని బట్టి మొత్తం 24 మంది ఇన్‌స్పెక్టర్లకు ప్రమోషన్ కూడా దొరికింది!"

"ఆ మాటలో కొంతవరకూ నిజం ఉందిలే" వప్పుకున్నాడతను.

"అయినా మాదే మూలకి సార్! మహా అయితే మీకొచ్చే దాంట్లో టెన్‌పర్సెంట్ కమిషన్ అడుగుతున్నాం! అంతేకదా!"

"సరే సరే సరే... ఎంతో కొంత ఇస్తాన్లే! ఇప్పుడు అందరి ఎదురుగా అరవకు, బావుండదు"

"అలాగే సార్" అంటూ పక్కనున్న అసిస్టెంట్ చెవి కొరికాడు.

"పదక్కర్లా! అయిదిచ్చినా చాలు- బోలెడు డబ్బు మనకి"

"మరిదాంట్లో మన చానెల్ ఓనర్ షేర్ అడుగుతాడుగా"

"ష్- అరవకు- మైక్ లాగేస్తుంది"

సరిగ్గా అదే హడావుడిలో అందరూ ఉండగా ఓ స్టూడెంట్ వచ్చి అదే స్కూటర్

లాక్ తీసి స్టార్ట్ చేయడానికి కిక్ కొట్టాడు.

మరుక్షణంలో జనమంతా అరచి కేకలేసేసరికి పోలీసులు అలర్ట్ అయి అతని చేతులు విరిచి పక్కకు లాక్కొచ్చారు.

"ఎందుకురా? ఆ స్కూటర్ తీశావ్? దొంగతనానికేనా?"

"దొంగతనమా? నా స్కూటర్ నేను దొంగతనం చేయటమేమిటి సార్?"

"ఆ? ఇది నీ స్కూటరా?"

"అవున్సార్?"

"అయితే మరి పొద్దున్నుంచీ ఇక్కడెందు కొదిలావ్?"

"ఆ చివరి బ్లాక్‌లో మా ఫ్రెండ్ ఉంటే వచ్చాను"

హమీద్ మియా చప్పున ముందుకి దూసుకొచ్చాడు

"చివరి బ్లాక్‌లో ఎవరిల్లది?"

ఆ కుర్రాడు కొంచెం కంగారుపడ్డాడు.

"ఫ్లాట్ నెంబర్ గుర్తులేదు - ఫోర్త్ ఫ్లోర్"

"అలాగా! మీ ఫ్రెండ్ పేరేంటి?"

"మా ఫ్రెండ్ పేరా? మా ఫ్రెండ్ పేరు.. మా ఫ్రెండ్ పేరు.. ఆ! రంజన్"

"రంజనా? ఏం చదువుతున్నాడు?"

"ఎమ్‌సిఏ-"

ఆ బ్లాక్‌లో ఉన్న ఎంసిఎ స్టూడెంట్స్ ఇద్దరు ముందుకొచ్చారు.

"మా బ్లాక్‌లో అసలు రంజన్ అనే పేరుగలాళ్ళెవరూ లేరే-"

అతను మళ్ళీ కంగారుపడ్డాడు.

"లేరా! సారీ - అయితే పేరు మర్చిపోయాను"

ఇన్‌స్పెక్టర్ లాగి ఆ స్టూడెంట్ నెత్తిమీద కొట్టాడు.

"ఏంట్రా నకరాలు జేస్తున్నావ్? నిజం చెప్పు- ఎవళ్ళింట్లో ఉన్నావ్ ఇంతసేపూ"

"మా క్లాస్‌మేట్ ఒకమ్మాయి ఉంది సార్! ఆ అమ్మాయి ఇంట్లో ఉన్నాను-"

"వెళ్లి ఆ అమ్మాయి ఫాదర్ని తీసుకురా!"

"ఫాదర్, మదర్ ఇద్దరూ ఊళ్ళో లేరు



సార్- మా ఫ్రెండ్ ఒక్కర్తే ఉంది-"

వెనుకనుంచి మా అపార్ట్‌మెంట్ స్టూడెంట్స్ విజిల్స్ వేశారు.

"లవ్ ఎఫైర్- లవ్ ఎఫైర్" అంటూ అరిచారు కొంతమంది.

ఈలోగా ఆ చివరి బ్లాక్‌లోనే ఉండే రామచంద్రం ముందుకొచ్చాడు.

"ఏదో ప్రేమ వ్యవహారం అయుంటుం దిలే- పోనీండి" అన్నాడు ఇన్‌స్పెక్టర్‌తో.

"ఎలా పోనిస్తామండీ! వీడి లవ్ ఎఫైర్ వల్ల మాకు, ఆ బాంబ్‌స్క్వాడ్ వాళ్ళకు ఎంత ఇబ్బంది అయింది"

"అయినా మా అపార్ట్‌మెంట్స్‌లో ఇలాంటి లవ్ అఫైర్స్ జరగటానికి వీల్లేదు. ఇంకోసారి ఇక్కడికి రాకుండా వీడిని నాలుగు తన్ని పంపాల్సిందే" అన్నాడు మా ప్రెసిడెంట్ హమీద్ మియా.

మా కల్చరల్ సెక్రటరీ శంకరమూర్తి మాత్రం జాలిపడ్డాడు.

"దానికి పరిష్కారం తన్నటం కాదండీ! వాళ్ళిద్దరికీ పెళ్ళి చేసిపారేస్తే సరి! ఇంక లైఫ్‌లాంగ్ లవ్ సంగతి మర్చిపోయి కొట్టుకు ఛస్తారు" అన్నాడు హాపీగా.

రామచంద్రం కూడా శంకరమూర్తిని సపోర్ట్ చేశాడు.



"మా కల్చరల్ శెక్రటరీగారు కరెక్ట్‌గా చెప్పారు సార్- వాళ్ళిద్దరికీ మీ పోలీసుల చేతిమీదుగానే పెళ్ళి చేసేస్తే సరిపోతుంది. ఎలాగూ మీ పోలీసులు ఈమధ్య చేస్తున్న మెయిన్ బిజినెస్ అదేకదా!"

పోలీస్ అధికారి సంబరపడ్డాడు.

"అఫ్‌కోర్స్- నాకేం అబ్జక్షన్ లేదు. ఏమోయ్ ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకుంటావా? "

"నాకిష్టమేగానీ అమ్మాయి తరపువాళ్ళు వప్పుకోరు సార్-"

పోలీస్ అధికారి నవ్వాడు.

"మేముంది ఎందుకోయ్! ఎవరూ వప్పుకోకపోయినా ప్రేమికుల్ని కలిపేసి మూడు ముళ్ళూ వేయించేయడానికి మాకు అధికారం ఉంది-"

"అయితే ఇంక ఆలస్యం ఎందుకు? ఆ అమ్మాయిని తీసుకురండి" హమీద్ మియాకి చెప్పాడు రామచంద్రం.

హమీద్‌మియా, శంకరమూర్తి, ఇంకా అక్కడున్న స్టూడెంట్ గ్యాంగ్ చివరి బ్లాక్ వేపు వెళ్ళారు షైనీని తీసుకుని.

ఈలోగా రామచంద్రం ఆ అపార్ట్‌మెంట్స్ వాళ్ళందరికీ తను కాలేజ్ డేస్‌లో ఎన్ని ప్రేమ జంటలకు రహస్యంగా పెళ్ళిళ్ళు చేసి కాపురాలు పెట్టించిందీ చెప్తోంటే పోలీసులు కూడా చాలా ఆసక్తిగా వింటున్నారు.

మధ్యలో ఆ అమ్మాయిని తీసుకుని హమీద్‌మియా గ్యాంగ్ వచ్చేశారు.

"సార్! ఈ అమ్మాయి నిజంగా అమ్మాయి కాద్సార్-"

అందరూ అదిరిపడ్డారు.

"అంటే ఆడవేషంలో ఉన్న మగ టెర్రరిస్టా? " అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"అహహా... నా ఉద్దేశం అది కాద్సార్! ఈ అమ్మాయి అమ్మాయేగాని నిజంగా అమ్మాయి కాద్సార్-"

అందరూ హమీద్‌మియా మాటలు అర్థంకాక తలలు పట్టుకున్నారు.

అంతవరకూ ఓ పక్క జనానికి తన ఎడ్వెంచర్స్ చెప్తోన్న రామచంద్రం ముందు కొస్తూ ఆ అమ్మాయిని చూసి షాకయ్యాడు.

"నువ్వెందుకొచ్చావే ఇక్కడికి? అసలు బయటికెలా వచ్చావ్? బయట తాళంవేసి వచ్చానుగా-"

"అంటే ఈ అమ్మాయి..." అనుమానంగా ఏదో అడగబోయాడు శంకరమూర్తి.

"అవునయ్యా! నా వైఫ్-"

అందరూ ఆ డైలాగు వినటంతోనే హాహాకారాలు చేశారు.

"ఆ! మీ వైఫా? "

"అవును-"

"అంటే ఈ స్టూడెంట్‌కి మీ వైఫ్‌తో లవ్ ఎఫైర్ ఉందా? " ఆశ్చర్యంగా అడిగాడు ఇన్‌స్పెక్టర్.

ఆ స్టూడెంట్ కంగారుగా ఎక్స్‌ప్లేనేషన్ ఇవ్వడం మొదలుపెట్టాడు.

"సార్- సంగతేంటంటే మేము ప్రేమించుకున్నప్పుడు ఆ అమ్మాయి ఆయన వైఫ్ కాదండీ! అంటే అప్పుడు ఇంకా ఆమెకు పెళ్లి కాలేదన్నమాట! ఆ తరువాత నేను జాబ్స్‌కి బాంబే వెళ్లి వచ్చేలోపల ఆమె తల్లిదండ్రులు ఆమెకు రెండోపెళ్లి చేసేసారండీ- అందుకే ఇద్దరం సీక్రెట్‌గా కలుసుకుంటున్నామండీ"

"ఒరేయ్- నిన్ను- మర్డర్ చేస్తారా" అంటూ రామచంద్రం అతని మీదకు దూకేసరికి పోలీసులు అడ్డుపడ్డారు.

"పోనీలే ఇంతదూరం వచ్చినందుకు ఒక లాభసాటి కేసు దొరికింది! వెళ్లు. ముగ్గురినీ స్టేషన్‌కి తీసుకు పదండీ" అరిచాడు ఇన్‌స్పెక్టర్.

వెంటనే గిరీశం కెమెరా ఆన్ చేశాడు.

"గిరీశం! ఏం జరుగుతోందక్కడ?



బాంబ్ స్క్వాడ్ వాళ్లకు బాంబ్ దొరికిందా?" అడిగింది చానల్ న్యూస్ డెస్క్.

"దొరకలేదు గానీ అంతకంటే పెద్ద ఆటమ్‌బాంబ్‌లాంటి లవ్ స్టోరీ దొరికింది గజనీ!"

ఒక స్టూడెంట్ ఒకమ్మాయిని ప్రేమించి ఆ అమ్మాయికి వేరొకరితో పెళ్లి అయిపోయినా గానీ అక్రమ సంబంధం కొనసాగిస్తూ ఆమెని పెళ్లి చేసుకోవాలనుకుంటున్నాడు. ఆ అమ్మాయి భర్తేమో ఇద్దర్నీ మర్డరు చేయాలని ప్లాన్‌లో ఉన్నట్లు పోలీస్ వర్గాలు తెలియజేస్తున్నాయి. ఈ సందర్భంగా ఆ అమ్మాయితో మాట్లాడి అన్ని వివరాలు తెలుసుకుందాం-"

"రంజనిగారు! మీకు, ఈ స్టూడెంట్‌కీ ఎప్పటినుంచీ పరిచయం..."

దాంతో టి.వి.లో కనబడాలని ఉవ్విళ్లూరుతున్న మా అపార్టుమెంట్ లేడీస్ అందరూ మగాళ్లందర్నీ వెనుకకు నెట్టి కెమెరా చుట్టూ నిండిపోయారు.

★ ★ ★

హఠాత్తుగా మాకెదురుగా ఉన్న అపార్ట్‌మెంట్‌లో నుంచి బిగ్గరగా ఏడుపులు వినిపించేసరికి, ఏం జరిగిందో అర్థం కాక నేనూ, మా సొసైటీ కల్చరల్ సెక్రటరీ శంకరమూర్తి డోర్ తెరచి ఆ ఫ్లాట్‌లోకి పరుగెత్తాం.

అప్పటికే మా సొసైటీ జనరల్ సెక్రటరీ మొహిందర్‌సింగ్, ప్రెసిడెంట్ హమీద్ మియా, యూత్‌వింగ్ సెక్రటరీ విజయ్ యాదవ్, షైనీ అందరూ గుమికూడి ఉన్నారు. మధ్యలో ఆ ఫ్లాట్ ఓనర్ బోసుబాబు, వాళ్ళావిడా దిగాలుపడి కూర్చుంటే బోసుబాబు అత్తగారు ఇల్లెగిరేంత గొంతుతో ఏడుస్తోంది.

"ఇంక వీడి ఫ్యూచరేమిట్రా దేవుడో- వీడి జీవితం నాశనమైపోయింది నాయనోయ్-" అని ఆవిడ ఏడుస్తోంటే షైనీ, మొహిందర్ సింగ్, హమీద్‌మియా, అవధాని, విజయ్ యాదవ్ ఆమెని ఓదారుస్తున్నారు.

"ఏడవకండి! ఇదంతా అల్లామియా డెసిషన్! అపన్ క్యా కర్ సక్‌తే?" అంటున్నాడు హమీద్‌మియా!

"మేమంతా ఉన్నాం కదురా భయ్! గట్ల పరేషానయితే ఎలా?" అంటున్నాడు విజయ్‌యాదవ్.

అసలేం జరిగిందో, నాకూ, శంకరమూర్తికీ కూడా అర్థం కావటంలేదు.

"ఏం జరిగింది?" విజయ్‌యాదవ్‌నడిగాడు శంకరమూర్తి

"ఎట్ల జెప్పాల్నో సమజ్ కావటంలేదు. రాక రాక ఇంత మంచి మనిషి బోసుబాబుకే ఈ పరేషాని రావాల్నా?" అన్నాడు విజయ్‌యాదవ్.

"అంటే ఏమైంది? ఒకవేళ అతనికి ఎయిడ్స్ వచ్చిందా?" డౌటుగా అడిగాడు. దాంతో బోసుబాబు మండిపడ్డాడు.

"నాకు ఎయిడ్సా? ఏంటి? పిచ్చిపిచ్చిగా ఉందా?" కోపంగా శంకరమూర్తినడిగాడు.

"ఎవరూ విషయం చెప్పకపోతే అలాంటి అనుమానాలే వస్తయ్ మరి!" అన్నాన్నేను శంకరమూర్తికి సపోర్ట్‌గా!

"మా అబ్బాయి ఇంటర్వ్యూలో ఫెయిలయ్యాడ్రా భయ్!" చిరాగ్గా చెప్పాడు బోసుబాబు. అతని మాటలతో మాకు కన్‌ఫ్యూజన్ ఇంకా ఎక్కువయిపోయింది.

ఎందుకంటే బోసుబాబుకి ఇంటర్వ్యూలకు హాజరయేంత వయసు గల కొడుకులెవరూ లేరని అందరికీ తెలుసు.

"మీ అబ్బాయా?"

"అవునయ్యా! నేన్చెప్పేదేంటి మరి?"

"నీకు జాబ్ కోసం ఇంటర్వ్యూలకెళ్ళేంత పెద్ద కొడుకెక్కడున్నాడని?"

అడిగాడు శంకరమూర్తి అనుమానంగా. మాకు పాత తెలుగు సినిమాలు కొన్ని గుర్తుకొచ్చాయ్.

ఓల్డ్ శోభన్‌బాబు జీవితంలోకి సడెన్‌గా ఓ యంగ్ శోభన్‌బాబు వచ్చి "నాన్నా! నేను నీ కొడుకుని! అమ్మ మీ దగ్గరకెళ్ల మంది!" అంటూ డైలాగ్ కొట్టేవాడు.

బోసుబాబు మా ఇద్దరివంకా 'డిజ్ గస్టింగ్'గా చూశాడు.

"అరే- నీయవ్వ- ఇంటర్‌వ్యూ అంటే ఆ ఇంటర్‌వ్యూ కాదురా భయ్- ప్రీనర్సరి- ఉయ్యాలా జంపాలా స్కూల్ ఇంటర్‌వ్యూ-"

మేము ఉలిక్కిపడ్డాం.

"ఏంటది? ప్రీ నర్సరీ- ఉయ్యాలా జంపాలా స్కూలా?"

"అంటే ఆ స్కూలు పేరే వినలేదా మీరు? మంచిగు న్నార్లే! మన ట్విన్ సిటీస్‌లో బెస్ట్ ప్రీ నర్సరీ స్కూలది!" అంది షైనీ మా అవస్థ చూసి వివరణ ఇస్తూ.




"అలాంటి పేరు గల స్కూల్ ఉన్నట్లే తెలీదు నాకు" అన్నాడు శంకరమూర్తి కొంచెం గిల్టీగా ఫీలవుతూ.

"గల్లీకో స్కూలున్నది ఇయాళ్రేపు! ఎన్నని గుర్తుంటయ్?" శంకరమూర్తిని సపోర్ట్ చేశాడు విజయ్ యాదవ్.

"చాలా మంచి స్కూలన్నా అది! రీసెంట్‌గానే ఎన్ఆర్ఐలు ఓపెన్ చేసిన్రది! నర్సరీ కంటే కూడా చిన్న పిల్లల గురించన్నట్లు! జబర్దస్త్ స్కూలంటలే! అమెరికన్ స్టాండర్డ్!" వివరించాడు మొహిందర్‌సింగ్.

"అవ్! బహుత్ ఫేమస్ స్కూల్ హై! మొన్న అడ్మిషన్స్ టైమ్‌ల రద్దీ ఎంత ఎక్కువయిందంటే- యాభైమంది తల్లులు ఆ నూకుడులో హాస్పిటల్‌ల జాయినవాల్సి వచ్చింది. ఎడ్యుకేషన్ మినిష్టర్ మేడమ్ ఎంక్వయిరీ కూడా ఆర్డర్ జేసింది. ఆ ఎంక్వయిరీ కమిటీల మా కజిన్ బ్రదర్ షకీతమియా ఒక మెంబరన్నట్లు - ఆ కమిటీ ఏం రిపోర్టిచ్చింది ఎరికేనా" అడిగాడు హమీద్‌మియా.

"ఏమిచ్చింది?" మిగతా వాళ్లంతా అతని చుట్టూ గుమికూడారు.

"ఆస్కూల్లోనే ఒక మంచి ఎన్ఆర్ఐ దవాఖానా భీ ఓపెన్ చేస్తేగట్ల అడ్మిషన్ టైమ్‌ల దెబ్బలు తగిలే పేరెంట్స్‌ని అక్కడే ఆ దవాఖానాలోనే అడ్మిట్ చేయొచ్చని ఇచ్చిన్రు! ఇక ఆడూ ఈడూ ఎందుకని ఆ స్కూల్ ఓనరే హాస్పిటల్ కూడా షురూ జేసిండు!"

"అట్లాగా! ఆ హాస్పిటల్ పేరేంటి?" అడిగాడు శంకరమూర్తి.

"తల్లివడి!"

"ఆహా! ఎంతబాగా పెట్టాడండీ! మరా హాస్పిటల్లో చేరేది ఆ స్కూల్లో అడ్మిషన్‌కొచ్చిన తల్లులూ, వాళ్ల పిల్లలే కదా!" మెచ్చుకున్నాడు రెడ్డి. అయినాగానీ నా కన్‌ఫ్యూజన్ పోలేదు.

"నాకింకా కన్‌ఫ్యూజన్ పోలేదు బోసుబాబూ! మీ అబ్బాయి నాలుగో క్లాస్‌లో ఆల్‌రెడీ చేరాడు కదా! మళ్లీ వాడిని 'ప్రీ నర్సరీ- ఉయ్యాలా జంపాలా స్కూల్లో ఎందుకు చేర్పిస్తున్నట్లు?"

బోసుబాబు నెత్తికొట్టుకున్నాడు.

"అబ్బా! నువ్ మాట్లాడేది మా పెద్దాడి సంగతయ్యా. నేను మాట్లాడేది మా రెండోవాడి సంగతి!"





శంకరమూర్తి ఇంకా కన్ఫ్యూజయిపోయాడు.

"రెండోవాడేంటి. నీకుంది ఒకడే కొడుకు కదా? "

"అబ్బా! పదినెలల క్రితం రెండోవాడు పుట్టాడు లేవయ్యా! వాడిని ఉయ్యాల్లో వేసేరోజున పార్టీ కూడా ఇచ్చాను మీ అందరికీ! పార్టీదొబ్బి కూడా ఆ విషయం గుర్తుపెట్టుకోలేదంటే దిసీజ్ టూమచ్" కోపంగా అన్నాడు బోసు.

శంకరమూర్తి, నేనూ నాలిక్కరచుకున్నాం.

"సారీ బ్రదర్! మన దేశంలో ఏదయినా గుర్తుపెట్టుకోవచ్చుగానీ పాపాయిలు పుట్టిన వేళావిశేషాలు గుర్తుంచుకోవటం చాలా కష్టం! ఎందుకంటే మన ఎచీవ్‌మెంట్ అదొక్కటే కదా-"

శంకరమూర్తి పాపం ఇంకా కన్ఫ్యూజన్ నుంచి బయట పడలేకపోతున్నాడు.

"అదిసరే మీపాపాయికి పదినెలలే వయసంటున్నావ్- మరి అప్పుడే స్కూలు అడ్మిషన్ గొడవేమిటి? " అడిగాడు బుర్రగోక్కుంటూ

"ఇదిగో- పాపం బోసుబాబు ఓ పక్క వాళ్ళ రెండో కొడుక్కి పదినెలల వయసొచ్చేసిందని చెప్తూంటే ఇంకా పాపాయ్ పాపాయ్ అంటావేంటి? " విసుక్కున్నాడు విజయ్ యాదవ్.

"అంటే- పది నెలల వయసొస్తే వాడిక పాపాయి కాడా? "

మా ఆర్గుమెంట్ బోసుబాబు భార్యకు కోపం తెప్పించింది.

"ఇంకా పాపాయి, పాపాయి అంటారేం టన్నయ్యగారూ! 'ఇంకా మీవాడిని స్కూల్లో వేయలేదా? ' అంటూ మా బంధువులూ, పరిచయస్తులు ముక్కున వేలేసుకుంటున్నారు" అంది చిరాకుగా.

రాజిరెడ్డి అయోమయంగా తలగోక్కున్నాడు.

"పదినెలలకే స్కూల్లో జాయిన్ చేసేయ్యాలా? " విచిత్రంగా చూస్తూ అడిగాడు.

"అయ్యో! రోజులెలా ఉన్నాయ్ మరి? జనాభా పుట్టగొడుగుల్లా పెరిగిపోతూంటే దాంతో పాటు కాంపిటీషన్ కూడా పెరిగిపోవటంలా? ఇలాంటి పోటీలో మా వాడు ఏమాత్రం వెనుకబడినా మేమేమయిపోతాము? తల్చుకుంటేనే గుండె పగిలిపోతోంది" అంది బోసు తల్లి కల్యాణమ్మ బావురుమంటూ.

"మీరింకా పాతకాలంలోనే అఘోరించారు కనుక మన చుట్టూ ఏం జరుగుతుందో తెలిసి చావటంలా! చాలామంది పిల్లలను ఆరో నెలల్లోనే ప్రీ నర్సరీలో వేసేస్తున్నారు-" అంది షైనీ మమ్మల్ని ఇన్సల్ట్ చేస్తూ.

"ఏంటీ! ఆరో నెలకే స్కూలా? " గుంపులో నుంచి ఓ గోవిందయ్యాషాకయిపోతూ అడిగాడు.

"వెంటనే షైనీని వింధ్యాదేవి సపోర్ట్‌చేసింది."

"అవును- మొన్నటికిమొన్న మన అపార్ట్‌మెంట్స్‌లోనే ఇ బ్లాక్‌లో ఒకళ్ళు ఆరు నెలల్లోనే వాళ్ళపాపాయిని 'ఉయ్యాలా జంపాలా' స్కూల్లో వేశారు."

ఆమాటవినేసరికి అందరికీ గుండెలు ఝల్లుమన్నాయ్.

"మంచిగయింది! మనలో ఎవళ్ళకీ ఆరు నెలలు పైబడిన పిల్లల్లేకపోయిరి" అన్నాడు మొహిందర్‌సింగ్.

ఆడైలాగ్‌తో అందరూ సంతృప్తిగా ఫీలయ్యారు.

"ఈ లెక్కన మన దేశం ఎటుదిక్కుపోతున్నట్లు? ముంగటికా, వెనక్కా? " అడిగాడు బ్రహ్మయ్యచౌదరి.

"ముందుకెళ్ళనీకీ- వెనక్కుపోనిక్కూడా జాగాలేదురా భయ్! జనాభా అంతగా పెరి

గిపోతున్నది! మనం వెళ్ళగలిగేందుకు ఒకే ఒక్క డైరక్షన్ ఉంది."

"ఏ డైరక్షనది?" విజయ్ యాదవ్ డౌటుగా అడిగాడు.

"ఇంకే డైరక్షను? కిందకి! అంటే పాతాళానికి"

"కానీ అక్కడికెలా వెళ్తాం?" అడిగాడు అవధాని.

"అది కూడా తెలీందే నువ్వేం జర్నలిస్ట్ వయ్యా! భూకంపాలు, సునామీలు వస్తే మనం వెళ్ళేది పాతాళం డైరక్షనే కదా!" చిరాగ్గా అన్నాడు హమీద్ మియా.

"ఇప్పుడు మా పిల్లడికేందారి నాయనోయ్! వాడి జీవితం మట్టికొట్టుకుపోయింది దేవుడో" అంటూ బోసుబాబు భార్య సునీతమ్మ మళ్ళీ ఏడుపు స్టార్ట్‌చేసేసరికి మేమందరం ఆమెని ఓదార్చే కార్యక్రమం ప్రారంభించాం!




"మీరేం వర్రీ అవకండమ్మా! మన సొసైటీ ప్రెసిడెంట్ హమీద్ మియాకీ, అటు మొహిందర్‌సింగ్‌కీ కొన్ని స్కూళ్ళ మేనేజ్‌మెంట్స్‌తో బాగా పరిచయముంది! వాళ్ళు రంగంలోకి దూకారంటే మీ వాడికి అడ్మిషన్ గ్యారంటీ!" అన్నాడు రాజిరెడ్డి

"ఒకవేళ వాళ్ళతో పని కాకపోతే నేను చీఫ్ మినిష్టర్ రాజశేఖరరెడ్డిగారితో మాట్లాడి మన పాపాయికి ఏజ్ బార్ మినహాయింపు 'జీవో' ఒకటి జారీ చేయిస్తా!" అంది షైనీ.

"రాజశేఖరరెడ్డి మీ మాట వింటారా?" షైనీ వేపు అనుమానంగా చూస్తూ అడిగాడు శంకరమూర్తి

"జీవోల విషయంలో ఆయన చాలా లిబరల్ స్వామీ! ఇప్పటికి ఎన్ని జీవోలిచ్చాడో మీకేం తెలుసు"

"సరే- ఆ గొడవ ఇప్పుడెందుగ్గాని అందరం కలసి మన బోసు బాబు వాళ్ళ పాపాయిని తీసుకుని నాకు తెల్సిన స్కూలుకి పోదాం- పదండ్రి" అన్నాడు హమీద్ మియా!

వెంటనే అందరం బోసుబాబు వాళ్ళ పాపాయిని తీసుకుని ప్రీనర్సరీ స్కూలుకి ఊరేగింపులాగా బయల్దేరాం.

వనస్థలిపురంలో ఉం దాస్కూలు

"ప్రీనర్సరీ - ఉగ్గూ ఉంగా స్కూల్" అన్న బోర్డ్ కనబడుతోంది.

"ఇది చాలా ప్రిస్టేజియస్ స్కూల్! ఈ మధ్యే ఓపెన్ చేశారు. మొదటిసారి అడ్మిషన్స్‌కి ఎంతమంది పబ్లిక్ జమయిన్రంటే పోలీసులు లాఠీఛార్జ్, భాష్పవాయు ప్రయోగం లాంటివి చేయాల్సి వచ్చింది. సుమారు నూట నాలుగు మందికి గాయాలు కూడా తగిలాయంట"

అందరం ప్రిన్సిపాల్ రూమ్ కెళ్ళాం!

బయట ప్యూన్ ఎకె ఫార్టీసెవెన్ గన్ పట్టుకూర్చున్నాడు. అతన్ని చూస్తూంటే మాక్కొంచెం భయం వేసింది. ఎందుకంటే అదే మొదటిసారి మేము ఎకె ఫార్టీసెవెన్ గన్ చూడటం. పైగా ఏ ప్రీనర్సరీ స్కూల్లో వాచ్‌మెన్ ఇలా గన్‌లు పట్టుక్కూచోగా చూళ్ళేదు.

***(అడ్మిషన్ దొరికిందో లేదో తెలియాలంటే వచ్చేనెలదాకా ఆగాల్సిందే..)*** ©

శోభనం అనగానే ఎవరికైనా ముచ్చటే! వయసు తమకం ఎంత వేగిరం తీర్చుకుందామా? జంటజాగారం ఎపుడెపుడు చేద్దామా? అని తెగ ఉవ్విళ్లూరుతుంటారు. ఆనందరావు మాత్రం అలాంటివారికి పూర్తి విరుద్ధం. ఏరికోరి అప్సరస లాంటి అమ్మాయిని చేసుకున్నా శోభనం అనగానే ఎక్కడలేని వణుకూ వచ్చేస్తోందతనికి. అందుకే దాన్ని వాయిదా వేసేం దుకు శతవిధాలా ప్రయత్నిస్తున్నాడు. ప్లాన్‌లు వేస్తున్నాడు. అతని ఎత్తులు ఫలించాయా? అసలు ఆనందరావు సమస్య ఏమిటి? అల్లరల్లరిగా, హాయిహాయిగా సాగే హాస్యవల్లరి -కోలపల్లి ఈశ్వర్ నవల ఆనందరావు శోభనం ఈ నెల చతుర కానుక.



"పోనీ ఒప్పేసుకుందామా?" అనిపించింది ఆనందరావుకి.

ముఖ్యమంత్రి అంతటి వ్యక్తితో ఇంకా బతిమాలించుకోవటం ఏం బాగుంటుంది?

"ఒప్పేసుకో... ఒప్పేసుకో..." ఎగదోసింది అతని అంతరాత్మ హుషారుగా!

"సరే సార్... మీరంతగా చెబుతున్నారు కాబట్టి..." అనబోయాడుగానీ... అంతలోనే మళ్లీ మనసు మార్చేసుకున్నాడు ఆనందరావు.

పార్టీ మంచిదే కావచ్చు

అధినాయకుడూ మంచివాడే కావచ్చు

అయితే మాత్రం? అసలు రాజకీయాలంటేనే రొచ్చు.. లేదంటే ఓ రొంపి.

మొహమాటానికిపోయి తానందులో కాలు పెట్టడం ఏంటి? ... నో.... ఇంపాజిబుల్...

తను చచ్చినా అలాంటి తెలివితక్కువ పని చేయడు.

చేయడుగాక చేయడు... మనసులో ఒక నిర్ణయానికొచ్చేసి... స్థిరంగా చెప్పాడు ఆనందరావ్.

"సారీ సారీ... మన్నించండి.. మీ మాట కాదంటున్నందుకు మరోలా అనుకోవద్దు... నా ఒంటికి రాజకీయాలు అస్సలు పడవు..."

"అలా అంటే ఎలా ఆనందరావ్? మీలాంటి యువ మేధావుల అవసరం మాపార్టీకీ, మన రాష్ట్రానికి ఎంతో ఉంది. అందుకే కోరి మిమ్మల్ని మా పార్టీలోకి ఆహ్వానిస్తున్నాను... మనస్ఫూర్తిగా..."

ముఖ్యమంత్రి ప్రాధేయపూర్వకంగా అలా అడుగుతుంటే మనసు చలించింది ఆనందరావుకి.

పోనీ ఒప్పేసుకుంటేనో... మళ్లీ అనిపించింది.

కానీ... ఒకసారి నిర్ణయానికొచ్చాక మళ్లీ మనసు మార్చుకుంటే ఎలా?

"నో సార్... దయచేసి నన్ను ఒత్తిడి చేయకండి... ఒక పౌరుడిగా మన రాష్ట్రానికి సేవ చెయ్యడానికి నేనెప్పుడూ సిద్ధమే... అందుకోసం ప్రత్యక్షంగా రాజకీయాల్లోకి చేరాల్సిన పనేముంది?" చెప్పాడు మళ్లీ స్థిరంగా.

ముఖ్యమంత్రి ముఖంనిండా బాధ అలుముకుపోయింది.

"దయచేసి మరొక్కసారి ఆలోచించండి మిస్టర్ ఆనందరావ్..." ఆఖరి ప్రయత్నంగా మళ్లీ అడిగాడాయన.

"నో సర్... దయచేసి నన్ను ఆ రొంపిలోకి దింపకండి..." నిర్ద్వందంగా చెప్పాడు ఆనందరావు.

ఎదుటి వ్యక్తి మరీ అంతగా బిగిసిపోయినప్పుడు ముఖ్యమంత్రి అయితే మాత్రం ఏం చేయగలుగుతాడు?

"సరే- మిస్టర్ ఆనందరావ్... ఒకవేళ మీరు గనక ఎప్పుడైనా మనసు మార్చుకుంటే నాకు కబురు చేయండి... నేనే స్వయంగా వచ్చి మిమ్మల్ని మా పార్టీలోకి చేర్చుకుంటాను... మా పార్టీ తలుపులు మీ కోసం ఎప్పుడూ తెరిచే ఉంటాయన్న సంగతి మర్చిపోవద్దు..."

అలా అంటుంటే ఒక సమర్థుడైన యువకుడ్ని తన పార్టీలో చేర్చుకోలేకపోతున్నానే అన్న బాధ ఆయన కంఠంలో సుళ్లు తిరిగింది. అది గ్రహించి చెప్పాడు ఆనందరావ్... "నన్ను మన్నించండి... ప్లీజ్..."

"ఇట్సోకే...." చెప్పి... తన మందీ మార్బలంతో సహా వెళ్లిపోయాడు ముఖ్యమంత్రి.

★ ★ ★

"ఎందుకురా మనింటికి సి. యం. గారొచ్చి వెళ్లారంటా?" కాసేపటికి చేతిలో కూరగాయల సంచితో ఇంట్లో కాలు పెట్టిన మాధవరావు అడిగాడు ఆనందరావుని.

ఆయన ఆనందరావుకి తండ్రి!

## వింత జీవి

కోతి ఆకారం, గుడ్లగూబకళ్లు,
పెద్ద కాళ్లతో, తమాషాగా..
చిన్నగా కనిపించే ఈ జంతువు
పేరు టార్సియర్. ఫిలిప్పైన్స్,
ఇండోనేషియాలో ఇవి ఉన్నాయి.
పగలు నిద్రపోయి రాత్రిళ్లు వేటాడే
ఈ జంతువులు 180 డిగ్రీలో
కూడా తల తిప్పి చూడగలవు.
అడవులు నాశనమవడంతో
వీటి సంఖ్య ఇప్పుడు కేవలం
పదివేలేనట.



కొత్తగాలి...

**నేతలకు పదవే**
**అక్షయపాత్ర**
**అది లేకుంటే**
**ప్రేక్షకపాత్ర**

*-కళాప్రియ, కొవ్వూరు*

"నీకెలా తెలిసిపోయింది?" రిమోట్‌తో ఛానెల్ మారుస్తూ అడిగాడు ఆనందరావు.

"తెలీకుండా ఎలా ఉంటుంది? మన సందులో కాలు పెట్టగానే అందరూ దీన్ని గురించే చెప్పుకుంటున్నారు. మాధవరావింటికి సి.యం. వచ్చి పోయాడని! నన్ను చూడగానే అందరూ నామీద కెగబడ్డారు.... ఎందుకండీ ఆయన మీ ఇంటికొస్తా? అని... వాళ్లందర్నీ తప్పించుకుని వచ్చేసరికి తల ప్రాణం తోక్కొచ్చిందనుకో... అది సరే... ఇంతకీ ఆయన మనింటికెందుకొచ్చినట్టని?"

"ఏంలేదు నాన్నా... నన్ను వాళ్ల పార్టీలో చేరమని అడగటానికి! స్టూడెంట్స్ యూనియన్ లీడర్‌గా మా కాలేజీలో నాకు చాలా పేరుందిగా... ఆ రకంగా నా గురించి తెలుసుకుని నన్ను వాళ్ల పార్టీలోకి ఇన్‌వైట్ చేయడానికొచ్చాడన్న మాట..." సింపుల్‌గా చెప్పాడానందరావు.

"దానికి నువ్వేమన్నావ్?"

"ఏమంటాను? వద్దండీ... నాకీ రాజకీయాలంటే నచ్చవ్- నన్నొదిలేయండీ... అని చెప్పి పంపేశాను..." ఇది కూడా సింపుల్‌గానే చెప్పాడు ఆనందరావు.

కానీ మాధవరావు దాన్ని మాత్రం అంత సింపుల్‌గా తీసుకోలేకపోయాడు.

"అదేం వెర్రిపనిరా? సి.యం. అంతటివాడు స్వయంగా వచ్చి ఇన్‌వైట్ చేస్తే కాదంటావా? నీకసలు బుద్ధుందా?" అరిచాడు మాధవరావు మందలింపుగా!

"అంటే ఏంటి? ఆయనొచ్చి పిలిచాడు కాబట్టి ఇష్టం లేకపోయినా సరే- నేను తోక ఊపుకుంటూ రాజకీయాల్లో చేరిపోవాల్నా?" చిరాగ్గా అన్నాడానందరావు.

"ఆపు నీ వెర్రి మాటలు. ముఖ్యమంత్రి అంతటివాడు స్వయంగా వచ్చి పిల్చాడంటే ఎవరైనా వెళ్లకుండా ఉంటారా!... బహుశా నెక్స్ట్ ఎలక్షన్స్‌లో నీకు టిక్కెట్ ఇద్దామనుకున్నాడేమో... మర్యాదగా ఒప్పేసుకుంటే ఎమ్మెల్యే అయ్యేవాడివి... తర్వాత మంత్రి అయ్యేవాడివి. ఇలాంటి మంచి అవకాశాన్ని ఎవ్వరూ ఒదులుకోరు... ఛ.... నీలాంటి శుంఠ తప్ప..." నెత్తి బాదుకుని లబలబలాడాడు మాధవరావు.

కొడుకొక సువర్ణావకాశాన్ని చేజార్చుకుంటే ఏ తండ్రికి మాత్రం బాధ కలక్కుండా ఉంటుంది?

ఆనందరావ్ బాధని ఏమాత్రం అర్థం చేసుకోకుండా తన సహజ ధోరణిలో గీరగా అనేశాడు "అయితే ఏంటట? ఎమ్మెల్యే అవ్వడం, మంత్రవడం అంత గొప్పా?"

"కాదా? ... ఫలానా మాధవరావుగారబ్బాయి మంత్రయ్యాడని అందరూ చెప్పుకుంటుంటే- నాకెంత గర్వంగా ఉంటుంది! ఛ... మరీ ఇంత జ్ఞానంలేనివాడివేంట్రా నువ్వు?" మళ్లీ నెత్తి బాదుకున్నాడు మాధవరావు- ఈసారి కోపంగా!

"నేను చేసింది జ్ఞానంలేని పనేం కాదు... రాజకీయాలంటే నాకు గిట్టదు కాబట్టి- గిట్టదని చెప్పేశానంతే..." తన చర్యని సమర్థించుకుంటూ అన్నాడు ఆనందరావు.

"మీ అమ్మ లేదా సి.యం.గారొచ్చినప్పుడు?"

"లేదు..."

ఒకవైపు దాహార్తితో బీటలువారిన భూములు... మరోవైపు చుక్కనీరైనా రాల్చని గొడ్డుమోతుమేఘాలు! అందరికీ అన్నంపెట్టే అన్నదాతలకు కష్టాలే సహచరులు.. కడగండ్లే బంధువులు!! ఆ రైతన్నలను ఆదుకునేందుకు ప్రభుత్వం ప్రయోగాత్మకంగా ఓ గ్రామంలో ఇజ్రాయిల్ తరహా ఉమ్మడిసాగు పథకం ప్రారంభించింది. తమ కష్టాలు తీరినట్లేనని సంబరపడ్డారు రైతన్నలు. కానీ జరిగిందేమిటి? రైతుకు ఒరిగిందేమిటి?

చతుర నవలల పోటీలో ప్రోత్సాహక బహుమతి పొందిన

పలమనేరు బాలాజీ రచన

# నేల నవ్వింది

మే చతుర లో మీకోసం...

"ఎక్కడికి వెళ్లింది? "

"అనసూయ వాళ్లింటికెళ్లానండీ... వాళ్ల కోడలికేదో వడ్డాణం చేయించానంటేనూ, చూద్దామని వెళ్లాను..." చెప్పింది సావిత్రి అప్పుడే ఇంట్లోకొస్తూ.

"నీకు పద్దాక ఇళ్లట్టుకు తిరగటం తప్ప వేరే పన్లేదు..." మండిపడ్డాడు మాధవ రావు- భార్యని చూస్తూనే.

"ఏమైందండీ? " భర్త కోపానికి కారణం అర్థం గాక ఆమె కాస్త గాభరాగా అడి గింది.

"ఏమవ్వడం ఏంటీ? మంత్రిపదవి పోయింది! సిరిరా మోకాలడ్డేడు నీ సుపు త్రుడు! సి.యం.గారు స్వయంగా మనింటి కొచ్చి నీ కుమార రత్నాన్ని- తమ పార్టీ లోకి ఆహ్వానిస్తే- చేరను పొమ్మనే శాడుట..." ముందు టూకీగా చెప్పి... తర్వాత దాన్నే మరింత వివరంగా చెప్పాడు మాధవరావు.

"నిజంగానా? ఛీ... ఎంతపని చేశా వురా? " ఆమె కూడా బాధగానే అంది. "నేనుంటే ఇలా జరగనిచ్చేదాన్ని కాను..."

"మరదే నేనూ అంటోంది... నీకా కొంప లెంట తిరిగే బుద్ధుండబట్టేగా ఈనాడీ గొప్ప అవకాశం చేజారిపోయింది..." అత్త మీద కోపం దుత్తమీద చూపినట్టు- మళ్లీ భార్య మీద కోపగించుకున్నాడు మాధవ రావ్.

"ఎందుకు నాన్నా అనవసరంగా అమ్మని తిడతావ్? అమ్మున్నా, నువ్వున్నా, ఎవ రున్నా సరే- నేను సి.యం.గారితో అదే చెప్పుండేవాణ్ని... నాతో నాకిష్టం లేని పనిని ఎవ్వరూ చేయించలేరు..." చెప్పాడు ఆనందరావు.

రాజుకన్నా మొండివాడు బలవంతుడు. కొడుకలా అంటుంటే ఇంకేం చేయగలుగు



తాడు మాధవరావు- మరోసారి నెత్తి బాదుకుని-గొణుక్కుంటూ- సోఫాలో కూల బడ్డాడు.

★ ★ ★

"నా పేరు మోహనవంశీ... సినిమాడైరెక్టర్ని..." చెప్పాడా వ్యక్తి... సన్నగా నవ్వుతూ.

సినిమా డైరెక్టర్‌కి తనతో ఏంటి పని? కాస్త ఆశ్చర్యపోయాడు ఆనందరావు. "చెప్పండి... నాతో ఏదన్నా పనుండి వచ్చారా?" అడిగాడు కుర్చీ చూపిస్తూ- తనూ చిన్నగా నవ్వుతూ!

"నా సినిమాలు మీరేవన్నా చూశారా?" అడిగాడు మోహనవంశీ ఆ కుర్చీలో కూర్చుంటూ.

"చూశాను... ఒకట్రెండు..." చెప్పాడు ఆనందరావు సింపుల్‌గా!

"ఏంటవి?"

"ఒకటి 'షరాబి'... రెండు 'ఎడారి'..."

"అంతేనా? అవి ఎప్పటివో.... ఈ మధ్య వచ్చినవేం చూడలేదా?"

వచ్చిన కారణం చెప్పకుండా తన టైం వేస్ట్ చేస్తున్నందుకు ఆనందరావుకి చిరాకేసింది అతని మీద.

"చూళ్లేదు. నాకు సినిమాలు మరీ ఎక్కువగా చూసే అలవాటు లేదు... అద్సరే... అసలు మీరు ఎందుకొచ్చినట్టు?" అడిగాడు నుదురు చిట్లిస్తూ ఆనందరావ్.

"ఏంలేదు... నేను మీ ఇంటి మీదుగా కార్లో వెళ్తుంటే వరండాలో మీరు కనిపించారు..."

"అయితే?"

"మిమ్మల్ని చూడగానే నేను తరువాత తియ్యబోయే పిక్చర్‌లోని 'తేజ' అనే పాత్రకి మీరు సరిగ్గా సరిపోతారనిపించింది"

"అయితే..."

"మీకు అభ్యంతరం లేకపోతే..." నసిగాడు.

"నన్ను మీ సినిమాలో నటించమంటారు... అంతేనా..." అడిగాడు ఆనందరావ్.

"ఆc అంతే... అంతే..." నవ్వుతూ చెప్పాడు మోహనవంశీ.

"అది హీరో పాత్రేనా?"

"కాదు గానీ- హీరో పాత్రలాంటిదే... అంటే సెకండ్ హీరో అన్నమాట... హీరోకున్నంత ఇంపార్టెన్స్ మీ పాత్రకీ ఉంటుంది..." వివరించాడు.

"అంతేగానీ... హీరో పాత్ర మాత్రం కాదన్నమాట..."

ముఖంనిండా అస్పష్టతని పులుముకుంటూ ఆ తర్వాత చెప్పాడు ఆనందరావ్. "సారీ..నేనలాంటి సెకండ్ హీరో పాత్రలు చచ్చినా చెయ్యను... ఏమనుకోకండి"

"అది కాదండీ... పేరుకి సెకండ్ హీరో అన్నమాటే గానీ- నిజానికదే మెయిన్ హీరోకన్నా ముఖ్యమైన పాత్ర... సో... ఈసారికిలా ఒప్పుకోండి... అంతగా కావాలంటే... నా నెక్స్‌ట్ పిక్చర్‌లో మెయిన్ హీరోగా మిమ్మల్నే..." బతిమిలాడుతూ ఇంకా ఏదో అనబోయాడు మోహనవంశీ.

ఆనందరావ్ అతని మాటని పూర్తి చేయనివ్వలేదు.

"సారీ... ఐ డోంట్ లైకిట్! చేస్తే మెయిన్ హీరోగానే చేస్తాను... లేదంటే... లేదు..."

అతనలా బిగిసిపోయేసరికి మోహనవంశీ ఇంకేం అనలేకపోయాడు. మౌనం వహించాడు.

ఎంతైనా ప్రముఖ దర్శకుడాయె! ఒకానొక అనామకుడ్ని అంతకన్నా ఇంకేం బతిమాలుకోగలుగుతాడు?

"ఇట్సాల్‌రైట్ మిస్టర్ ఆనందరావ్... మీలాంటి స్ఫురద్రూపిని వెండితెరకు పరి



# గిన్నిస్‌లో మనవాడు




పేరు ప్రఖ్యాతులు సాధించడం కోసం చాలామంది ఎంతగానో ఉవ్విళ్లూరుతుంటారు. అందుకోసం వారు చాలా పద్ధతుల్లో ప్రయత్నిస్తుంటారు. కొందరు జుత్తు పెంచుకుంటే, ఇంకొందరు గడ్డం పెంచుకుంటారు. మరి కొందరు తెగబారెడు మీసాలు పెంచేస్తారు. అలాంటివారిలో మనదేశానికి చెందిన శ్రీధర్ బిల్లాల్ కూడా ఒకరు. ఆయన తన ఎడమ చేతివేళ్లగోళ్లను ఏకంగా 231 అంగుళాల పొడవున పెంచేశారు. ఆ ఓపికకూ పట్టుదలకూ మెచ్చి గిన్నీస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్‌వారు ఆయన పేరును తమ పుస్తకంలో ఎక్కించి తనజన్మను సార్థకం చేశారు. 'పుర్రెకోబుద్ధి... జిహ్వాకోరుచి' అంటే ఇదే మరి! ఔనంటారా? కాదంటారా? !

---

చయం చేసే భాగ్యం నాకు లేదనుకుంటాను..." బాధగాచెప్పి వెళ్లిపోయాడతను.

వీధిలోంచి కారు వెళ్లిపోతున్న శబ్దం వినిపించాక... 'నేను గానీ పొరపాటు చేశానా?' అని చిన్న అనుమానం... కొద్దిసేపు మెదలాడింది ఆనందరావు మస్తిష్కంలో.

కొంచెం కలవరపడి... మళ్లీ తేరుకుని 'నో... అది పొరపాటెలా అవుతుంది?'

'చేస్తే మెయిన్ హీరోగానే చెయ్యాలి... లేదంటే ఊరుకోవాలి... ఫలానా ఆనందరావ్ ఫలానా సినిమాలో సెకండ్ హీరోగా చేశాడని అందరూ చెప్పుకోవడం ఏం బాగుంటుంది? నేస్టీగా ఉండదూ?'

ఏదో అల్లాటప్పాగాడైతే ఎలాంటి పాత్ర చేసినా పర్లేదు... బట్... దిస్ ఆనందరావు... నోనో... ఆనందరావు ది గ్రేట్... అలాంటి నాసిరకం పాత్రలు చేయడం... ఛఛ... ఆ ఊహే బాగా లేదు.

మెయిన్ హీరోకన్నా ప్రాముఖ్యం ఉన్న పాత్రే అవుగాక! అయితేనేం? మెయిన్ హీరో మెయిన్ హీరోనే!!

రేప్పొద్దున్న ఆ పిక్చర్ పొరపాట్న సూపర్ డూపర్ హిట్టయితే అందుకు కారకుడిగా అందరూ ఆ మెయిన్ హీరోనే చెప్పుకుంటారే తప్ప- తనని చెప్పుకోరు గదా!?

'సో... తను తీసుకున్నది రైట్ డెసిషనే' - ఇలా ఆలోచించాక ఆనందరావు మస్తిష్కంలోని ఆ అనుమానం పెనుభూతం కాకుండానే అంతరించిపోయింది.

★ ★ ★

ఆనందరావు ఊహించినట్టే ఈ విషయం తెలిసి మండిపడ్డాడు మాధవరావు- అంతెత్తున ఎగిరాడు.

"మోహనవంశీ అంతటివాడు వేషం ఆఫర్ చేస్తే తిరస్కరిస్తావా? నీ కసలు మెదడుందా? దాన్ని ఎక్కడన్నా తాకట్టు పెట్టి వచ్చావా? ఛ..." ఆయనలా ఆయాసపడిపోతూ అరుస్తుంటే... చిన్నగా నవ్వుకున్నాడు ఆనందరావు.

తన విలువ తెలియక తండ్రి అలా







అంటున్నాడే తప్ప, మోహనవంశీ అయితే ఏంటిగొప్ప? నాలుగైదు సినిమాలు వర సగా హిట్టయ్యేసరికి కాస్త పేరొచ్చిందంతే.

అంతమాత్రానికే... ఆయనేదో దేవుడై నట్టు.... ఆయనడగ్గానే తను చిన్న వేషా నికి ఒప్పేసుకోవాలా?

ఎవరి విలువ వారికే ఉంటుంది. ఎవరి గొప్పతనం వారిది. ఎవరి ఆత్మవిశ్వాసం వారికే ఉంటుంది. అతని ఆలోచనలు అలా పరుగెడుతుంటే- మాధవరావు గుర్రుగా అరిచాడు.

"ఏంటా వెధవ నవ్వు? అడిగేది నిన్నే... అంత మంచి అవకాశాన్ని ఎందుకు కాదనేశావు? నీకసలు మతుందా? "

"ఉంది కాబట్టే వద్దనేశాను" తండ్రి ఆగ్ర హాన్ని కేర్ చెయ్యకుండా తాపీగా చెప్పాడు ఆనందరావు. మోహన్‌వంశీనే కాదు- ఈవెన్ హాలీవుడ్ డైరెక్టర్ స్పీల్‌బెర్గ్ వచ్చి అడిగినా సరే- నేను ఒప్పుకునుండేవాడ్ని కాను..."

"ఎందుకుటా? ఏవిటో తవరి గొప్ప? అయినా నాకు తెలియక అడుగుతాను నీకెందుకంత గీర? " కొడుక్కేసి మాధవ రావు ఈసారి క్రోధంగా చూశాడు.

"ఎవరి గొప్ప వారికే ఉంటుంది" ఇందాక మనసులో అనుకున్నదాన్నే ఇపుడు పైకన్నాడు ఆనందరావు.

"ఏంట్రా నీ బోడి గొప్ప? ప్రతిదానికీ ఇలా వంకర టింకరగా మాట్లాడతావేం?"

"ఇందులో వంకరటింకరేముంది? ముందు చూపు..."

"అదుగో - ఆ గీరే వద్దంటున్నాను..."

"గీరా లేదు- పారా లేదు... నా ముందుచూపు నాకుంది..."

"ఏవిట్రా... ఇందాకట్నుండి చూస్తున్నాను. ముందుచూపట... ముందు చూపు... నా బొంద చూపు..." లోలోన పళ్లు నూరుతూ కోపంగా అన్నాడు మాధవరావు.

"సెకండ్ హీరో పాత్రతో కెరీర్ స్టార్ట్ చేస్తే- ఇక జీవితాంతం సెకండ్ హీరోగానే మిగిలిపోవాల్సి వచ్చుద్ది. సినిమా ఇండస్ట్రీ సంగతి నీకు తెలీదు" విజ్ఞుడిలా ఫోజు పెట్టి చెప్పాడు ఆనందరావు.

"నీ మొహం! అక్కడికి నువ్వేదో హీరో పాత్రల కోసం ట్రై చేస్తుంటే ఇదొచ్చినట్టుగా మాట్లాడతావేం? అనుకోకుండా వచ్చి పడిన అదృష్టమిది! దీన్ని కాలదన్నుకోవడం..." మాధవరావు ఇంకా ఏదో అనబోతుంటే ఎక్కడ్నుంచో వచ్చింది సావిత్రి... ఒగరుస్తూ.

అవడానికి ఆమె ఆనందరావుకి తల్లే అయినా పేరు పక్కన 'అమ్మ' చేర్చాల్సినంత ముసలిదేం కాదు. కనీసం ఓ నాలుగైదు పాయలైనా తెల్లబడితే కదా! భార్య రాకతో ఆమెవైపు తిరిగాడు మాధవరావు.

"ఎక్కడ్నుంచి తమరి రాక?"



## కొత్తగాలి...

**చిన్నపుడు-**
**'తినమంటే' ఏడ్చాడు**
**పెద్దయ్యాక-'పెట్టమంటే'**
**ఏడుస్తున్నాడు...**

-ధరణికోట శివరాంప్రసాద్, హైదరాబాద్

వ్యంగ్యంగా అడిగాడు మాధవరావు.

రొప్పుని ఆపుకుని "కనకమ్మగారు కొత్త మిక్సీ కొన్నారంటేనూ చూసొస్తున్నా... అర్జురే ఎందుకు వాడిమీద కేకలు వేస్తున్నారు?" ఓ కుర్చీలో సెటిలవుతూ తండ్రీ కొడుకులకేసి మార్చి మార్చి చూసింది సావిత్రి.

"ఎన్నిసార్లు చెప్పినా, నువ్వా పెత్తనాలు మానవుగదా! నువ్వేమో ఇంటిపట్టున ఉండవు. వీడేమో అద్భుతమైన అవకాశాలు ఎన్నెన్నో వస్తుంటే- అన్నిట్నీ ఫుట్‌బాల్‌లా తన్నేస్తున్నాడు..ఎలా చావను?" నెత్తి బాదుకుంటూ చెప్పాడు మాధవరావు.

"ఇవ్వాళేం జరిగిందేమిటి?" తాపీగానే అడిగింది సావిత్రి...

"ఉన్నాడుగా... తెలివితక్కువ సన్యాసి... ఎదురుగానే... వాడినే... అడుగు... బడుద్ధాయిని..."

"నువ్వయినా చెప్పురా..." కొడుక్కేసి చూసింది సావిత్రి.

"ఏముందమ్మా... పెద్దగా చెప్పుకోవడానికి? మోహనవంశీ అని ఒక డైరెక్టరున్నాడు గదా! అదే 'షరాబీ', 'ఎడారి' తీసిన డైరెక్టరు..." ఆనందరావు అతితేలిగ్గా నాలుక చప్పరిస్తూ అన్నాడు.

"ఆc... అవును... ఉన్నాడు... అయితే?"

చెప్పాడు ఆనందరావు విషయం ఏమిటో- "సెకండ్ హీరో వేషం కదాని రిజెక్ట్ చేశాను... దానికే నాన్నింత రాద్ధాంతం చేస్తున్నాడు..."

సావిత్రి ఆ విషయాన్ని కొడుకు తీసుకున్నంత తేలిగ్గా తీసుకోలేకపోయింది. అది ఒక సువర్ణావకాశంగా ఆమెకీ అనిపించింది.

కొడుకు తెలివితక్కువతనం ఆమెనీ బాధించింది. "అంత మంచి అవకాశాన్ని నాశనం చేసుకుంటార్రా ఎవరైనా? పైగా మీ నాన్ననంటావేం?" బాధగా అంది.

"తెలివి లేకపోవడం అంటే ఇదే నమ్మా... ఇద్దరికిద్దరే చాలా పూలిష్‌గా మాట్లాడుతున్నారు. ఆఫ్టరాల్ ఒక సెకండ్ హీరో వేషం రావటం మంచి అవకాశమా? నవ్విపోతారు ఎవరైనా వింటే!" తనే నోరంతా తెరిచి నవ్వేస్తూ అన్నాడు ఆనందరావు.

"అర్థం లేకుండా వాక్కు! సినిమాల్లో నటించే అవకాశం రావటం అంటే సామాన్యమా? అదీ మనం ప్రయత్నించకుండా! అలాంటిది సెకండ్ హీరో అన్న నెపంతో వద్దనేస్తావా? నాకే గనక ఎవరైనా సెకండ్ హీరోయిన్ అవకాశం ఇస్తే వద్దనుకుంటానా?" కొడుకు అజ్ఞానానికి లబలబలాడిపోతూ అంది సావిత్రి.

"నువ్వా? సెకండ్ హీరోయినా? !" అదేదో సబ్బు అడ్వర్టయిజ్‌మెంట్‌లోలా ఆశ్చర్యపోయాడు మాధవరావు.

"ఏదో మాటవరసకన్నానులెండి... అయినా ఎందుకంత ఆశ్చర్యం? ఏం ఇప్పుడొస్తున్న హీరోయిన్లు, సెకండ్ హీరోయిన్లూ నాకన్నా బాగుంటున్నారా? చెంబు ముఖాలు తప్ప అందం, ఆకారం ఉన్నాయా వారికి?" కంఠంలో ఆత్మవిశ్వాసం తొణికిసలాడుతుండగా కోపంగా అంది సావిత్రి.

"ఫేస్ బాగోకపోయినా పర్సనాలిటీ

# పెద్దల పెళ్ళి






53 ఏళ్ల రాజు జొన్నాస్ ఒన్‌ధర్న్ టెక్సిస్ యూరప్‌లో ఓ కోటీశ్వరుడు. 17వ శతాబ్దానికి చెందిన ఫిన్లాండ్ రాజుకు ముని ముని ముని మనవడు. అతను తనకన్నా 33 ఏళ్ళు చిన్నదైన ఇరవై ఏళ్ల కౌంటెస్ అయిన మేరియా గ్లోరియాని ఇటీవల వివాహం చేసుకున్నాడు. ఆమె జర్మనీలోని రోసెన్‌బర్గ్ నివాసి. ఆమె ముత్తాతలనించి వారిదీ రాజకుటుంబమే.

"ఇది కేవలం ఓ రాజరికానికి, ఇంకో రాజరికానికి జరిగిన వివాహం తప్ప ఇందులో మరేమి విశేషం లేదు" అని రాకుమారి గ్రామస్థులు పెదవి విరిచారు.

బాగుంటుందమ్మా... అయినా కాకపోయినా నీకలాంటి వేషాలు బాగుండవులే... ఇప్పుడొస్తున్న హీరోయిన్లని చూస్తూ కూడా ఎలా అనగలుగుతున్నావా మాట?" అర్ధనగ్న దుస్తుల్లో నేటి హీరోయిన్ల వీర విహారం అతని కళ్లముందు మెదిలి నోరు తెరిచాడు ఆనందరావు.

"మరెలాంటి వేషాలు బావుంటాయి?"

"వదిన పాత్రలైతే ఓకే... నిండుగా చీర కట్టుకోవచ్చు.. టీవీల్లోనయితే అత్త పాత్రలు..."

కొడుకు మరీ ముసలి పాత్రలు అననందుకు బహుశా సంతోషించినట్లుంది సావిత్రి.

"నిజమే. నిజమే..." అంది ఆనందంగా.

ఆవిడ సంబరంగా అలా అంటుంటే చిర్రెత్తుకొచ్చింది మాధవరావుకి. "ఏంటే నిజం? వచ్చిన అవకాశాన్ని వాడు కాలదన్నుకుంటే, నువ్వేమో రాని అవకాశాన్ని తల్చుకుని పిచ్చిపిచ్చి కలలు కంటున్నావా? నీ మొహానికి రాకాసి వేషం కూడా ఎవ్వరూ ఇవ్వర్లే గానీ... ముందు వాడి సంగతి తేల్చు... " అరిచాడాయన.

ఏ కళనుందో ఏమో - భర్త మాటల్ని సీరియస్‌గా తీసుకోలేదు సావిత్రి.

"ఇప్పుడింక తేల్చేందుకు ఏముందండీ... ఒక్కసారి ఒక అవకాశం మిస్ అయిపోతే ఇక అంతే! మళ్లీ మళ్లీ రాదు. ఒకవేళ పొరపాట్న... మళ్లీ గనక వస్తే ఈసారి అలా చెయ్యడులెండి..." అంది కొడుకుని వెనకేసుకొస్తూ...

ఆనందరావు ముసిముసిగా నవ్వి ఊరుకున్నాడే తప్ప మాటవరసకైనా "సరేనమ్మా" అని మాత్రం అనలేదు.

★ ★ ★



"దిసీజ్ వెరీ బ్యాడ్..." కోపంగా అన్నాడు ఆనందరావు. అభిజ్ఞ బిత్తరపోయింది.

ఎట్ ది సేమ్ టైం ఆమెకి వెక్కి వెక్కి ఏడ్వాలని కూడా అనిపించింది... లేకపోతే ఏంటి? కాలేజీ బ్యూటీగా పేరుపడిన తను- ప్రేమగా ప్రేమలేఖ అందిస్తే...

... ఎగిరి గంతెయ్యాల్సింది పోయి... అలానా అనటం? !

ఆశ్చర్యం, రోషం, ఆవేదన... కలగాపులగం కాగా చిన్నబోయిన ముఖంతో అతనికేసి చూసింది అభిజ్ఞ.

ఆమె నొచ్చుకున్నదని గ్రహించి ఈసారి కాస్త శాంతంగా చెప్పాడు ఆనందరావు.

"అవును అభిజ్ఞ! ఇది ఎంతమాత్రం మంచి పద్ధతి కాదు. మన అమ్మానాన్నలు ఎంతో కష్టపడి చదువుకోమని మనల్ని కాలేజీకి పంపిస్తున్నారు... ఇక్కడున్నంత కాలం మన ధ్యాస, ధ్యేయం చదువుమీదనే ఉండాలి తప్ప ఇలా తప్పుదోవ పట్టకూడదు..."

అతని శాంతం అభిజ్ఞకు ఈసారి కాస్త ధైర్యాన్నిచ్చింది. "ప్రేమించటం తప్పా?" అడిగింది ఎలాగో.

"కాకపోవచ్చు.. కానీ చదువుకోసమని కాలేజీకి వచ్చి ఇక్కడ ప్రేమ పాఠాలు వల్లించడం మాత్రం నిస్సందేహంగా తప్పే! ముందు చదువు- ఆ తర్వాతే ప్రేమైనా, పెళ్లయినా..." చెప్పాడు.

ఇప్పుడు కూడా అతను శాంతంగానే చెప్పటంతో ఇంకొంత ధైర్యాన్ని పుంజుకుంది. అభిజ్ఞ ముఖంమీద పడుతున్న జుట్టుపాయల్ని మోచేత్తో పైకెగదోసుకుంటూ చెప్పింది.

"మీరు చెబుతున్న విషయాలు నాకు తెలియకకాదు- కానీ మిమ్మల్ని చూస్తుంటే నా మనసు వశం తప్పుతోంది. నన్ను, అందరూ 'కాలేజీ బ్యూటీ' అంటారని మీకు తెలుసు. నా ప్రేమ కోసం ఎంతమంది అర్రులు చాస్తున్నారో మీకు తెలుసు. 'ప్రేమా దోమా' అంటూ నా వెంటపడ్డ వాళ్లని నేనేం చేశానో కూడా మీకు తెలుసు. అందర్నీ కాకపోయినా అనేక

మందిని చెప్పుతో కొట్టాను. కేవలం అతి కొద్దిమందిని మాత్రమే తిట్లతో వదిలిపెట్టాను. అలాంటి నేను- సిగ్గు విడిచి మీకు ప్రేమలేఖ అందిస్తున్నానూ అంటే- మీ మీద నాకెంత గాఢమైన అనురాగం ఏర్పడిందో అర్థం చేసుకోండి. దయచేసి నా ప్రేమని కాదనకండి..."

ఆమె కంఠంలోని అర్థింపుకి ఆనందరావు కాక వేరొక మగాడయ్యుంటే చలించిపోయి ఉండేవాడే!





## కొత్తగాలి...

**నిశీధిలో**
**నెలవంకలా**
**నా జీవితంలో నువ్వు**

-శ్రీజ, మెదక్

"నో..." ఆనందరావు మాత్రం ఏకాస్త కూడా చలించకుండా అడ్డంగా తలాడించాడు.

అలా తలాడిస్తున్నప్పుడు మనిషి కాస్త చలించాడు. కానీ మనసు మాత్రం రవంత కూడా చలించలేదు.

అభిజ్ఞ డీలా పడిపోయింది. అతనలా అనేసరికి "అంటే... అంటే... మీరు నన్ను ప్రేమించటం లేదా? ఐమీన్... నా ప్రేమని అంగీకరించటం లేదా? " అడుగుతుంటే ఆమె కంఠం కంపించింది.

"ఎందుకు అభిజ్ఞా! అలా ప్రాధేయపడతావు? చదువుకునే రోజుల్లో ఇలాంటి ప్రేమలంటే నాకు బొత్తిగా గిట్టవు. ఇప్పుడేగా చెప్పాను స్పష్టంగా. నా ఉద్దేశం ఏంటో! నువ్ నిజంగా నన్నంత ఇష్టపడుతుంటే... నీ ప్రేమ నిజంగా నిజమైనదే అయితే... మన చదువు పూర్తయ్యేదాకా ఆగి అప్పుడు మళ్లీ ఇవ్వు ఈ లెటరు. అప్పుడాలోచిస్తాను నీ ప్రేమని యాక్సెప్ట్ చేయడమా, మానడమా-అనేది"

ఆనందరావు ఎంతో హుందాగా అలా అంటుంటే- అతని మీద ఆరాధనా భావం మరింత పెరిగిపోయింది అభిజ్ఞలో- అతని వైపు అలాగే చూస్తూ-

"చదువు పూర్తయ్యేదాకా కాదానంద్-నీ కోసం... నీ ప్రేమకోసం... ఎన్ని జన్మలైనా సరే నిరీక్షించగలను నేను..." అంది స్థిరంగా.

"దాట్స్ గూడ్! మంచి పిల్ల అంటే ఇలా ఉండాలి" నవ్వి, ఆమె ఉత్తరాన్ని తిరిగి ఆమె చేతికిచ్చేసి గంభీరంగా అక్కడినుంచి వెళ్లిపోయాడు ఆనందరావు. ఆ అత్యుత్తమ విద్యార్థిని చూసి, అక్కడున్న ప్రకృతి అంటే... ఆ కెమిస్ట్రీ లాబ్ వెనకున్న పచ్చగడ్డీ, పిచ్చిమొక్కలూ అన్నమాట... పులకించిపోయింది.

విద్యార్థుల్లో పోకిరితనమే తప్ప, మంచి తనం నానాటికీ కొరవడిపోతున్న ఈ రోజుల్లో అట్టి ఉత్తమ విద్యార్థి ఒకడు ఉండటం ప్రకృతికే కాదు ఆ పుడమి తల్లికి కూడా గర్వకారణమే కదా!

★ ★ ★

అభిజ్ఞది అప్సరసల్ని సైతం తలదన్నే అందం! ఆమెని సృష్టించిన ఆ బ్రహ్మదేవుడికి సైతం మతి పోగొట్టేంత అందం ఆమెది.

అలాంటి అందగత్తె ప్రేమని తిరస్కరించి... నేనుగాని పొరపాటు చేశానా? అభిజ్ఞకలా నీతి పాఠాలు వల్లించి వచ్చేసిన ఓ అరగంట తర్వాత ఆనందరావు మనసుని తొలచిందా ప్రశ్న.

కానీ ఆ కార్యక్రమం ఎంతోసేపు కొనసాగలేదు... ఇందులో పొరపాటు ఏముందీ? అభిజ్ఞ బహుచక్కనిదే కావచ్చు. ఆమె తనని మనసారా ప్రేమిస్తున్నమాట నిజమే కావచ్చు.. అంత మాత్రాన... ఆమె ప్రేమ నంగీకరించేసి... తద్వారా ఉభయుల చదువులూ పాడైపోయేలా చేసుకోవటం భావ్యమా? ప్రేమలో పడ్డవాళ్లకు ఎప్పుడూ అదే ధ్యాస ఉంటుంది తప్పితే, చదువింక తలకెక్కదు.

విద్యార్థి దశలో ప్రేమలో పడి అలా తమ జీవితాల్ని నాశనం చేసుకున్న వాళ్లని ఎంతమందిని చూడలేదు- తను!... వాళ్లందరూ అవివేకులూ, ఆర్డినరీ ఫెలోసు... కానీ, తానలాక్కాదే... విచక్షణాజ్ఞానం

మెండుగా ఉన్న ఓ విలక్షణమైన విద్యార్థి... మరి అలాంటప్పుడు తన బుద్ధి వక్రించకూడదు గదా!

'సో... తను చేసింది ఎంత మాత్రం పొరపాటు కాదు... ఇలా తన చర్యని తాను సమర్థించుకోవటం వల్ల అలా ఆగి పోయింది ఆ తొలుపుడు కార్యక్రమం.

★ ★ ★

పై సంఘటనలన్నీ ఆనందరావు జీవితంలో నిజంగా జరిగినవి కావు.

అవన్నీ అతని ఊహలు!!

ఎవ్వరికీ రానటువంటి విచిత్రమైన ఊహలు ఆనందరావుకు వస్తుంటాయ్. అతను రోజులో చాలామట్టుకు సమయాన్ని అలాంటి ఊహల్లోనే గడుపుతుంటాడు. ఆ ఊహలు అతనికి ఒరిజినల్ స్కాచ్ విస్కీ కన్నా ఎక్కువగా కిక్కిస్తుంటాయ్! అందుకే... తనని తాను ఓ గొప్ప వ్యక్తిగా ఊహించుకుని మురిసిపోవడం... అతనికి ఓ వ్యసనంగా మారిపోయింది.

సాధారణంగా వ్యసనాలు యుక్తవయస్సులో అలవడుతుంటాయ్ అందరికీ. కానీ ఆనందరావుకున్న ఈ విచిత్ర వ్యసనం చిన్నప్పుడే అతన్లో ప్రవేశించి అతనితోపాటే ఎదుగుతూ వస్తోంది.

టీచర్ నేలమీద పాకుతుంటే తనామె వీపుమీద ఎక్కి 'ఛల్ ఛల్ గుర్రం' - ఆడుకున్నట్టు అతనికి ఒకటో తరగతిలో ఓ ఊహ వచ్చింది.

అయిదేళ్ల ఆ వయసులో ఆ ఊహ అతనికెంతగానో నచ్చింది. ఒకేసారి అయిదారు సున్నుండలు తింటున్నంత సంబరంగా నచ్చింది.

ఎన్నిసార్లు చెప్పినా "క"ని తిరగేసి రాస్తున్నందుకు వీపు వాయగొట్టే టీచర్ వీపుమీద తానెక్కి 'ఛల్ ఛల్ గుర్రం ఆడటం... అతనికి చాలా అద్భుతంగా అనిపించింది.

దాంతో అలాంటి అద్భుతమైన ఊహలకి ఆనాటినుండే అలవాటు పడిపోయి... ఇదుగో ఈనాడు ఇలా తయారయ్యాడు ఆనందరావు.




ఆనందరావు గదిలోకొచ్చి... మంచం మీద వెల్లకిలా పడుకుని, రూఫ్ కేసి చూస్తుంటే... కాసేపు అతనికేసి కన్నార్పకుండా చూసి ఆ మీదట అడిగింది సావిత్రి.

"ఏంట్రా నందూ! అంత తీవ్రంగా ఆలోచిస్తున్నావ్? "

జవాబివ్వటానికి ఆనందరావ్ అసలు ఈ లోకంలో ఉంటేగా?

ప్రస్తుతం అతనొక 'భ్రమానందంలో' ఉన్నాడు.

శుక్రగ్రహవాసితో మాట్లాడుతూ ఉన్నాడు.

"నువ్ చెబుతోంది నిజమేనా? నిజంగా నువ్ శుక్రగ్రహవాసివేనా? "

"నీతో అబద్ధం చెప్పాల్సిన అవసరం నాకేముంది? నిజంగానే నేను శుక్రగ్రహవాసిని..."

"మరి అచ్చం మా మనుషుల్లాగే ఉన్నావే...? "

"భగవంతుడు మా రూపురేఖల్ని కూడా అచ్చం మీలాగే తీర్చిదిద్దాడు... దానికి నన్నేం చేయమంటావ్? అయినా, కాకపోయినా మీకూ మాకూ చిన్న తేడా



ఉందిగా..."

"ఏమిటది?"

"అది పైకి కనిపించేది కాదు..."

"అంటే?"

"ఇదుగో... చూడు..."

"ఇదేంటి? మీకు బొడ్డు ఉండదా అయితే?"

"అవును. చూడ్డానికి అచ్చం మేమంతా మీలాగే ఉన్నా మా జనన విధానం మాత్రం వేరేగా ఉంటుంది..."

"అదేమిటి? అదెలా?"

శుక్రగ్రహవాసి ఏదో చెప్పబోతుంటే- ఆనందరావుని ఊపి తట్టి లేపింది సావిత్రి.

దాంతో... ఆ విచిత్రమైన ఊహ చెదిరి ఆనందరావు ఈ లోకంలోకి వచ్చాడు.

"ఆ గ్రహాంతరవాసి ఏం చెప్పుండేవాడో ఏమో! ఇంతలోనే అనవసరంగా డిస్టర్బ్ చేసేసింది"- తల్లిమీద లోలోన చిరాకుపడుతూ "ఏంటమ్మా?" అన్నాడు లేచి కూర్చుంటూ.

"ఏంటి... అంత తీవ్రంగా ఆలోచిస్తున్నావ్?" సావిత్రి అడిగింది. మంచం మీద కొడుకు పక్కనే చోటు చేసుకు్కూర్చుంటూ.

"ఏదో ఊహ..." నసిగాడు ఆనందరావు.

"ఏంటది?"

"ఆకాశం నుండి ఓ ఫ్లయింగ్ సాసరొచ్చి మన పెరట్లో వాలింది. అందులోంచి ఓ శుక్రగ్రహవాసి కిందకు దిగితే అతన్తో మాట్లాడుతున్నాను..."

చాలా సింపుల్‌గా చెప్పాడు ఆనందరావు. అలాంటి చిత్ర విచిత్రమైన ఊహలు అతనికి క్వయిట్ కామన్ మరి!

సావిత్రి బాధగా చూసింది కొడుకుకేసి.

"ఎందుకురా- ఏమాత్రం టైం దొరికినా అలా పిచ్చిపిచ్చిగా ఏంటేంటో ఊహించుకుంటూ గడిపేస్తావ్? ఉత్తప్పుడంటే సరే... ఎగ్జామ్స్ దగ్గరకొస్తున్నాయిగా? ఏదైనా పుస్తకం పట్టుకుని చదువుకోరాదూ?" మందలింపుగా అంది.

"ఇది చెప్పటానికేనా నన్ను డిస్టర్బ్ చేసింది?!"

తల్లికేసి చిరాగ్గా చూశాడు ఆనందరావు.

"అవును..." అని చెప్పి, "ఏం తప్పా?" అన్నట్టుగా చూసింది.

"చదువు ఎప్పుడైనా చదువుకోవచ్చమ్మా! కానీ ఇలాంటి గమ్మత్తయిన ఊహలు రమ్మన్నప్పుడల్లా రావు. వచ్చినప్పుడే వాటిని ఎంజాయ్ చెయ్యాలి..."

ఏదో జీవన సత్యం బోధ పరుస్తున్నట్టు కొడుకలా అంటుంటే నవ్వాలో, ఏడవాలో అర్థం కాలేదు సావిత్రికి.

కొడుకు సంగతి చిన్నప్పట్నుంచి చూస్తున్నదేనాయె!

"నీకు గమ్మత్తయిన ఊహలు రానిదెప్పుడురా?" అంది గాఢంగా నిట్టూరుస్తూ సావిత్రి.

"అలా అనకు... ప్రయత్నపూర్వకంగా ఆలోచిస్తే- రావు నాకిలాంటి ఊహలు.." ఇంకా ఏదో చెప్పబోయాడు.

"ఎలా వస్తేనేం? కూటికా? గుడ్డకా?" అడ్డు తగిలింది సావిత్రి. "మొత్తానికైతే నువ్వు నిత్యం చేసే పని ఇదేగదా! అలాంటి ఊహలవల్ల నీకు ఒరిగిందేమిటి చెప్పు"

తల్లి నోటి వెంబడి కొన్ని వందలసార్లు విని ఉన్న ప్రశ్నే అది!

"అందులో ఉన్న థ్రిల్ నీకేం తెలుసమ్మా?" ఇది కూడా ఆనందరావు కొన్ని వందలసార్లు వేసిన ఎదురు ప్రశ్నే!

మరోసారి నిట్టూర్చి తానొచ్చిన అసలు విషయం చెప్పింది సావిత్రి. "మీ నాన్న నిన్ను మరోసారి పోలీస్ స్టేషన్‌కి వెళ్ళి రమ్మన్నారు..."

"అబ్బ! ఎన్నిసార్లు వెళ్ళాలమ్మా... వెళ్ళినప్పుడల్లా వాళ్ళు విసుక్కుంటున్నారు..."

"అలాగని మనం గమ్మునుండిపోతే వాళ్ళు అసలు పట్టించుకోర్రా..." అంది సావిత్రి.

"అలాగని వాళ్ళు విసుక్కుంటున్నా పట్టించుకోకుండా మనం పదే పదే తిరగాలా? ఏదైనా ఆచూకీ తెలిస్తే మేమే మీ ఇంటికి కబురు చేస్తాం... నువ్వు ఇలా మాటిమాటికీ రావొద్దు..." అని మొన్నే కోప్పడ్డాడా ఎస్సయ్! ఇంతలోనే మళ్లీ వెళ్తే మండిపడతాడు... నేను చచ్చినా వెళ్లను... కావాలంటే నాన్ననే వెళ్లమను..."

"అలా అంటే ఎలారా?"

"ఎలా ఏంటి? ఏం నాన్నకి దారి తెలీదా పోలీస్ స్టేషన్‌కి?"

"అది కాదురా. మీ నాన్నకి వేరే పన్లున్నాయ్ గదా!"

"అంటే ఏంటి? నేనేనా ఇక్కడంత పనీ పాటా లేకుండా అఘోరిస్తోంది?" కోపంగా నుదురు చిట్లించి లేచి నిల్చున్నాడు ఆనందరావు.

"ప్రస్తుతం ఏం పని చేస్తున్నావు నువ్వు?"

ఉరిమి చూశాడు ఆనందరావు తల్లి వైపు.

"ఖాళీగానే ఉన్నావ్‌గా! అలా ఊహల్లో తేలుతూ కూర్చునేకంటే ఓసారలా వెళ్ళి రావచ్చుగా?" తనూ కోపంగానే అంది సావిత్రి.

"వెళ్తే, తిరిగి రావడం అంటూ ఉండదు... నన్ను నాలుగు తన్ని లాకప్‌లో తోసేలా ఉన్నాడా ఎస్సయ్! అయినా అజాగ్రత్తకొద్దీ పర్సు పోగొట్టుకున్నది నాన్నే కాబట్టి ఆయన వెళ్లటమే ధర్మం... పద్దాక నన్నెందుకూ ఇలా విసిగిస్తారు?"

రాజుకన్నా మొండివాడు బలవంతుడు.

కొడుకు అలా మొరాయిస్తుంటే ఇంకేం అనలేకపోయింది సావిత్రి.

"సరేరా... నువ్వూ... మీ నాన్నా...

## నవ్వడం... నవ్వించడం నా నైజం!



**కోలపల్లి ఈశ్వర్**

పుట్టింది, పెరిగింది, ఉంటున్నదీ నెల్లూరులోనే. ఇంటర్ నుండి రాస్తున్నాను. రాయటం సంతోషంగా ఉంది. నా సాహిత్యానికి పుట్టిల్లయిన 'చతురం'టే ఎంతో ఇష్టం. నా మొట్టమొదటి నవల 'హరిశ్చంద్రుడు అబద్ధమాడితే...' ప్రచురించి నన్ను నవలారచయితగా, సినిమా రచయితగా మార్చింది 'చతురే'. నా నవలలు ముప్పాతిక భాగం చతురలో వచ్చాయి. ఇక, కథల సంగతి... ఇటీవల 'ఆంధ్రభూమి'లో వచ్చిన 'ఆప్తమిత్రుడు'తో కలిపి 1060 అచ్చయ్యాయి. నా రచనలు ప్రచురిస్తున్న సంపాదకులందరికీ హృదయపూర్వక కృతజ్ఞతలు. నవ్వుతూ ఉండడం...నవ్విస్తూ ఉండడం నా నైజం. ఈ 'ఆనందరావు శోభనం' నాకు నచ్చిన నా హాస్య నవలల్లో మొదటిది. పాఠకులకూ నచ్చుతుందని ఆశిస్తున్నాను. 'చతుర'కు ప్రత్యేక కృతజ్ఞతలు.

**చిరునామా**

**కోలపల్లి ఈశ్వర్**
కోలపల్లి నిలయం
36-1-138
నవాబ్ పేట
నెల్లూరు-524002
సెల్: 9246437710



మీరిద్దరే తేల్చుకోండి ఈ వ్యవహారం... మధ్యలో నాకెందుకు? ఆయన చెప్పమన్నాడు కాబట్టి చెప్పానంతే... సాయంత్రం ఆఫీసునుంచి వచ్చి ఎందుకు వెళ్లలేదని నిన్ను తిడితే దానికి సమాధానం మాత్రం నువ్వే చెప్పుకోవాలి... అప్పుడు మళ్లీ నన్ను మధ్యలో ఇరికించొద్దు..." అనేసి అక్కడ్నుంచి వెళ్ళిపోయింది.

"ఈ అమ్మదొక పిచ్చి- నాన్నదొక పిచ్చి.. సిటీ బస్‌లో ఎవరో జేబు కత్తిరిస్తే- ఆ పోయిన పర్సు మళ్లీ దొరుకుతుందా? అసలిలాంటి విషయాల్లో పోలీస్ కంప్లయింట్ ఇవ్వడమే ఒక తప్పు. అది చాలదన్నట్టు ఒకటికి పదిసార్లు వాళ్ల చుట్టూ తిరిగి వాళ్లతో బండ బూతులు తిట్టించుకోవటం రెండో తప్పు..."

జేబు దొంగలకీ, పోలీసోళ్లకీ ఏవేవో అండర్‌స్టాండింగ్స్ ఉంటాయి... తప్పదు గనుక కంప్లయింట్ తీసుకుంటారే తప్ప నిజంగా వీళ్ళు వాళ్లని పట్టుకుంటారా ఏమన్నానా? తిరిగి తిరిగి మన చెప్పులరిగిపోవాల్సిందే!

అలా ఆలోచిస్తుంటే... ఉన్నట్టుండి... ఆనందరావుకో విచిత్రమైన ఊహ వచ్చింది.

★ ★ ★

"ఎస్...వాట్ కెన్ ఐ డు ఫర్ యు?"

ఎదుటి వ్యక్తికేసి ఎగాదిగా చూస్తూ అడిగాడు ఆనందరావు.

"మీ పేరుప్రఖ్యాతుల గురించి చాలాసార్లు విన్నానండీ! కొన్ని పత్రికల్లో మీ గురించి ఆర్టికల్స్ కూడా చదివాను... మిమ్మల్ని తొలిసారిగా ఇలా ప్రత్యక్షంగా చూస్తున్నందుకు నాకెంతో ఆనందంగా ఉంది... నిజం చెప్పాలంటే నేను మీ అభిమానిని..." ఆ వ్యక్తి ఆనందరావుకేసి ఆరాధనగా చూస్తూ చెప్పాడు.

"మీ పేరు?"

"యుగంధర్"

"ఈజిట్..?"

"అవున్సార్, చిన్నప్పట్నుంచి నాకు డిటెక్టివ్ నావెల్స్ చదవటం తెగ అలవాటు. ఇప్పుడంటే రావట్లేదుగానీ, అప్పట్లో రోజుకో డిటెక్టివ్ నవల విడుదల అవుతుండేది గదా! అలా తెలుగులో వచ్చిన ప్రతి డిటెక్టివ్ నవలనీ చదివాను నేను... కొమ్మూరి వారి యుగంధర్ అంటే చాలా ఇష్టం నాకు... అందుకే మా అమ్మా నాన్నా అప్పలరాజు అనే పేరు పెడితే దాన్ని కాస్తా నా అంతట నేనే యుగంధర్‌గా మార్చేసుకున్నాను. ఇప్పుడు నన్ను అప్పలరాజనెవ్వరూ పిలవరు... అందరూ యుగంధర్ అనే అంటారు."

అతను ఆయాసం వచ్చి ఆగిపోగా మినరల్ వాటర్ బాటిల్‌ని అతని ముందుకు నెట్టాడు ఆనందరావు.

యుగంధర్ ఆ మినరల్ వాటర్ని తాగి, మళ్లీ కంటిన్యూ చేశాడు.

"ఆ రోజుల్లో డిటెక్టివ్ యుగంధర్‌కీ, భగవాన్‌కీ, వాలికీ ఎంతటి పేరు ప్రఖ్యాతులుండేవో... ఇప్పుడు అంత గొప్ప పేరున్న డిటెక్టివ్ మీరు.. అందుకే మిమ్మల్ని వెతుక్కుంటూ వచ్చాను.." చెప్పటం ముగించాడతను.

"దేనికీ? కేవలం నన్ను చూసిపోవడానికా? అలాగైతే నా టైం ఎక్కువగా వేస్ట్ చెయ్యకండి. నేను చాలా బిజీ డిటెక్టివ్‌నని మీకు తెలుసుగదా?" కాస్త ఇబ్బందిగా ముఖం పెట్టి అన్నాడు ఆనందరావు.

"భలేవారు సార్! నాకు ఆపాటి తెలియదా? నేనొచ్చింది మీ టైం వేస్ట్ చెయ్యడానికి కాదు... ఓ క్లయింట్‌గా... నాకు సంబంధించిన ఒక కేసుని మీకు అప్పగించటానికి వచ్చాను..." చెప్పాడు యుగంధర్ చేతులు కట్టుకుంటూ. కేసు అనగానే అలర్ట్ అయిపోయాడు ఆనందరావు...

కాదు ... డిటెక్టివ్ ఆనంద్.

"ఊఁ... చెప్పండి... చెప్పండి..." రివాల్వింగ్ చెయిర్‌లో ఓమారు గిర్రున తిరిగి ఫోజు కూడా పెట్టాడు.

"నా భార్యనెవరో హత్య చేశారు..."

"వ్వాట్? హత్యా?"

"ఎస్సార్... హత్యే! చూడ్డానికి ఆత్మహత్యలా అనిపిస్తున్నా నిజానికది ముమ్మాటికీ హత్యే సార్..."

"ఆత్మహత్యలా అనిపించే హత్య! క్వయిట్ ఇంట్రెస్టింగ్... ఊఁ... చెప్పండి... వివరంగా..."

యుగంధర్ చెప్పసాగాడు... తన భార్య హత్య ఎలా సంభవించింది.

★ ★ ★

"రియల్లీ యు ఆర్ గ్రేట్ మిస్టర్ ఆనంద్..." యస్పీ బాలసుబ్రహ్మణ్యం ఆనందరావు భుజంమీద చరిచి అన్నాడు.

అంటే... గాయకుడు బాలసుబ్రహ్మణ్యం అనికాదు. సూపరింటెండెంట్ ఆఫ్ పోలీస్ బాలసుబ్రహ్మణ్యం. అలాంటి పొగడ్తలు ఆనందరావుకి కొత్తయితే కదా!

ఏమాత్రం పొంగిపోకుండా "దేన్ని గురించి మీరు అంటుంటా?" అని అడిగాడు సింపుల్‌గా.

"అదేనండీ... మిసెస్ యుగంధర్ హత్యకేసుని మీరంత తేలిగ్గా సాల్వ్ చేసినందుకు... మీ పోలీస్ డిపార్ట్‌మెంట్ యావత్తూ దాన్ని ఆత్మహత్యగానే భావించింది... ఆ మేరకు మేము ఆ కేస్ ఫైల్‌ని క్లోజ్ చేసేయాలనుకుంటున్న తరుణంలో మీరు రంగప్రవేశం చేసి దాన్ని హత్యగా నిరూపించడమే కాకుండా, అసలు హంతకుడ్ని చట్టానికి పట్టివ్వగలిగారు... మీలాంటి డిటెక్టివ్ జిల్లాకొకడున్నా చాలు... మా పోలీస్ డిపార్ట్‌మెంట్‌కి శ్రమే ఉండదసలు"

అభినందనపూర్వకంగా ఆనందరావు భుజాన్ని మరోసారి చరిచాడు యస్పీ.

అలాంటి చరుపులు కూడా ఆనందరావుకి అలవాటే గదా!

"దాందేముందండీ... నా క్లయింట్‌కి నేను న్యాయం చేశానంతే..." అనేశాడు చాలా తేలిగ్గా.

'నిగర్వి' అనుకున్నాడు యస్పీ. ఆ ప్రముఖ డిటెక్టివ్‌కేసి గౌరవపూర్వకంగా చూస్తూ.

★ ★ ★

పై భ్రమానందం ముగిశాక...

"అలాంటి నేను... ఆఫ్టరాల్ ఒక ఎస్సయ్ దగ్గరికి పదేపదే వెళ్లి చీవాట్లు తినడమా? దట్టూ ఆఫ్టరాల్ ఓ అయిదొందలున్న పర్సు కోసం! దట్టూ నాన్న పోగొట్టుకున్న పర్సుకోసం!" అనుకున్నాడు ఆనందరావు.

అంతలోనే అతను మళ్లీ మరో భ్రమానందంలో మునిగిపోయాడు.

ఎటూ చూసినా కారుచీకటి!

చుట్టూ కీకారణ్యం!

ఆ కీకారణ్యంలో... ఆ కారుచీకట్లో... కనీసం చేతిలో టార్చ్‌లైట్ అయినా లేకుండా... ఒంటరిగా... ఎంతో ధైర్యంగా... ముందుకు నడుస్తున్నాడు ఆనందవర్మ.

దూరంనుండి వినిపిస్తున్న నక్కల ఊళలుగానీ, సమీపంనుండి వినిపిస్తున్న పులి గాండ్రింపుగానీ అతన్ని ఏమాత్రం భయపెట్టడం లేదు.

అతని దృష్టి అంతా శిధిల కాళికాలయానికి ఎలా చేరుకోడమా? అన్న దానిమీదే ఉంది.

తెల్లవారేలోగా ఎలాగైనా సరే ఆ శిథిలాలయానికి చేరుకోవాలి? లేకుంటే అందులో ఉన్న కోట్ల విలువ చేసే నిధి... ఉస్తాద్ చేతిలోకి వెళ్లిపోతుంది.

న్యాయంగా ఆ నిధి తనకు చెందా







ల్సింది.

తన పూర్వీకులెవరో... ఎప్పుడో... ఎప్పుడో కాదు... ఖచ్చితంగా ఏడు తరాల క్రితం... ఆ నిధిని అక్కడ తన కోసం దాచిపెట్టారు.

అప్పట్నుంచీ అది ఒక రహస్యంగానే మిగిలిపోయింది.

ఏదో తన అదృష్టం బాగుండబట్టి... ఇన్నాళ్లకు తనకా నిధి రహస్యం తెలిసింది... దానికి సంబంధించిన పత్రాలూ, మ్యాపూ దొరికాయి.

ఏదో స్నేహితుడు కదాని ఈ విషయం జోగిందర్‌సింగ్‌కి చెప్తే- అతను కాస్తా దాన్ని ఉస్తాద్‌కి మోసేశాడు.

ఉస్తాద్ అతిప్రమాదకరమైన వ్యక్తి... పచ్చినెత్తురు తాగే పరమ కిరాతకుడు... డబ్బుకోసం అతను ఎలాంటి ఘాతుకానికైనా వెనుదీయడు.

అలాంటిది... వాడూ జోగీందర్‌సింగూ ఏకమైపోయి... ఇప్పుడు ఆ నిధి కోసం తనకన్నా ముందుగానే బయల్దేరి వెళ్లిపోయారు.

ఒకవేళ వాళ్లిద్దరూ తనకన్నా ముందుగా ఆ శిథిలాలయానికి చేరుకోగలిగితే- వాళ్లు నిధిని చేజిక్కించుకుని ఆలయాన్ని ధ్వంసం చేసేస్తారు...

నో... అలా జరగడానికి వీల్లేదు...

తన పూర్వీకులు ఎంతో శ్రమించి సంపాదించిన నిధి అది.

అది కాస్తా పరాధీనమైపోతుంటే... ఈ ఆనందవర్మ, దగ్రేట్ చూస్తూ ఎలా ఊరుకుంటాడు?

ఇంపాజిబుల్... అలా జరగటానికి వీల్లేదు...

వీల్లేదు గాక వీల్లేదు...

ఆనందవర్మ అడుగులు చీకట్లోనే వడివడిగా పడుతున్నాయ్.

ఎంత 'ద గ్రేట్' అయితే మాత్రం... చీకట్లో కళ్లు ఎలా కనిపిస్తాయి?

మనిషి మనిషే? గుడ్లగూబ గుడ్లగూబే కదా! ఆనందవర్మ పొరపాట్న ఓ బండరాయిని తన్ని ధబేల్న ముందుకు తూలిపడ్డాడు.

ఫలితంగా 'అబ్బా' అంటూ భ్రమానందంలోంచి బయటపడ్డాడు ఆనందరావు... వచ్చేశాక..

భలే విచిత్రమైన ఊహ! కానీ ఇది భ్రమానందం ఎలా అవుతుంది? భ్రమ విషాదం అవుతుంది గానీ! అనుకున్నాడు ఆనందరావు.

నిజానికి ఆనందరావుకి జోగీందర్ అనే స్నేహితుడెవ్వరూ లేడు! అలాగే అతనికి తెలిసి 'ఉస్తాద్' అనే వ్యక్తి కూడా ఎవ్వడూ లేడు.

అతని భ్రమలెప్పుడూ ఇలాగే ఉంటుంటాయ్! విచిత్రమైన భ్రమలే... కానీ! ఆ సమయంలో అవి నిజంగా జరిగిపోతున్నట్టే అనిపిస్తుంటాయ్ అతనికి.

అందుకే అతనిపుడు 'అబ్బా' అని పైక్కూడా అరిచింది.

ఆ 'అబ్బా'కి ఆనందరావు 'అబ్బ' పరిగెత్తుకుంటూ వచ్చాడక్కడికి "ఏంట్రా- ఏమైంది? " అడిగాడు గాభరాగా!

"అడివిలో వడివడిగా చీకట్లో నడుస్తుంటే... రాయి కొట్టుకుని పడ్డాన్లే..." చెప్పాడు ఆనందరావు.

అంతమాత్రానికే అర్థమైపోయింది మాధవరావుకి... అదేదో కొడుకు తాలూకు భ్రమానందపు విశేషమని.

అందుకే అడివేంటి? చీకట్లో నడవటం ఏంటీ? లాంటి ప్రశ్నలేం అడక్కుండానే నెత్తి బాదుకున్నాడాయన.

"ఎప్పుడు పోతుందిరా నీకీ పాడు జబ్బు? "

ఆనందరావు మాట్లాడలేదు.

తండ్రి ఆఫీసునుండి సాయంత్రం గదా

రావాలి! మరి మధ్యలో వచ్చేశాడేంటి? అనుకున్నాడు మనసులో.

అదేమాట పైక్కూడా అడిగాడు.

"తలనొప్పిగా ఉంటే పర్మిషన్ తీసుకొని వచ్చేశాంలేగానీ... అన్నట్టు పోలీస్టేషన్ కెళ్లి నా పర్స్ విషయం కనుక్కున్నావా?" అన్నాడు మాధవరావు సీరియస్‌గా చూస్తూ.

పోలీస్‌స్టేషన్ అన్నపదం చెవిన పడగానే ఆనందరావు ముఖంలో చిరాకు ఆవరించుకుంది.

"లేదు" అన్నాడు అడ్డంగా తలాడిస్తూ.

"అదేంటి? మీ అమ్మతో చెప్పానే... నిన్ను పంపించమని... అది చెప్పలేదా నీకు?"

"చెప్పింది... నేనే వెళ్లలా..." కాస్త పెడసరంగా చెప్పాడు.

మాధవరావు కోపంగా చూశాడు కొడుకు దిక్కు. "ఏం ఎందుకని? ఎందుకెళ్లలేదు?"

"వాళ్లు పదేపదే రావద్దని చిరాకు పడుతున్నారు..." తల్లితో చెప్పిన కారణాన్నే తండ్రితోనూ చెప్పాడు ఆనందరావు. నిజానికి నిజం కూడా అదేగదా!

"పడితే పడ్డార్లే... నువ్వెళ్లి ఓసారి కనుక్కుని రా!" అన్నాడు మాధవరావు గట్టిగా! తప్పదన్నట్లు.

తల్లితో వాదించినట్టు తండ్రితో వాదించలేక "సరే" అనేశాడు ఆనందరావు అన్యమనస్కంగానే!




"ఎన్నిసార్లు చెప్పానయ్యా నీకు- మళ్లీ రావద్దని! దొంగ దొరికితే మీ డబ్బులు ఏమన్నా మేం తినేస్తాం అనుకుంటున్నావా?"

షరా మామూలుగానే ఆనందరావు మీద విరుచుకుపడ్డాడు ఎస్సయి.

హిప్పోపొటమస్ ముఖానికి తోడు ఆయనలా చిరాకు పడుతుంటే చచ్చేంత కోపమొచ్చింది ఆనందరావుకి.

'ఈ మృగం గాడిదకి పోలీస్ ఉద్యోగం ఎవడిచ్చాడో అసలు?' అని మనసులో అనుకుని... "ఈ విషయం నేను మా నాన్నతో చెప్పానండీ... అయినా సరే ఆయన వినిపించుకోకుండా నన్ను మళ్లీ వెళ్లి రమ్మన్నాడు..." అన్నాడు తన తప్పేం లేదని సూచిస్తూ.

ఈవెన్ దెన్ హిప్పోపొటమస్ మొహంగాడు శాంతించకపోగా గాండ్రించాడు.

"ఆయన పంపితే- నువ్వు ఊపుకుంటూ వచ్చేయడమేనా?" అన్నాడు కోపంగా ఉరిమి చూస్తూ.

'నీ అబ్బరేయి' అని మనసులో అనుకుని "సారీ అండీ" అన్నాడు ఆనందరావు తల దించుకుంటూ. అంత మాత్రానికే శాంతించేసేవాడు పోలీసాఫీసర్ ఎలా అవుతాడు మరి?

"ఏం సారీ- నా బొందసారీ? ఒళ్లు దగ్గర లేకుండా పర్సులు పారేసుకోవడం ఇలా మా నెత్తికెక్కి తాండవమాడటం. ఛ.. ఛ... ఛ్ఛ..." అన్నాడు నుదురు చిట్లిస్తూ ఎస్సయ్.

అసలే హిప్పోపొటమస్ అందునా నుదురు చిట్లిస్తే ఇంక ఆ అందం గురించి వేరే చెప్పాలా?

రోతన్నర రోత కలిగింది ఆనందరావుకి. 'ఛీ! ఇంక చచ్చినా జీవితంలో వీడి మొహం మళ్లీ చూడగూడదు...' అని నిశ్చ







యించేసుకుని అక్కడ నుంచి తిరిగి వచ్చేశాడు ఆనందరావు.

ఇంటికి రాగానే తండ్రి 'ఏమైందిరా?' అనడిగితే అదే మాట చెప్పాడు.

మాధవరావుది దేన్నీ అంత తేలికగా వదిలేసే మనస్తత్వం కాదు. ముఖ్యంగా డబ్బుల విషయంలో అతను మరీ గట్టి పిండం! చూస్తూ చూస్తూ ఒక్క పైసా కూడా వృధాగా పోనివ్వడు.

"సరే- నీ కంత ఇదిగా ఉంటే రేపట్నుంచి నేనే వెళుతుంటాలే అయితే..." అనేసాడు కోపంగా.

'వెళ్లు వెళ్లు... వెళ్లి బాగా తిట్టించుకో...' అని మనసులో అనుకుని దరిమిలా తన రూమ్‌లోకి వెళ్లిపోయాడు ఆనందరావు- హమ్మయ్య అనుకుంటూ!

కాస్తంత వ్యవధి దొరికితే భ్రమానందంలో మునిగిపోవటం అతనికి మామూలేగా!

మంచం మీద వాలిన మరుక్షణం మానస సరోవరం దగ్గరికి వెళ్లిపోయాడు ఆనందరావు.

అతనక్కడ ఊరికే అలా విహరిస్తుండగా... అదేదో సినిమాలోలా ఓ అప్సరస వచ్చింది అక్కడికి.

అప్సరసలు అంతంత మాత్రం అందంగా ఏం వుండరుగదా! ఆమె అందానికి కళ్లు తిరిగిపోయాయి ఆనందరావుకి. అబ్బ! ఎంత అందం ఎంతెంత అందం! అనుకున్నాడు ఆశ్చర్యంగా కళ్లింత చేసుకుని చూస్తూ.

చేసుకుంటే ఇలాంటి అమ్మాయిని చేస్కోవాలి! అంతే తప్ప అఫ్టరాల్ కాలేజీ బ్యూటీలను గట్రా చేసుకోకూడదు అని కూడా అనుకున్నాడు స్థిరంగా! అతనలా అనుకుంటుండగా-

"ఏంటి మానవా! నన్ను చూసి ఏదో ఆలోచిస్తున్నావు" అని అడిగింది ఆ అప్సరస.

"ఏంలేదు... నీ అందం నాకు చాలా నచ్చింది. చేసుకుంటే నీలాంటి అందగత్తెనే చేసుకోవాలని అనుకుంటున్నాను..." దాపరికం దేనికి లెమ్మని నిజం ఒప్పేసుకున్నాడు ఆనందరావు చిన్నగా నవ్వుతూ.

"నాలాంటిదాన్ని దేనికి? నన్నే చేసుకోవచ్చుగా?" అంది ఆ అప్సరస- మనోహరంగా నవ్వి.

"కానీ, నువ్ అప్సరసవి కదా! నేనేమో మానవుడ్ని. ఎలా కుదుర్తుంది? "అన్నాడు ఆనందరావు.

"ఏం ఎందుక్కుదరదూ? నీ కోసం నేను నా దైవత్వాన్ని వదిలేసుకుని మీ భూలోకంలో స్థిరపడిపోతాను" అంది అప్సరస తొణుకు బెణుకు లేకుండా.

అయినా ఆనందరావు సంతోషపడిపోలేదు.

"ఎందుకొచ్చిన రిస్కు చెప్పు? ఎవరి జాతి వాళ్లను వాళ్లుపెళ్లాడితేనే అందం.." అన్నాడు సూచనప్రాయంగా తన అయిష్టతని వ్యక్తం చేస్తూ.

"ఈ కాలంలో ఇంకా ఆ పట్టింపులేమిటి మానవా? అలాంటివి ఇంకా ఉన్నాయా?" కొంచెం నిరాశగా అంది అప్సరస.

"కుల మతాంతర వివాహాలైతే పర్లేదు... దేశాంతర ఖండాంతర వివాహాలైనా పర్లేదు. కానీ, మనది లోకాంతర వివాహం కదా! మీ లోకం వేరు! మా లోకం వేరు!" అనేశాడు ఆనందరావు పెదవి విరుస్తూ.

"మానవా!" అంది అప్సరస బాధగా.

"ఏంటి?" అడిగాడు ఆనందరావు.

"నేను లోకాంతర వాసినని నన్ను చిన్న చూపు చూడొద్దు. అసలు నేను దేవలోకం నుండి ఇక్కడికి ఎందుకొచ్చానో తెలుసా? నీ అందాన్ని చూసే నీతో ఈ లోకంలో సెటిలైపోదామనే..." అంది అప్సరస అర్థిం

పుగా!

"అబ్బ! ఆశ, దోశ, అప్పడం, వడ..." అన్నాడానందరావు.

"అంటే? " అంది అప్సరస.

"మానవకాంతలు కాని వాళ్లతో ఇదే ప్రాబ్లం! ఒక భాషా అర్థం కాదు, ఒక భావమూ అర్థంకాదు... అందుకే నిన్ను వద్దంటున్నది..." అన్నాడు ఆనందరావు స్పష్టంగా!

"మానవా! అంతేనా? ఇదే నీ ఆఖరి మాటా? " కడుదీనంగానూ ఎంతో వేడుకోలుగానూ చూస్తూ అప్సరస అలా అంటుంటే ఆనందరావుకి మొదట జాలి కలిగింది- కానీ అంతలోనే గుండెని రాయి చేసేసుకున్నాడు.

సాటి మానవుల మీద జాలి పడమని పెద్దలు చెప్పారే తప్ప పైలోకపు అప్సరసల మీద జాలి పడమని చెప్పలేదుగా? అనుకుని...

"అనవసరంగా నా కాళ్లావేళ్లా పడొద్దు... నేను నీలా ఉండే మానవకన్యని చేసుకుంటానే తప్ప నిన్ను మాత్రం చచ్చినా చేసుకోను..." అనేశాడు ఆనందరావు నిర్ద్వందంగా.

దాంతో ఆ అప్సరస ముఖం చిన్నబోయింది.

చిన్నబోయిన ఆ ముఖాన్ని చూస్తుంటే చిన్నదానా! బాధపడకు అని ఓదార్చాలనిపించింది కానీ అలా ఓదారిస్తే నెత్తికెక్కుతుందేమోననిపించి మిన్నకుండిపోయాడు.

అప్సరస ఆనందరావువైపు మరింత దీనంగా మరొక్కసారి చూసి అంతర్ధానమైపోయింది.

మానససరోవరం దగ్గర ఒంటరిగా మిగిలిపోయిన ఆనందరావు 'నేనుగాని తప్పు చేశానా? ' అనుకున్నాడో క్షణం.

'లేదు. నువ్వు చేసింది తప్పేంకాదు, మనిషివై ఉండి మానవకాంతను పెళ్లాడాలిగానీ అప్సరసను పెళ్లాడ్డం ఏం బాగుంటుంది? కయ్యానికయినా, వియ్యానికయినా సముజ్జీలుండాలంటారు పెద్దలు! సో...నీ నిర్ణయమే కరక్ట్...' అంది అతని అంతరాత్మ- సమర్థిస్తూ!

దాంతో అతను రిలీఫ్‌గా ఫీలయ్యాడు.

అంతేకాకుండా భ్రమానందంలోంచి వాస్తవంలోకి వచ్చేశాడు.

వాస్తవంలోకి వచ్చేశాక కూడా ఆ అప్సరస రూపం ఇంకా మెదలసాగింది కళ్ల ముందు ఆనందరావుకి.

అవును మరి! ఆమె అందం అలాంటిది. ఆమెతో పోలిస్తే వాళ్ల కాలేజీ బ్యూటీ అభిజ్ఞది అంతంత మాత్రం అందమే! సో...

'చేసుకుంటే ఆ అప్సరసలాంటి స్త్రీనే చేసుకోవాలి...' అని మెలకువ వచ్చాక కూడా అనుకున్నాడు ఆనందరావు.

మర్నాడు కాక ఆ మర్నాడు- ఎందుకోగానీ బుద్ధి కుదిరి ఆనందరావు ఏదో టెక్ట్స్ బుక్ తిరగేస్తుండగా-

"మీ నాన్న నిన్ను పిలుస్తున్నాడురా!" అంటూ వచ్చింది సావిత్రి.

నాన్న నుండి పిలుపు అనగానే మండిపోయింది ఆనందరావుకి. "నేను చచ్చినా వెళ్లను ఆ పోలీస్ స్టేషన్‌కి" అనేశాడు కారణం అదే అయ్యుంటుంది లెమ్మనుకుని.

"అబ్బే- అందుక్కాదురా!" అంది సావిత్రి.

"మరెందుకట? "

"నీ పెళ్లి విషయం మాట్లాడటానికి..." ముసిముసిగా నవ్వుతూ చెప్పింది సావిత్రి.

"ఏంటీ- నాకు అప్పుడే పెళ్లా? " ఆశ్చర్యంగా నోరు వెళ్లబెట్టాడు ఆనందరావు. "చదువింకా పూర్తికాన్దే- అప్పుడే పెళ్లేంటి నాకు? " ఆశ్చర్యాన్ని అలాగే కొనసాగిస్తూ అన్నాడు.

"ఏమోరా...వెళ్లి మీ నాన్ననే అడుగు.."





## ఆర్కే చతురోక్తులు



సునిశిత హాస్యం, వ్యంగ్యంతో ఇంగ్లిష్‌లో అనేక రచనలు చేసిన ఆర్.కె.నారాయణ్ జగమెరిన రచయిత. వివిధ సందర్భాల్లో ఆయన ప్రయోగించిన హాస్యచతురతకు మెచ్చుతునకలివిగో...

### ఆ రెండూ కాదు

ఓసారి ఐక్యరాజ్యసమితి డైనింగ్ హాల్‌లో మధ్యాహ్నం భోజనం ముగించిన తర్వాత చివరిగా ఆర్.కె.నారాయణ్‌కు ఓ కప్పు టీ తాగాలనిపించింది. అక్కడున్న వెయిటర్ ఆయనను 'మీకు బ్లాక్ టీ కావాలా, వైట్ టీ కావాలా?' అని అడిగాడు. ఈ రెండూ అలవాటులేని ఆర్కే వెంటనే తడుముకోకుండా, 'బ్రౌన్' అనడంతో అక్కడున్న వారంతా ఫక్కున నవ్వారు.



అనేసింది సావిత్రి కొంచెం విసుగ్గా.

అంతలో "సావిత్రీ... ఏడే వాడు? నిద్ర పోతున్నాడా ఏంటీ ఖర్మ..." అంటూ హాల్లోంచి మాధవరావు స్వరం వినిపించింది.

"లేదండీ... వస్తున్నాడండీ..." అంది సావిత్రి.

దాంతో ఇంక లేచి వెళ్లక తప్పలేదు ఆనందరావుకి.

★ ★ ★

"సుందర్రావు మామయ్య నీకో సంబంధం చూశాడటరా!" అన్నాడు మాధవరావు. తల్లీ కొడుకులిద్దరూ వచ్చి తనకెదురుగా ఉన్న సోఫాలో కూర్చున్నాక-

"అప్పుడే నాకు పెళ్లేంటి నాన్నా?" అన్నాడు ఆనందరావు బిడియంగా.

"మంచి సంబంధం అట. సుందర్రావ్ రాశాడు! ఒకసారి వెళ్లి పిల్లని చూసొస్తే నచ్చితే పెళ్లి ఎప్పుడైనా పెట్టుకోవచ్చని రాశాడు. రేపు మార్చితో నీ చదువు ఎలానూ అయిపోతుందిగా! ఆ అమ్మాయి నీకు నచ్చితే మేలోనో, జూన్‌లోనో ముహూర్తాలు పెట్టుకోవచ్చు..." అన్నాడు మాధవరావు హుందాగా.

మంచి పిల్లంటే?

ఆనందరావు మనసులో అప్రయత్నంగా ఆ అప్సరస రూపం మెదిలింది. ఆ అమ్మాయి అలా ఉంటుందో, ఉండదో అన్న అనుమానం మెదిలింది వెంటనే!

కానీ, ఆ విషయం ఇప్పుడిప్పుడే తెలిసేది ఎలా?

"మార్చిలో చదువైపోద్ది నిజమే! అయితే మాత్రం ఇంత త్వరగా నాకు పెళ్లెందుకు నాన్నా?" అన్నాడు నసిగినట్టుగా ఆనందరావు.

"మరెప్పుడు చేసుకుంటావ్?"

"ఉద్యోగం వచ్చాక ఆలోచిద్దాం నాన్నా" మళ్లీ నసిగినట్టుగానే అన్నాడు ఆనందరావు నేల చూపులు చూస్తూ.

"నీకు ఉద్యోగం వచ్చేదాకా ఆగితే ఆ సంబంధం కాస్తా ఎగిరిపోద్ది! ఆ పిల్ల వాళ్ల అమ్మా నాన్నలకి ఒక్కర్తే కూతురట! పాతిక లక్షలకి పైగా ఆస్తి ఉందట... అంత మంచి సంబంధం కావాలనుకున్నప్పుడల్లా దొరుకుతుందా?" అన్నాడు మాధవరావు- ఒప్పుకో అనే అర్థం వచ్చేలా!

'అందుకన్న మాట నువ్వు ఇలా టెంప్ట్ అవుతున్నది!' అని మనసులో అనుకుని... 'అంత ఆస్తున్న పిల్లకి అందం ఉంటుందో ఉండదో' అని కూడా అనుకుని... "ముందు ఫోటో పంపించమని రాయండి నాన్నా! ఫోన్ నెంబరున్నా చెయ్యండి. ...ఫోటో నచ్చితే అప్పుడు వెళ్లొచ్చు పెళ్లి చూపులకి..." అన్నాడు ఆనందరావు.

"ఫొటో చూస్తే ఏం అర్థం అవుతుం దిరా? ఏకంగా మనిషినే చూసొద్దాం... అయినా నచ్చకపోవడం ఏవుంటుంది? కాలో కన్నో వంకరైతే చెప్పలేం తప్ప... అన్నీ సవ్యంగా ఉంటే మాత్రం మారు మాట్లాడకుండా ఒప్పేసుకోవచ్చు..."

తండ్రి అలా అంటుంటే- ఆయన ఆంతర్యం అర్థమైపోయింది ఆనందరావుకి.

ఆ పిల్ల మనిషిలా ఉంటే చాలు చేసేసు కోమని ఇన్‌డైరెక్ట్‌గా తనని శాసిస్తున్నాడ న్నమాట ఆయన! అదెలా వీలవుతుంది? ఆ అప్సరసలా ఉంటే తప్ప చేసుకోకూడ దని కదా తను అనుకుంటున్నది!

"అది కాదు నాన్నా!" అన్నాడు ఏదో చెప్పబోతూ.

"ఏది కాదు... నువ్వింకేం మాట్లాడ కుండా తయారవ్వు!"

"ఏంటీ... ఇప్పుడేనా? "

"ఇప్పుడే కాదులే- రేపు లేదు ఎల్లుండి... నేను సుందర్రావుకి ఫోన్ చేసి మాట్లాడు తాను..."

ఆనందరావు 'ఉత్తమ పుత్రుడు' అని చెప్పలేం గానీ, తండ్రి మాటకి లోబడి ఉండే మనస్తత్వం అతనిది.

అందుకే 'సరే' అనేశాడు ఎదురు చెప్ప లేక.

అయినా ఎదురు చెప్పాల్సిన అవసరం మాత్రం ఏముంది? అతనికి పెళ్లంటే విముఖత ఏం లేదుగా! కాకపోతే కాబోయే భార్య అప్సరసకన్నా అందంగా ఉండాలన్న కోరిక మాత్రం ఉంది! అంతేగా!

అందుకే 'ఒకసారి వెళ్ళి చూసొస్తే తప్పే ముందిలే! నచ్చితేనే కదా- చేసుకునేది...' అనుకున్నాడు ఆనందరావు.

"పెళ్ళిచూపులు" అన్న మాట చెవిన పడ్డాక ఏ కుర్రాడు మాత్రం ప్రశాంతంగా ఉండగలుగుతాడు? !

తండ్రి సమక్షంనుండి తన రూంలోకి వచ్చేశాక- చూడబోయే ఆ పిల్ల గురించే ఆలోచిస్తూ కూర్చున్నాడు ఆనందరావు... ఎలా ఉంటుందో? బాగుంటుందో, లేదో... మరీ ఆ అప్సరస అంత కాకపో యినా కొంచెం అయినా బాగుంటుందో లేదో...

ఇలా ఓ అయిదారు నిముషాలు ఆలో చించుకున్నాక...

"కొంచెమే బాగుంటే చేసుకునే ప్రశ్నే లేదు... ఆ అప్సరసంత బాగుంటేనే చేసు కునేది" అని మరోసారి మనసులోనే నిర్ణ యించుకుని-

ఆ మీదట మళ్లీ ఏదో భ్రమానందంలోకి వెళ్ళిపోయాడు ఆనందరావు.

★ ★ ★

"ఎవరండీ మీరు? " తనని వెతు క్కుంటూ వచ్చిన ఆ వ్యక్తికేసి ఆశ్చర్యంగా చూశాడు ఆనందరావు.

ఇలా అపరిచితులూ, కొండొకచో ఎంద రెందరో ప్రముఖులూ తనని వెతు క్కుంటూ రావటం అతనికి పరిపాటే! అందుక్కాదు అతను ఆశ్చర్యపోత-

ఆ వచ్చిన వ్యక్తి బహు విచిత్రంగా ఉన్నాడు. శరీరం మీద ఎక్కడా వెంట్రుక అనేది మచ్చుకి కూడా లేదు. చర్మం సొరచేప చర్మంలా ఉంది. చెవులు- జంతువు చెవుల్లా తలని దాటి పైకొచ్చి ఉన్నాయ్.

అంతకు తప్పితే మిగతా అంతా మామూలు మనిషిలానే ఉన్నాడు. ధరిం చిన దుస్తులు కూడా మామూలుగానే ఉన్నాయ్. కాళ్ళకు చెప్పులు లేవు.

ఆనందరావు అడిగిన ప్రశ్నకు ఆ వ్యక్తి వెంటనే ఏం బదులివ్వలేదు- మౌనంగా ఉన్నాడు.

ఆనందరావు ఎలాగైతే అతనికేసి విచి త్రంగా చూస్తున్నాడో- అతనూ ఆనందరా







వుకేసి కాసేపు అలానే విచిత్రంగా చూసి... ఆ మీదట చిన్నగా ఏదో అన్నాడు.

అతనన్నది ఏమిటో ఒక్క ముక్క కూడా అర్థం కాలేదు ఆనందరావుకి.

"ఏంటంటున్నారూ? " అన్నాడు... గడప దాటి బైటికెళ్లి తనూ వరండా మీద అతని కెదురుగా నిలబడుతూ.

అతను మళ్లీ ఏదో అన్నాడు.

ఈసారి కూడా అతనన్నది అర్థం కాలేదు ఆనందరావుకి. అంటే- అవతలి వ్యక్తి అస్పష్టంగా ఏదో గొణుగుతున్నాడని కాదు... అతను బిగ్గరగానే మాట్లాడుతున్నాడు. కానైతే అదేమి భాషో ఆనందరావుకి అర్థం కావట్లేదంతే!

"మీరు మాట్లాడుతున్నది ఏం భాష? నాకు అస్సలు తెలియటం లేదు... దయ చేసి ఇంగ్లీష్‌లో గాని, తెలుగులోగాని చెప్పండి..." అన్నాడు ఆనందరావు.

"నువ్వంటున్నది ఏమిటి? " అన్నట్టుగా ఆ వ్యక్తి చేత్తో సైగ చేశాడు- మూగవాడిలాగా!

దాంతో అతడికీ తన భాష అర్థం కావట్లేదని తెలిసిపోయింది ఆనందరావుకి.

"డుయు నో ఇంగ్లీష్ ఆర్ ఎట్‌లీస్ట్ హిందీ? " అని ఈసారి ఇంగ్లీష్‌లో అడిగాడు ఆనందరావు.

దానిక్కూడా ఆ దొప్ప చెవుల విచిత్ర వ్యక్తి అయోమయంగానే చూశాడు.

"సో... ఈ వెధవకి ఇంగ్లీష్ కూడా రాదన్నమాట!" అనుకుని... అతనికేసి మళ్లీ ఓసారి పరిశీలనగా చూశాడానందరావు.

అప్పుడు కనిపించింది అతనికి... ఆ వ్యక్తిలో ఇందాకటిదాకా తాను గమనించని మరో విశేషం-

అతని రెండు చేతులకీ ఆరేసి వేళ్ళున్నాయ్!

దాంతో ఆనందరావు చటుక్కున అతని కాళ్లకేసి చూశాడు... చెప్పులు ధరించకపోవటం వల్ల అతని కాళ్లవేళ్లను కూడా బాగానే లెక్కపెట్టగలిగాడు ఆనందరావు.

అవీ ఆరేసే ఉన్నాయ్!

గతంలో కూడా ఇలాంటి అనుభవాలు అనేకం ఉన్నందున ఆనందరావు పెద్దగా ఏం కన్‌ఫ్యూజ్ అవ్వలేదు.

'అప్పుడెప్పుడో శుక్రగ్రహవాసి కూడా ఇలానే విచిత్రంగా ఉన్నాడుగదా! సో... వీడు కూడా ఎవరో అన్యగ్రహవాసే అయ్యుంటాడు..'. అనుకుని "మీది ఏ గ్రహం? " అడిగాడు ఆనందరావు- ప్రశ్నార్థకంగా ముఖం పెట్టి!

ఆ వ్యక్తికి అది మాత్రం... అర్థమైనట్టే ఉంది. కాని... అని రాసినట్టుగా కాదు; "ఛస్తేగా?" (అన్వయం) 

"టివోలో కింగ్రీ? " అన్నాడు తన భాషలో.

ఆనందరావు ఈసారి పట్టుపట్టి ఆలకించడం వల్ల భావం తెలియకపోయినా అతనన్నది మాత్రం చెవులకెక్కింది.

"టివోలో కింగ్రీనా? అంటే ఏంట్రా డోంగ్రే? " అన్నాడు ఎదుటి వ్యక్తికి ఎలాగూ తెలుగురాదని తెలుసు గనక.

దానికా వ్యక్తి "అంబూట్రీ కటియా? " అన్నాడు.

"అంబూట్రీ కటియా ఏంట్రా... నీ దినం చెయ్య!" అన్నాడు ఆనందరావు మనసులో చిరాకుపడ్డా, ముఖంలో మాత్రం ఆ చిరాకుని వ్యక్తం కానివ్వలేదు.

దానికావ్యక్తి కాస్త విచిత్రంగా నవ్వి "హుక్రూమ్... హుక్రూమ్..." అన్నాడు.

"హుక్రూమ్ అంటావేందిరా నీ పిండా కూడు నీకే పెట్టా!" ఆనందరావు నవ్వాపుకుంటూ అన్నాడు.

"సెమైనే కార్లైవా? " అతను ప్రశ్నించినట్టుగా అన్నాడు.

వాడి భాషని మళ్లీ వాడికే అప్పగిస్తే ఎలా ఉంటుందో చూద్దామనిపించి "ఆc

ఆc సెమైనేకార్లెవా? సెమైనే కార్లెవా!" అన్నాడు ఆనందరావు నిలువుగా తలాడిస్తూ.

ఆ వ్యక్తి ముఖంలో ఆనందంలాంటిది కనిపించింది.

"షీత్రుగ్. షీత్రుగ్... క్యూరె క్యూరె..." అనరిచాడు చప్పట్లు కొడుతూ.

"చేతబడి మంత్రాల్లా... ఏంత్రా... ఆ పాడు భాష? తెలుగులో ఏడ్చి చావొచ్చుగా..."

"కుమార్ త్రూ కట్టియా? "

"అవును... నీ ఎద్దు చచ్చిపోయింది..."

"షిమానే గజిమా? "

"అవున్రా... నీ దున్నపోతు కూడా చచ్చిపోయింది..."

"ఆంత్రూల కట్టాగ్? "

"నోర్ముయ్‌రా... కంత్రీ వెధవా!"

"సుమాగ్ బాటినా? '

"నీ బొంద బాటినా!" అన్నాడు ఆనందరావు పళ్లు గట్టిగా పటపటలాడిస్తూ.

భాషరాని వ్యక్తితో ఏదేదో మాట్లాడి కాసేపే వినోదించగలం. చివరికైతే విసుగు పుట్టక తప్పదు గదా! అదుగో అలాంటి విసుగే ఆనందరావునిప్పుడు పళ్లు పటపటలాడించేలా చేసింది.

కానీ విచిత్రం- ఆ పళ్లు నూరటాన్ని ఆ వ్యక్తి దేనికి సంకేతంగా భావించాడోగానీ- "షింగ్లే... షింగ్లే..." అంటూ ఆనందరావుని ఆప్యాయంగా వాటేసుకున్నాడు.

అంతే!

ఆనందరావు ఒళ్లు జలదరించిపోయింది. అతని శరీరంలోంచి తన శరీరంలోకి ఏదో విద్యుత్తులాంటిది ప్రవహిస్తున్నట్టుగా అనిపించటంతో ఒక్కసారిగా అతన్ని విదిలించికొట్టి వెనక్కి విరుచుకుపడ్డాడు.

ఆ పడ్డం... మంచం మీంచి నేలమీదకు పడ్డంవల్ల అతని తలకు బొప్పి కట్టింది.

అబ్బా! అంటూ లేచి కూర్చుని అయితే




ఇదంతా భ్రమానందమేనన్నమాట! అనుకున్నాడు ఆనందరావు.

ఏమిటో ఈ భ్రమలు? నాకీ పిచ్చి ఎప్పటికి తగ్గుతుందో? అని కూడా అనుకున్నాడు.

అతను తనమట్టుకు తానే అలా అనుకోవటం చాలా అరుదు. నిజానికి అతనెప్పుడూ తన భ్రమల వల్ల 'థ్రిల్'నే అనుభవిస్తుంటాడు... కానీ... ఇప్పుడు తల బొప్పి కట్టిందిగా. అందుకని అలా అనుకున్నాడన్నమాట.

బొప్పి కట్టిన తన తలని నిమురుకుంటుంటే అతనికెందుకో మళ్లీ తన పెళ్లిచూపుల విషయం జ్ఞాపకానికొచ్చింది.

'ఆ అమ్మాయి ఆ అప్సరసకన్నా ఖచ్చితంగా బాగుంటేనే తప్ప చచ్చినా ఒప్పుకోకూడదు...' అని మళ్లీ అనుకుని ఆ మీదట నిద్రలోకి జారిపోయాడు.

నిజానికది నిద్రపోవాల్సిన సమయం కాదు. చదువుకోవాల్సిన పోర్షన్ చాలానే ఉంది. కానీ చదువు మీద అతని కంత ఇంట్రస్ట్ ఉంటే కదా!

అలాగని అతనేం ఫెయిలయ్యే బాపతు కాదు. ఇప్పటిదాకా అన్ని తరగతుల్లోనూ ప్యాసవుతూనే వచ్చాడు. కానీ, శ్రద్ధగా





చదివి కాదు పరీక్షలప్పుడు జస్ట్ ముక్కున పెట్టుకుని వెళ్లి తుమ్మి మినిమమ్ మార్కులతో పాసైపోతూ ఉంటాడన్నమాట.

అది మాత్రం ఏమంత సామాన్యమైన విషయమా?

అందరికీ అబ్బొబ్బద్దా ఆ ఆర్టు?




"రేపు నీ పెళ్లి చూపులటగా?" అనంతలక్ష్మిని అడిగింది ఆమె స్నేహితురాలు సునంద.

"మరే..." అంటూ చిన్నగా నవ్వింది అనంతలక్ష్మి.

"అదేంటే- నువ్ పరమపురుష ద్వేషివి గదా! చచ్చినాసరే పెళ్లి చేసుకోనని మా దగ్గర అన్ని ప్రగల్భాలు పలికినదానివే, ఇప్పుడీ పెళ్లిచూపులకెలా ఒప్పుకున్నావ్?" బుగ్గలు నొక్కుకుంటూ ఆశ్చర్యంగా పలికింది సునంద.

అందమైన అనంతలక్ష్మి అందంగా నవ్వింది.

"ఒప్పుకున్నది పెళ్లి చూపులకే తప్ప పెళ్లికి కాదుగా?" అంది గమ్మత్తుగా తల ఎగరేస్తూ.

"అంటే?" కళ్లెగరేసింది సునంద.

"అవునే" ఏదో మా నాన్న పోరుపడలేక ఈ పెళ్లి చూపులకి ఒప్పుకున్నాను. ఇల్లు అలకగానే పండుగ అయిపోదుగదా!" అంది అనంతలక్ష్మి.

"యూ మీన్... పెళ్లి చూపుల్లో అతను నీకు నచ్చలేదని చెప్పేస్తావా- ఏంటి?"

"కాదు నేను తనకు నచ్చలేదని అతని చేతనే చెప్పిస్తాను..."

"వాట్?!" అదిరిపడింది సునంద. "నువ్ నచ్చలేదని అతని చేతనే చెప్పిస్తావా? ఈజిట్ పాసిబుల్?" అంది నోరు వెళ్లబెడుతూ.

"ఏం... ఎందుక్కాదూ?" నాలుక చప్పరించేస్తూ అంది అనంతలక్ష్మి- అదో మాదిరి నిర్లక్ష్యంగా!

"కాదుగాక కాదు... కళ్లున్న మగాడెవ్వడూ నిన్ను చూసి నచ్చలేదని చెప్పలేడు... ఒకవేళ ఎవరైనా అలా చెప్పగలిగితే వాడొక మతిలేని వెధవ అని అర్థం..." అంది సునంద, అనంతలక్ష్మి అందాన్ని ఆరాధనగా చూస్తూ.

ఆడవాళ్లకు కూడా, అలా కళ్లతోనే జుర్రేసుకోవాలనిపించేంత గొప్ప అందం అనంతలక్ష్మిది. సునంద చెప్పింది అక్షరాలా నిజం.

కళ్లున్న మగాడెవ్వడూ ఆమెని తిరస్కరించలేడు. "నువ్వలా అంటున్నది నా అందాన్ని దృష్టిలో పెట్టుకునే కదా!" అంది అనంతలక్ష్మి.

"అవును పెళ్లిచూపుల్లో మగాడు ముందుగా పిల్ల అందాన్నే చూస్తాడు. నీలో ఉన్నది అందం ఒక్కటేనా? దానికి తోడు బోలెడంత ఆస్తి కూడా ఉందాయె, సో... అతను నిన్ను తిరస్కరించటం అన్న ప్రశ్నే ఉత్పన్నం కాదు..." స్థిరంగా పలికింది సునంద.

"డోంట్ సే లైక్‌దట్! కేవలం అందం, ఆస్తి ఇవి రెండేనా కాబోయే భార్యలో మగాడు కోరుకునేది? ఇంకా చాలా ఉంటాయ్!" మనసులో ఏదో ఆలోచిస్తూ పైకి అలా అంది!

"ఏంటే- ఆ చాలా? ఒకింత ముందుకు

జరిగి స్నేహితురాలి తొడమీద చరుస్తూ అడిగింది సునంద. ఆ సమయంలో వాళ్లిద్దరూ అనంతలక్ష్మి వాళ్ల డాబామీద కూర్చుని ఉన్నారు... సమయం సాయం కాలం.

"అదంతా ఇప్పుడేం చెప్పను... రేపు పెళ్లిచూపుల్లో నువ్వూ నా పక్కనే ఉంటావుగా! అప్పుడు నువ్వే చూద్దువుగాన్లే... అక్కడేం జరిగిందీ...ఆకాశంలో ఎగురుతున్న ఓ ఒంటరి పక్షికేసి చూస్తూ కంటిన్యూ చేసింది అనంతలక్ష్మి... "ఆ పక్షిలా ఎప్పటికీ స్వేచ్ఛగా ఉండాలన్నది నా కోరిక... అలాంటిది చూస్తూ చూస్తూ పెళ్లి అనే ఉచ్చులో చిక్కుకోలేను... సో... దాన్ని అవాయిడ్ చేయడానికి నేనేవన్నా చేస్తాను..."

"అంటే ఏదన్నా మాయోపాయం పన్నబోతున్నావా? ..." అడిగింది సునంద ఆసక్తిగా.

"అలాగే అనుకో పోనీ..." అంటూ నవ్వింది అనంతలక్ష్మి.

"ఇంతకీ ఏం చేయబోతున్నావు? "

"వివరాలు అడగొద్దన్నాగా! రేపు నువ్వే చూస్తావుగా!" అంటూ మళ్లీ నవ్వింది అనంతలక్ష్మి.

స్నేహితురాలు నవ్వుతున్న ఆ విధానం చూస్తుంటే ఆమె ఏదో ఎత్తుగడ వేయబోతోందని చాలా స్పష్టంగా అర్థమైపోయింది సునందకి. కానీ అదేమిటన్నదే ఊహించలేకపోయింది.

అనంతలక్ష్మి సునంద ఒకటో తరగతి నుండి టెన్త్‌క్లాస్ దాకా క్లాస్‌మేట్సు. అంతే కాకుండా మంచి స్నేహితులు... అంత చిన్నప్పట్నుంచి కలిసి మెలిసి తిరిగినవాళ్లు కాబట్టి, క్లాస్‌మేట్స్‌గా పెరిగినవాళ్లు కాబట్టి వాళ్లిద్దరి మధ్య రహస్యాలంటూ ఏంలేవు. ఒకరి గురించి ఒకరికి క్షుణ్ణంగా తెలుసు.

అనంతలక్ష్మి చిన్నప్పట్నుంచి కూడా పురుషద్వేషే! ఒకట్రెండు తరగతులు చదువుతున్నప్పుడు కూడా ఆమె సునందతో అంటుండేది. "నేను పెద్దయ్యాక కూడా పెళ్లి చేసుకోను... నా మట్టుకు నేను ఇలా ఒక్కదాన్నే ఉంటా..." అని.

కారణం అడిగితే మొగుళ్లు పెళ్లాలని కొడుతుంటారనీ, అలాంటప్పుడు పెళ్లి చేసుకోవటం ఎందుకనీ అంటుండేది.

"అందరూ కొట్టరుగా? " అంటే-

"నేను చూసినంత వరకు అందరూ అంతే!" అనేది.

ఆమె చెప్పింది నిజం. ఆమెకు తెలిసినంతమట్టుకు వాళ్ల పిన్ని, పెద్దమ్మ, మేనత్త, ఎదురింటి మాధవి, పక్కింటి తులసి, డ్రిల్ మాస్టారి భార్య శారద ఇలా అందరూ మొగుళ్ల చేత తన్నులు తినే ఆడవాళ్లు... వాళ్లే కాకుండా అది అంతంత మాత్రం పల్లెటూరు కావడంచేత అలాంటి వాళ్లు ఇంకా ఎంతోమంది ఆమె దృష్టిలో పడ్డారు. ప్రత్యక్షంగా చూసిన అనుభవం!

భార్యల మీద చేయి చేసుకోవటం అనేది పల్లెటూళ్లలో కాస్తా ఎక్కువగానే కనిపిస్తుంటుంది గదా! అందుకే పెళ్లంటే ఊహ తెలియటం ప్రారంభించిన రోజులనుంచే ఆమెలో ఏదో తెలియని భయం పట్టుకుంది. అదే ఆమెను క్రమంగా పురుషద్వేషిగా మార్చింది.

అంత మాత్రానికే ఎవరన్నా పురుష ద్వేషులుగా మారిపోతారా అన్నది ప్రశ్నే కాదిక్కడ.

భార్యలమీద చేయి చేసుకోవడమే కాదు-కట్నం కోసమో, మరొకందుకో భార్యల్ని చంపేసేవాళ్లు కూడా ఉంటారన్న విషయం ఆమెకు చిన్నప్పటి నుంచే బాగా అవగతమైంది.

ఎవరిదాకో ఎందుకు- స్వయానా ఆమె పెద్దమ్మే అలా మొగుడి చేతిలో హతమైపోయింది. ఇది ఆమె పన్నెండో ఏట జరి





## నవలను ఖూనీ చేస్తే ఎలా?

**త**న నవలను స్టేజ్ పై ప్రదర్శించేందుకు కొలాబరేటర్‌గా పనిచేసే హార్వే గురించి ఓసారి ఆర్కే తన మిత్రుడికి ఇలా రాశాడు- 'హార్వే తనను నేను ఒక ల్యాకీ(సేవకుడి)గా ట్రీట్ చేస్తున్నానని చెప్పాడట కదా? నిజంగా నాకు ల్యాకీ అంటే ఎవరో తెలీదు.. కారణం అలాంటివారు నా దగ్గర ఎవరూ లేరు. అయితే నా నవలను ఖూనీ చేసేవారిని మాత్రం అంతకంటే హీనంగా ట్రీట్ చేస్తానని చెబుతున్నాను'



గిన సంఘటన.

ఆ తర్వాత ఆమె బంధువుల్లో ఎవ్వరూ అలాంటి చావు చావకపోయినా- ప్రతి రోజూ పేపర్లో అలాంటి వార్తలు చూస్తూనే వచ్చినందువల్ల ఆమెకు తెలియకుండానే ఆమెలో అలా క్రమక్రమంగా పురుష ద్వేషం పెరిగిపోయింది.

ఈ విషయంలో ఆమెకీ, సునందకీ మధ్య అనేకసార్లు చిన్న చిన్న వాదులాటలు కూడా జరిగాయి. "ఏదో నువ్ చూసిన కొంతమంది పరిస్థితి అలాగయ్యిందని చెప్పి అందరూ అలాగే ఉంటారా? " అని సునంద వాదిస్తే "మెజారిటీ మగాళ్లు అలాగే ఉంటారు! అలాంటప్పుడు పెళ్లి చేసుకుని అనవసరంగా రిస్క్ చెయ్యడం దేనికి? ఏం ఆడది ఒంటరిగా జీవించలేదా? " అనేది అనంతలక్ష్మి ధీమాగా!

"అందరూ నీలాగే ఆలోచిస్తే ఇంకా ఈ ప్రపంచం ఏమైపోతుందో..." అంటే-

"అందరి సంగతి నాకు అనవసరం. నేను మాత్రం పెళ్లి చేసుకోనంతే..." అని ఖండితంగా అనేది.

ఒక్క సునందతో అనేకాదు... టెంత్ క్లాస్‌లో వీళ్లతో పాటు రజిత, రమ అనే ఇంకో ఇద్దరమ్మాయిలు కూడా ఉండేవాళ్లు... అంటే ఈ నలుగురూ ఓ జట్టుగా ఉండేవాళ్లన్నమాట... వాళ్లతో కూడా ఇలాగే వాదించేది అనంతలక్ష్మి.

మొదట్లో అందరూ అనంతలక్ష్మి మాటలకి నవ్వుకునేవాళ్లు. ఏదో ఊర్కూర్కే అలా అంటోందిలే అనుకునేవాళ్లు. కానీ అలాంటి వాదోపవాదాలు వాళ్ల మధ్య అనేకసార్లు జరిగిన మీదటా అనంతలక్ష్మిలోని పురుషద్వేషం నిజంగానే నిజమైందని వాళ్లందరికీ కూడా అర్థమైపోయింది.

అందుకే అనంతలక్ష్మికి పెళ్లి చూపులంటే సునంద ఇపుడంతగా ఆశ్చర్యపడాల్సిన సందర్భం ఉత్పన్నమయింది. "నా దగ్గర దాపరికం దేనికే? ఏం చెయ్యబోతున్నావో చెప్తే నేనూ విని సంతోషిస్తాగా!" కుతూహలాన్ని ఆపుకోలేక అడిగింది సునంద.

"అబ్బే... అది చెప్తే బావుండదు... రేపు స్పాట్‌లో చూస్తేనే నీకు థ్రిల్..." అంది అనంతలక్ష్మి.

"సరే చెప్పొద్దులే అయితే...దాచుకో..." అనేసి... క్షణం తర్వాత అడిగింది సునంద.

"ఇంతకీ రేపు నిన్ను చూడబోతున్న ఆ అబ్బాయి పేరేమిటి? ఊరేమిటి? కనుక్కున్నావా? "

"నాకంత ఇంట్రస్ట్ ఎక్కడిదే? ఆc... అనుకుంటుంటే విన్నాను... గొప్ప పేరేం కాదులే... చాలా పాతకాలం పేరే... నాలా..." అంది అనంతలక్ష్మి.

"అబ్బ! ప్రతిదానికీ ఈ ఊరించే లక్షణం ఏంటే బాబూ- చంపుతున్నావ్. పాతదో బోతదో... అదే చెప్పవచ్చుగా? " చిరుకో

పంగా అంది సునంద.

అప్పుడు చెప్పింది అనంతలక్ష్మి ఆ వరుడి పేరు- "ఆనందరావు".

★ ★ ★

కొడుకు మాటల్ని పెడచెవిన పెట్టి పర్సు గురించి ఎంక్వయిరీ చెయ్యడానికి స్వయంగా పోలీస్ స్టేషన్‌కెళ్లి, అక్కడ హిప్పోపొటమస్ ఎస్సయ్‌తో నానా తిట్లూ తిని నీరసంగా ఇంటికొచ్చిన మాధవరావుకి హాల్లో సోఫాలో కూర్చుని ఏదో ఆలోచిస్తున్న ఆనందరావ్ కనిపించాడు.

"ఇంక నేను చచ్చినా వెళ్లనని నిన్న వీడలా మొరాయించబట్టేగదా ఇవ్వాళ తను వెళ్లి అన్ని చీవాట్లు తినాల్సివచ్చింది?" అన్న కోపం అక్కడున్న కొడుకు మీద మండిపడేలా చేసింది.

"ఏంటి నాయనా తీరుబాటుగా కూర్చుని ఆలోచిస్తున్నావు?" అన్నాడు గుమ్మం దగ్గర చెప్పులు విడిచి కొడుకు కూర్చున్న సోఫా దగ్గరికి చరచరా వెళ్తూ.

బదులివ్వడానికి ఆనందరావు ఈ లోకంలో ఉంటేగా? షరా మామూలుగా అతనేదో భ్రమానందంలో మునిగి తేలుతున్నాడు.

"రేయ్ అడిగేది నిన్నే..." అంటూ ఈసారి ఆనందరావు భుజం మీద చరిచాడు మాధవరావు.

అదేమన్నా సామాన్యమైన చరుపా- ఆనందరావు ఈ లోకంలోకి రాకుండా ఉండగలటానికి!

"నువ్వా నాన్నా! ఏమైంది? ఏమన్నాడు ఆ ఎస్సయ్..." అనడిగాడు ఆనందరావు స్ట్రయిట్‌గా కూర్చుంటూ. చెత్త తిట్లన్నీ తిట్టే ఉంటాడులే అనుకున్నాడు మనసులో. కొడుకలా అడుగుతుంటే కొరివితో కాల్చినట్టే అనిపించింది మాధవరావుకి.

"ఆ ఎస్సయ్‌గాడు నోటికొచ్చినట్టల్లా వాగేడు..."

"మరదేగదా- నిన్న నేను చెప్పింది కూడా" మనసులో నవ్వుకుంటూ పైకి మాత్రం మామూలుగానే అన్నాడు ఆనందరావు.

అయినా సరే అర్థమైపోయింది మాధవరావుకి, కొడుకు మనసులో నవ్వుకుంటున్న సంగతి.

దాంతో ఆయన కొడుక్కేసి తీక్షణంగా ఒక్క చూపు చూశాడు.

అత్తమీద కోపం దుత్తమీద చూపినట్టు- నాకేసి అలా చూస్తాడేమిటి? అని మనసులో అనుకుని... "నువ్ వెళ్లకపోయి ఉంటే బాగుండేది నాన్నా" అన్నాడు.

అది సానుభూతో, ఎగతాళో అర్థంకాక కొడుక్కేసి మరింత తీక్షణంగా చూశాడు మాధవరావు.

దరిమిలా పళ్లనూరి... "తమరు వెళ్లనని మొరాయిస్తే నాకు తప్పుతుందామరి?" అన్నాడు నుదురుచిట్లిస్తూ, "ఇంతకీ రాజాగారు ఇంట్లో కూర్చుని వెలగబెడుతున్నదేమిటో..." క్షణం తర్వాత ఆయనే అన్నాడు మళ్లీ.

'ఏముంది భ్రమానందంలో మునిగితేలుతున్నా' అని పైకి చెప్పలేడు కాబట్టి- మౌనంగా ఉండిపోయాడు ఆనందరావు- కళ్లుదించుకుని!

"అడిగేది నిన్నే..." అన్నాడు... కాదు... గట్టిగా అరిచాడు మాధవరావు.

అంతలో- "ఏంటండీ... ఎందుకు వాడ్నలా కేకలేస్తున్నారు?" అంటూ వీధి గుమ్మంలోంచి లోనికొచ్చింది సావిత్రి.

"తమరెక్కడికెళ్లినట్టో?" అన్నాడు మాధవరావు తన కోపాన్ని భార్యమీదకు మళ్లిస్తూ.

"నీలాంబరిగారి టీవీ ఖరాబైతే చూసిరావడానికి వెళ్లాన్లేగానీ ఏంటీ, వాడిమీద అరుస్తున్నారు?" అంది సావిత్రి నిమ్మళంగా!

"నీకేమో పద్దాకా ఆ పెత్తనాలు! వీడి







కేమో ఎప్పుడూ ఆ పనికిమాలిన భ్రమా నందాలు... ఈ ఇంట్లో ప్రతి చిన్నపనీ నేనే చేసుకుచావాల్సొస్తోంది. అయినా వాళ్లదెవరిదో టీవీ ఖరాబైతే నువ్వు వెళ్లి చేసేదేముంటుందీ? నువ్వేమన్నా టీవీ మెకానిక్కువా? " భార్యకేసి గుర్రుగా చూశాడు మాధవరావు.

"భలేవారే! మెకానిక్కయితేనే వెళ్లాలా? ఎదుటివాళ్లకు ఆపదొచ్చినప్పుడు వెళ్లి పరామర్శించి రావటం తప్పా? అద్సర్లే గాని మీరు అరుస్తున్న కారణం చెప్పండి? " అంది సావిత్రి.

చెప్పాడు మాధవరావు- తాను ఎస్సైతో తిట్లుతిని, అవమానింపబడిన సంగతి-

"దానికి వాడిమీద అరవాల్నా? " చేతులు అటూ ఇటూ తిప్పుతూ దీర్ఘం తీసింది సావిత్రి.

"ఈ వెధవ వెళ్లుంటే నాకా తిట్లు తప్పేవిగా? "

"కానీ ఆ తిట్లేవో వాడికి పడేవిగా! పాపం..."

"అందుకే వాడు రోజూ అలా మొత్తుకుంటున్నాడు... పోతేపోయిందిలేగాని ఆ పర్స్ కోసం మీరింక పోలీస్‌స్టేషన్ చుట్టూ తిరగబోకండి..."



భార్య అలా అంటుంటే మండుకొచ్చింది మాధవరావుకి. "పోయిందేమన్నా పదో, పరకో అనుకుంటున్నావా? ఐదొందలు" అన్నాడు బాధగా.

"అందుకని రోజూ వెళ్లి తిట్టించుకుని వస్తారా? "

"అంతకన్నా దాని గురించి మర్చిపోవడమే మేలు" ఆనందరావు కలుగజేసుకుంటూ అన్నాడు.

"నువ్ నోర్మూయ్యరా వెధవా..." కొడుకేసి తల తిప్పి కడిమెడు కోపాన్ని కక్కేడు మాధవరావు.

"ఎందుకండీ- అంతలేసి మాటలు? అసలే రేపు పెళ్లిచూపులకు వెళ్లబోతున్న పిల్లాడు!" పెళ్లిచూపులకు వెళ్లటం అనేది ఏదో ఘనకార్యం అయినట్లుగా అంది సావిత్రి- కొడుకు వంక మురిపెంగా చూస్తూ.

"అయితే ఏంటీ? "

"ఏంటేంటి? ఇవ్వాళంతా వాడ్ని ప్రశాంతంగా ఉండనివ్వండి... మీ శాపనార్థాలతో మనసంతా పాడుచేసేసుకున్నాడను కోండి... రేపా పిల్లని చూసి సరైన

నిర్ణయం తీసుకోలేడు...” ఈసారి కొడుక్కేసి ప్రేమగా చూస్తూ చెప్పింది సావిత్రి.

ఆమె మాటల్లో కొంత లాజిక్ ఉన్నట్టుగా ఉన్నా, దాన్నేం పట్టించుకోలేదు మాధవరావు.

“వేరే నిర్ణయం అంటూ ఏముంటుంది? చెప్పేనుగా నిన్ననే- పిల్లకి కాలుకన్నూ తిన్నగా ఉంటే చాలు ఒప్పేసుకుని వచ్చెయ్యడమే...” అన్నాడు అదోలా తలూపుతూ! ఆ తలూపులో ‘ఏరా వెధవా అర్థమైందా? ’ అన్న హెచ్చరికలాంటిదేదో ఉన్నట్టనిపించి లోలోన ఉడికిపోయాడు ఆనందరావు.

“అంటే నాకు నచ్చాల్సిన పన్లేదా? ” అన్నాడు కాస్త కోపంగానే.

“అలాగని ఎవరన్నారు? ”

“నువ్విప్పుడంటున్నది అదేగా? కన్నూ, కాలూ తిన్నగా ఉంటే చాలు ఒప్పేసుకోమనేగా ఉద్దేశం? ”

“కాక? చిన్న చిన్న విషయాలకి వంకలు ఎన్నుతూ కూర్చుంటావా? అవతలా పిల్లకి పాతిక లక్షల ఆస్తుందన్న







సంగతి మర్చిపోకు..." పాతిక లక్షల్ని ఒత్తి పలుకుతూ అన్నాడు మాధవరావు.

"అవున్రా- ఏ మాత్రం బాగున్నా ఒప్పేసుకోవడమే మంచిది..." అంది సావిత్రి కూడా భర్త పక్షాన్న చేరిపోతూ!

'కొంపదీసి వీళ్లిద్దరూ కూడబలుక్కుని ఏ అనాకారినో నాకు అంటగట్టబోవట్లేదు గదా?' అన్న అనుమానం మొదలైంది ఆనందరావులో.

"ఈ విషయాన్ని పదేపదే చెబుతున్నా రెందుకు ఇంత గట్టిగా? కొంపదీసి అమ్మాయిగాని బాగుండదా ఏమిటి?" అని అడిగేశాడు ఉండబట్టలేక.

"నీ అనుమానాలు పాడుగానూ- అయినా మేం మాత్రం ఆ అమ్మాయిని చూసిందెక్కడ?" అన్నాడు మాధవరావు.

"మరైతే బాగోకపోయినా ఒప్పుకో- అన్నట్టుగా చెప్పడంలో మీ ఉద్దేశం?" తండ్రి కేసి సూటిగా చూడలేక ఎటో చూస్తూ అడిగాడు ఆనందరావు.

"డబ్బున్న పిల్లని చేసుకుంటే నువ్ సుఖపడతావని!" అనేసి అక్కడినుంచి వెళ్లిపోయాడు మాధవరావు.

"అవున్రా! పిల్ల అందంకన్నా డబ్బే ప్రధానం..." అని తనూ భర్తని అనుసరించింది సావిత్రి.

ఒంటరిగా మిగిలిపోయిన ఆనందరావుకి మళ్లీ వచ్చేసింది డౌటు!... ఆ పిల్ల బాగుండదేమో? వీళ్లకా సంగతి తెలిసే ఇలా ఎగదోస్తున్నారేమో? వీళ్లా పిల్లని డైరెక్టుగా చూసుండకపోయినా, సుందర్రావంకుల్ చెప్పుండొచ్చుగా- పిల్ల ఏమంత బాగుండదని!

అలాంటిదేదో ఉండుండకపోతే కన్నూ, కాలూ తిన్నగా ఉంటే చాలు ఒప్పేసుకోమన్నట్లు- ఎందుకు అన్నిసార్లు మాట్లాడుతారు!

సో... అదే గనుక నిజమైతే తను ఆ అమ్మాయిని చచ్చినా చేసుకోడు. ఇంకా గట్టిగా నిర్ణయించుకున్నాడు.

ఆస్తి ఎంతైనా ఉండొచ్చు.. కానీ, దాని కన్నా అందమే ముఖ్యం తనకి... బోడి ఆస్తి ఏం చేసుకోను?

ఆనందరావు, ద గ్రేట్ భార్య అప్సరసంత అందంగా ఉండకపోతే ఎలా?

వీళ్ల దుర్బోధలకి తలొగ్గి ఓ అనాకారిని చేసుకుంటే సెలక్షన్ చేతకాని వెధవ అని అందరూ నవ్వుకోరూ!?

ఇలా పరిపరి విధాలా ఆలోచిస్తూ... చిస్తూ... చిస్తూ... ఏదో భ్రమానందం లోకి జారిపోయాడు ఆనందరావు- మత్తుగా!

సదరు భ్రమానందం ఏమైతేనేమి?

★ ★ ★

ఎన్నో సుశంకలతో పెళ్లిచూపులకు బలవంతంగా ప్రయాణమై వెళ్లిన ఆనందరావు- పిల్లది ఉన్న ఊరేం కాదులెండి.... పొరుగూరు! పెళ్లిచూపుల్లో అనంతలక్ష్మిని చూసి దిగ్భ్రాంతి చెందాడు.

చెందడా మరి! అనంతలక్ష్మి అందం అలాంటిది! అప్సరసలేం పనికొస్తారు ఆమె ముందు!

'పిల్ల నాకు నచ్చేసింది...' అని అక్కడే అరిచేయాలనిపించింది ఆనందరావుకి. అయినా బాగుండదని నిగ్రహించుకున్నాడు బలవంతంగా!

'పిల్లేకాదు- పిల్ల పక్కన ఉన్న స్నేహితురాలు కూడా బాగానే ఉంది' అనుకున్నాడు సునందని చూసి.

సదరు పెళ్లిచూపుల కార్యక్రమంలో మొత్తం ఎనమండుగురు సభ్యులున్నారు... వరుడు ప్లస్ వరుడి తల్లిదండ్రులు. వధువు ప్లస్ వధువు తల్లిదండ్రులు. వాళ్లుకాక సునంద, సుందర్రావులు... వెరసి ఎనమండుగురు.

ముందుగా పరస్పర పరిచయ కార్య

క్రమం, కాఫీ, టిఫిన్లూ ముగిసాక- ఆ మీదట పిల్లని చూపించారు ఆనందరావుకి.

రిజల్ట్... ముందే చెప్పబడిందిగా, ఆనందరావు దిగ్భ్రమ చెందాడనీ, పిల్ల నాకు నచ్చేసిందని అరవబోయి బలవంతాన నిగ్రహించుకున్నాడనీ!

అతనలా అరవబోయి నిగ్రహించుకోవడాన్ని ఏదో అడగబోయి మానేయడంగా గమనించి "అమ్మాయిని ఏమన్నా అడగాలనుకుంటే అడుగు బాబూ!" అన్నాడు సుందర్రావు- ఈయన ఆనందరావుకి వరసకి మావయ్య అవుతాడు. దూరపు బంధువు. అసలీ సంబంధాన్ని చూపించిందే ఆయన గదా! అందుకే ప్రొఫెషనల్ పేరయ్య కాకపోయినా ఉభయుల తరపునా మధ్యవర్తిగా వ్యవహరించసాగారాయన.

ఆయన అలా అనగానే... "అడుగు బాబూ... పర్లేదు" అని సంయుక్తంగా అన్నారు అనంతలక్ష్మి అమ్మా, నాన్నలు. ఆయన పేరేమో రఘుపతి. ఆవిడ పేరు కౌసల్య.

సరే అవకాశం ఇచ్చారు కదాని ఆనందరావు ఏదో అడుగుదామనుకుంటుండగా-

"నీకు పాటలు వచ్చామ్మా?" అని సావిత్రి అడిగింది.

'ఇంతటి సౌందర్యరాశికి పాటలు రాకుండా ఉంటాయా?' అనుకుని ఆనందరావు ఆమె సమాధానం కోసం చెవులు రిక్కించాడు. "వచ్చుండీ..." అనే అక్షరాలు ఎంతో బిడియంగా ఆమె నోటినుంచి వస్తాయనుకుంటుంటే- అక్షరాలు కాదు ఉన్నట్టుండి నురుగు రావటం ప్రారంభించింది ఆమె నోటినుంచి- తెల్లగా!

అది చూసి ఆనందరావుతో సహా అందరూ బిత్తరపోయారు.

అనంతలక్ష్మి అమ్మా, నాన్నలు "అమ్ములూ... అమ్ములూ..." అని గాభరాగా అంటుండగా... ఆమె చటుక్కున నేలకొరిగిపోయి కాళ్లూ, చేతులూ కొట్టుకోవడం ప్రారంభించింది.

చూస్తూనే అర్థమైపోతూ ఉంది అందరికీ అది 'మూర్ఛ' అని!

"ఇది మూర్ఛలాగే ఉంది... ఏదైనా తాళాలగుత్తి ఉంటే పిల్ల చేతికివ్వండి..." ఒకపక్క కంగారు పడుతూనే సుందర్రావు ఓ సలహా ఇచ్చాడు.

"మూర్ఛా? !!" దాదాపుగా ఏడ్చేస్తూ అంది కౌసల్య.

"అవునమ్మా!...అదేం కన్పించటంలా?" అంటూనే సోఫాలోంచి లేచి వెళ్లి తన జేబులోనే ఏదో తాళాల గుత్తి ఉంటే-దాన్ని అనంతలక్ష్మి చేతిలో పెట్టి పిడికిలి మూశాడు సుందర్రావు.

రఘుపతి, కౌసల్యలు ఏంచెయ్యాలో పాలుపోక ఏడ్చేయటం ప్రారంభించారు.

అనుకోకుండా పిల్లకి ఇలా ఫిట్స్ రావటం- వాళ్లని కర్తవ్యాన్ని మర్చిపోయేలా చేసింది.

మాధవరావు, సావిత్రి చేష్టలు దక్కి చూస్తూ కూర్చుండిపోయారు. ఆనందరావు సంగతి సరేసరే.

అనంతలక్ష్మి అమ్మా, నాన్నలు ఏడు

## కొత్తగాలి...

**విడదీస్తే**
**రాజకీయం**
**కలిపి కుడితే**
**మానవీయం**

-డాక్టర్ ఎం. విజయగోపాల్,
మహారాణి పేట, విశాఖపట్నం





స్తుంటే సునందకీ దుఃఖం పెల్లుబికింది. 'ఇదిగాని నాటకమా?' అన్న అనుమానం లోలోన కలుగుతూనే ఉన్నా, ఆమె కూడా ఏడ్చేయటం ప్రారంభించింది.

'ఇంత అందమైన అమ్మాయికి మూర్ఛ రోగమా?' మనసులో ఎవరో చెయ్యిపట్టి కెలుకుతుకుతున్నట్టుగా అనిపించసాగింది ఆనందరావుకి.

తాళాలగుత్తి చేతికిచ్చిన తర్వాత అనంత లక్ష్మి కాళ్లూ, చేతులూ కొట్టుకోవటం కాస్త తగ్గింది. కానీ, మనిషి మాత్రం స్పృహ లోకి రాలా! నోటి నుండి నురుగులు రావటమూ కొంచెం తగ్గింది.

ఆ స్థితిలో ఒక్క సుందర్రావు మాత్రమే కాస్త చురుగ్గా ఆలోచించగలిగాడు.

"అందరూ ఇలా ఉండిపోతే ఎలా? ఎవరన్నా వెళ్లి డాక్టర్‌ని పిలుచుకరండి..." అనరిచాడు.

దానికి ఆనందరావు వెంటనే స్పందిస్తూ లేచి నిలబడ్డాడు.

"నువ్వెక్కడికిరా?" అన్నాడు అది చూసి మాధవరావు.

"డాక్టర్ని పిలుచుకురావటానికి!"

"నీ మొహం... మనకెందుకు ఈ గోల? మనం ఇంక బయల్దేరదాం పదండి..." కొడుకు మీంచి దృష్టిని భార్య మీదకు మళ్లిస్తూ అన్నాడాయన.

సావిత్రి 'సరే' అన్నట్టు తలాడిస్తుంటే-

"బావగారూ ఇదేంటి?" అన్నాడు రఘుపతి ఆవేదనగా. పిల్లకిలా జరిగిందన్న బాధ ఒకపక్క- చూపులకొచ్చిన వాళ్లు అర్థాంతరంగా వెళ్లిపోతున్నారన్న బాధ మరోపక్క!

"ఏంటా? మీ మూర్ఛరోగం పిల్లని మేం చేసుకోలేం గనక... వెళ్లిపోతున్నాం. అంతే..." ఖండితంగా చెప్పి... "ఇంకా కూర్చున్నారేంటి లేవండి... లేవండి..." అన్నాడు మాధవరావు.

నిజానికి అప్పటికి ఆనందరావు నిలబడి ఉన్నాడు గదా! తండ్రి అలా అనగానే గభాల్న ఓ నిర్ణయానికి వచ్చేసి చటుక్కున తిరిగి కూర్చున్నాడతను.

"అదేంట్రా చెప్తుంటే మళ్లీ కూర్చుంటావ్?" కసురుకున్నాడు మాధవరావు.

"బావగారూ! అమ్మాయికి ఇలా జరగటం ఇదే మొదటిసారి. దయచేసి మీరు తొందరపడి ఏ నిర్ణ... " రఘుపతి ఏదో చెప్పబోతుంటే- కస్సుమంటూ మధ్యలోనే అడ్డు తగిలాడు మాధవరావు.

"ఇది ఎన్నో సారన్నది ప్రశ్నకాదు... మొత్తాన్నికైతే మీ అమ్మాయికి మూర్ఛ రోగమే కదా! ఈ సంబంధం మాకొద్దు.."

తండ్రి మాట ఇలా పూర్తయ్యిందో లేదో - వెంటనే గొంతు విప్పాడు ఆనందరావు.

"ఈ స్థితిలో ఇవికావు నాన్నా మనం మాట్లాడాల్సిన మాటలు... ముందు ఆ అమ్మాయి ట్రీట్‌మెంట్ సంగతి ఆలోచించాలి"

"ఆ గోలేదో వాళ్లు పడతారు మనకెందుకు? ముందు నువ్ నోర్మూస్కుని నడువ్... " అరిచాడు మాధవరావు. ఎంత ఆస్తి ఉంటే మాత్రం? మూర్ఛరోగినా కోడలిగా చేసుకునేది? ఆ ఊహే నచ్చటం లేదు ఆయనకు! ఆనందరావు తండ్రి అరుపుని ఏమాత్రం ఖాతరు చెయ్యలేదు.

"అంకుల్ మీరెళ్లి డాక్టర్‌ని పిలుచుకురండి" అన్నాడు సుందర్రావుని ఉద్దేశించి.

దాంతో ఆయన బయటకు పరుగు తీశాడు.

"చెప్తుంటే వినిపించుకోకుండా ఏంట్రా నీ ఇది?" మాధవరావు గుర్రుగా చూశాడు కొడుకు దిక్కు.

"ఇదీలేదు అదీలేదు... ముందు ఆ అమ్మాయి కండిషన్ బాగుపడనివ్వండి. మిగతా విషయాలన్నీ ఆ తర్వాత మాట్లా

డుకుందాం... అంతవరకూ మనం ఎక్కడికీ వెళ్లబోవటం లేదు..." తెగేసినట్టు చెప్పాడు ఆనందరావు

కొడుకు తనని ఎదిరిస్తూ తనముందు అంత ధైర్యంగా మాట్లాడటం... ఆశ్చర్యాన్ని కలిగించింది మాధవరావుకి. "ఇంకా మాట్లాడుకోవటానికి ఏముందిరా? చూస్తూ చూస్తూ ఓ మూర్ఛరోగం అమ్మాయిని చేసుకుంటావా? ఏంటి? " వెళ్లి- భార్యను లేవదీస్తూ అన్నారాయన.

"అవున్రా నందూ! మనకెందుకొచ్చిన గొడవ ఇదంతా? మనం పోదాం పద..." సావిత్రి కూడా భర్త పక్షాన చేరిపోతూ అంది.

ఓ మూర్ఛరోగిని కోడలిగా చేసుకోవాలన్న ఇష్టం ఆమెకు మాత్రం ఎందుకుంటుంది? మరీ ఇంత గొప్ప సంబంధం రాకపోవచ్చు. కానీ, ఆనందరావుకి ఇంక సంబంధాలే రావా ఏమిటి? తమకీ ఆస్తి బాగానే ఉంది కాబట్టి అధమపక్షం ఏడెనిమిది లక్షల కట్నం ఎవరైనా సరే కళ్లు మూసుకుని మరీ ఇస్తారు ఆనందరావుకి. అలాంటప్పుడు ఈ మూర్ఛకేసుని చేసుకోవడం దేనికీ? ఇలా సాగిపోతున్నాయ్ ఆమె ఆలోచనలు-

ఆనందరావు తల్లి మాటల్ని కూడా ఖాతరు చెయ్యలేదు.

"మనం ఇలా మధ్యలో వెళ్లిపోవటానికి వీల్లేదంతే.. బాగుండదు కూడా..." అన్నాడు మరింత దృఢంగా.

"అంటే ఏంటి? ఆ అమ్మాయిని బాగయ్యేవరకూ ఉండి పెళ్లిచూపుల్ని కంటిన్యూ చేద్దామనా? " మాధవరావు అడిగాడు- రుసరుస చూస్తూ.

"అవును అదే మనకి మర్యాద..." ధైర్యంగా చెప్పాడు ఆనందరావు- ఎలాంటి జంకూ లేకుండా!

"ఎలానూ చేసుకునే ఉద్దేశం లేనప్పుడు ఇదంతా దేనికి? " అన్నాడు మాధవరావు.




**కురుల పరదాల**
**మరుగయ్యే తరుణిమోము**
**విరహతిమిరము తరుమగ**
**తరుణమెపుడో?**

—అనుముల బదరీనారాయణ,
జమ్మలమడుగు, కడప

"అవున్రా! దేనికిదంతా? " భర్తకు వంత పాడింది సావిత్రి.

"చేసుకునే ఉద్దేశం లేదని ఎవరన్నాడు? నేనీమెనే చేసుకుంటాను"

ఆనందరావు స్పష్టంగా అలా అనేసరికి అక్కడున్న అందరూ ఆశ్చర్యపోయారు అనంతలక్ష్మితో సహా.

అవును... అనంతలక్ష్మి నిజంగా స్పృహలో లేకపోతేగా? ఒకపక్క మూర్ఛరోగాన్ని నటిస్తూ మరో పక్క ఆమె ఇదంతా వింటూనే ఉన్నదామె!

'చూడబోతే ఇతను చాలా ఉదాత్తమైన మనిషిలా ఉన్నాడే!' అనిపించిందామెకి! అంటే- ఒక్కపెట్టున ఆమెలోని పురుష ద్వేషం తుడిచిపెట్టుకుపోయిందని కాదు. జస్ట్ అలా అనిపించింది. అంతే-

అంతలో మాధవరావు అరిచాడు.

"ఏంటీ ఈ మూర్ఛరోగం అమ్మాయిని చేస్కుంటావా? "

"ఇలా జరగటం ఇదే మొదటిసారి అంటున్నారుగా... అది ఏ వ్యాధో తెలియకముందే మీరెందుకూ అలా నోరు జారటం? "

ఆనందరావు తండ్రిని అలా ఎదిరిస్తుంటే అతనిమీద కొద్దిగా గౌరవంలాంటిదేదో కలి





## స్వయం సాయం

ఆర్కే పేరును నోబెల్ కమిటీ అనే కసార్లు పరిశీలించినా ఆయనకు ఆ బహుమతి దక్కలేదు. దీనిపై ఆయన విరుపు ఇదిగో...

'నే రాసిన 'ఇంగ్లిష్ టీచర్', 'ద పెయింటర్ ఆఫ్ సైన్స్', 'ద బ్యాచిలర్ ఆఫ్ ఆర్ట్స్', 'ద ఫైనాన్షియల్ ఎక్స్‌పర్ట్', 'ద గైడ్' తదితరపేర్లను చూసి బహుశా వాటిని '30 రోజుల్లో టీవీ మెకానిజం' లాంటి సెల్ఫ్ హెల్ప్ పుస్తకాలని వారు భావించారేమో ఎవరు చెప్పగలరు? !'




గింది అనంతలక్ష్మికి.

"ఇంకా తెలియటానికేముందీ? మూర్ఛ రోగం అని అంత స్పష్టంగా కనిపిస్తుంటేనూ? " మాధవరావు అసహనంగా అన్నాడు.

"అలాంటి జబ్బున్నవాళ్లు మనుషులు కారా? పెళ్లికి అర్హులు కారా? ఈ అమ్మాయికి మూర్ఛరోగం అయినా- సరే నేను తననే చేసుకుంటాను..."

ఆనందరావు నిర్ద్వంద్వంగా అలా అంటుంటే 'శభాష్' అనిపించింది అనంతలక్ష్మికి.

ఆమె అమ్మా నాన్నలు 'కాబోయే అల్లుడి'కేసి కృతజ్ఞత నిండిన కళ్లతో చూశారు. ఆనందరావు అంత స్పష్టంగా చెబుతుంటే అతన్ని తమ 'కాబోయే అల్లుడు' అని అనుకోకుండా ఎలా ఉండగలుగుతారు మళ్లీ!

"నోర్ముయ్- అర్థం లేకుండా వాక్కు! మూర్ఛరోగిని చేసుకోవడం ఏమిటి? "

"అవును నందు! ఏవంత ఖర్మపట్టింది. నీకు? "

"అందంగా ఉందని ఆశపడుతున్నావేమో- కావాలంటే... ఇంతకన్నా అందమైన అమ్మాయిని తెచ్చి చేస్తాం...నీకు..."

"అవును నందూ! ఈ పిల్లకన్నా అందమైనవాళ్లు ఎందరో ఉంటారీ లోకంలో..."

తల్లీదండ్రీ చెరో పక్కగా చేరి అలా క్లాసులుపీకుతున్నా మనసు మార్చుకోలేదు ఆనందరావు.

"ఇంతకన్నా అందమైన అమ్మాయిలు ఉండరు. ఒకవేళ ఉన్నా నాకు అక్కర్లేదు. నాకు ఈ అమ్మాయే కావాలి..." అన్నాడు స్థిరంగా.

'తమ కాబోయే అల్లుడు ఎంత మంచి వాడు!' అనుకున్నారు రఘుపతి, కౌసల్యలు.

'అబ్బ' ఈ కుర్రాడు ఎంత ఉత్తముడు!' తన పురుష ద్వేషాన్ని పక్కన పెట్టి ఈ అబ్బాయిని చేసుకోవాలేగాని, అనంతలక్ష్మి-తప్పక సుఖపడుతుంది... అనిపించింది సునందకి!

మరి అనంతలక్ష్మికో?

ఆమెకి ఏమనిపించిందంటే? 'హి ఈజ్ రియల్లీ ఎ నైస్ బోయ్- పురుషులందరూ దుర్మార్గులే కారని ప్రూవ్ చేస్తున్నాడు ఇతను'- అని అనిపించింది.

అంటే- ఆమెలోని పురుషద్వేషం ఒకింత సడలిందన్నమాట!

"ఇదే- నీ చివరి మాటా? "

"ఎస్... ఇదే నా చివరిమాటా! ఆ అమ్మాయి నన్ను చేసుకోవటానికి అంగీకరిస్తే నేను ఆమెనే చేసుకుంటాను"

ఆనందరావు స్వరాన్ని పెంచి అలా అంటుంటే అతనిమీద గౌరవం మరింత పెరిగింది అనంతలక్ష్మికి.

అంటే- అతను స్వరాన్ని పెంచినందుకు కాదు- 'ఆ అమ్మాయి నన్ను చేసుకోవటానికి అంగీకరిస్తే...' అని అతడు అన్నం

దుకు- మూర్ఛరోగికీ ఓ మనసు ఉంటుంది. ఆమెకీ ఇష్టాయిష్టాలు ఉంటాయి అన్న గుర్తింపు ఉన్నవాడు కాబట్టేగా అతనలా అంటా! మూర్ఛరోగి కదా- ఒప్పుకోక ఏంచేస్తుందిలే అన్న చులకన భావం లేకుండా అతనలా అన్నాడు? అంటే... అతనికి స్త్రీ హృదయం పట్ల గౌరవం ఉన్నట్టే కదా!

ఈ విధమైన ఆలోచన... ఆమెలో అతనిపట్ల గౌరవాన్ని వెయ్యి రెట్లు పెంచింది.

అంతలో మాధవరావు అరిచాడు-

"ఏంట్రా- అంతా నీ ఇష్టమే అన్నట్టు మాట్లాడుతున్నావ్? ఇక్కడ మేం పెద్ద వాళ్లం లేమా? మా అభిప్రాయాన్ని గౌరవించాల్సిన పనిలేదా? "

"గౌరవించాల్సినప్పుడు గౌరవించాలి! కానీ ఇది నా పెళ్లికి సంబంధించిన విషయం! అంటే నా వ్యక్తిగత జీవితానికి సంబంధించిన విషయం! సో... ఇక్కడ నా నిర్ణయమే ముఖ్యం..." అన్నాడు ఆనందరావు.

"అబ్బో... చాలా వ్యక్తిత్వం ఉన్న మనిషి" అనిపించింది అనంతలక్ష్మికి- ఒక కన్ను మాత్రం తెరిచి అతనికేసి చూసింది. అంటే ఇంతకుముందు చూడలేదని కాదు... ఇప్పుడు మళ్లీ చూసింది.

ఆశ్చర్యం!

ఇంతకుముందు ఏదో అల్లాటప్పాగాడిలా కనిపించిన ఆనందరావు ఇప్పుడు చాలా అందంగా కనిపించాడు ఆమె ఒంటి కంటికి!

దాంతో రెండో కన్ను కూడా తెరిచి మరింత పరిశీలనగా చూసింది అతనికేసి.

అతనిపుడు మరింత అందంగా కనిపించాడు ఆమె రెండు కళ్లకీ- అంతలోనే ఆమె చప్పున రెండుకళ్లూ మూసేసుకుంది.

అనంతలక్ష్మి అలా కళ్లు తెరిచి, ముయ్యడం- సునంద గమనించింది. దాంతో ఆమెకి అర్థమైపోయింది ఇదంతా నాటకమే అని!

"అంటే ఏంట్రా నువ్వనేది? మేం ఒప్పుకోకపోయినా చేసుకుంటావా ఆ అమ్మాయిని? "

"ఎస్... ఆ అమ్మాయి ఒప్పుకుంటే చాలు... ఇంకెవరు ఒప్పుకోకపోయినా పర్వాలేదు? "

"అంత మొనగాడివైపోయావా? నువ్ ఇలాగే గనక మొండికెత్తితే ఇంక నీకూ మాకూ ఏ సంబంధమూ లేదనుకుంటాము..."

"బెదిరిస్తున్నారా? "

"కాదు... నిజంగానే అంటున్నాను..."

"అయితే... నేనూ నిజంగానే చెబుతున్నాను... వినండి... మీరే కాదు... హరిహర బ్రహ్మాదులు అడ్డొచ్చినా సరే... నేనా అమ్మాయిని చేసుకుని తీర్తాను..."

ఆ తండ్రీ కొడుకులిలా వాదించుకుంటుంటే... అందరూ ఆశ్చర్యంగా చూడసాగారు.

అనంతలక్ష్మి మనసులో అతని మీద సదభిప్రాయం మరింత బలపడిపోయింది. మరింత కాదు పూర్తిగా బలపడిపోయింది.

'ఒక మూర్ఛరోగి కోసం తండ్రినే ఎదిరిస్తున్నాడు అంటే నిజంగా ఇతనెంత ధీశాలి? తాను చేసుకోబోతున్న అమ్మాయికి మూర్ఛరోగం ఉందని తెలిసి కూడా ఇంతగా పట్టుబడుతున్నాడూ అంటే నిజంగా ఇతనిది ఎంత సహృదయం!'

ఇలాంటివాడిని చేసుకుంటే మాత్రం తప్పేంటి? ఇతను అందరిలాంటి ఆర్డినరీ మగాడు కాదని ప్రూవ్ అయిపోయిందిగా!

ఆ ఆలోచన వచ్చిందే తడవుగా- ఇంకేం ఆలోచించకుండా దిగ్గున లేచి కూర్చుంది అనంతలక్ష్మి. అంతే!

అందరూ ఆశ్చర్యంగానూ, ఆనందం







గానూ చూశారు ఆమెకేసి. ముఖ్యంగా ఆమె తల్లిదండ్రులు!

"ఎలా ఉంది తల్లీ నీకిప్పుడు? "

"ఏమైంది తల్లీ నీకసలు..." రఘుపతి, కౌసల్యలు ఆమెకు చెరోవైపూ చేరిపోయి ఆనందబాష్పాలు రాలుస్తూ అడిగారు... కూతురు మూర్ఛరోగం నుండి తేరుకుందన్న ఆనందం.

"ఎందుకమ్మా గాభరాపడతారు? నాకేం కాలేదసలు..."

అనంతలక్ష్మి చిన్నగా నవ్వుతూ అలా అంటుంటే నివ్వెరపోయారు వాళ్లిద్దరూ.

వాళ్లిద్దరనే కాదు ఎక్సెప్ట్ సునంద-మిగతా అందరూ కూడా నిర్ఘాంతపోయారు.

సునందకది ఊహించిన విషయమే కాబట్టి! ఓసి భడవా! అనుకుంది మనసులో.

"ఏంటే నువ్ అనేది? ఫిట్స్ వచ్చి పడిపోయి అసలేమీ కాలేదంటావేంటీ? పైగా ఆ నవ్వేంటే? ఇంకా కాస్త నవ్వుతూనే ఉన్న అనంతలక్ష్మికేసి వెర్రిగా చూస్తూ అంది కౌసల్య.

"అవునమ్మా... ఇదంతా నాటకం..." నవ్వటం మానేసి చెప్పింది అనంతలక్ష్మి.

"ఏంటమ్మా... ఇదంతా? నీకేమన్నా పిచ్చెక్కిందా? " రఘుపతి అయోమయంగా చూస్తూ అడిగాడు.

మిగతా అందర్లో కూడా అలాంటి అనుమానమే మెదిలింది.

ఫ్స్యూ లూజు కాకపోతే మూర్ఛరోగాన్ని నటించడం ఏంటి?

"ఏంటమ్మాయ్ ఇదంతా? ఏం వేళాకోళమా? " సావిత్రి ఉండబట్టలేక నేరుగా ఆ అమ్మాయినే అడిగేసింది.

"కాదత్తయ్యగారూ! ఒకానొక కారణంగా నేనిలా చేశాను... అదంతా చెప్పడానికి నాకిప్పుడు ఓపికలేదు... మా సునందనడగండి... చెబుతుంది..." అంది అనంతలక్ష్మి.

ఆమె తనతల్లిని అలా "అత్తయ్యగారూ" అని సంబోధించటం ఆనందాన్ని కలిగించింది ఆనందరావుకి.

కానీ అసలు సంగతేమిటో తెలుసుకోవాలిగా ముందు. అందుకే ఆ ఆనందాన్ని మనసులోని అణిచేసుకుని సునంద వైపు ఆసక్తిగా చూశాడు.

ప్రస్తుతం ఆ గదిలో ఉన్న అందరి దృష్టీ సునంద మీదే ఉంది.

"ఏంటీ సునందా ఇదంతా! నీమీద చెబుతోందేంటిది? " కౌసల్య అడిగింది- ఆమెని.

అప్పుడు చెప్పుకొచ్చింది సునంద తనకు తెలిసినంత మట్టుకు విషయం అంతా. "ఇందులో నా ప్రమేయం ఏంలేదాంటీ... నిన్న తను చెప్పినదాన్ని బట్టీ, ఇప్పుడు జరిగిన దాన్ని బట్టీ- నాకూ ఇపుడే అర్థమైంది ఇదంతా..." అంటూ ముగించింది.

అందరూ కాసేపు విచిత్రంగా చూస్తుండిపోయారు అనంతలక్ష్మికేసి. అవును మరి. ఏం అనాలో పాలుపోని పరిస్థితి.

నాలుగయిదు క్షణాల తర్వాత ముందుగా కౌసల్య తేరుకుని-

"ఏంపన్లే ఇవి? " అంది కోపంగా!

"మమ్మల్ని తలెత్తుకోనివ్వకుండా చేశావు గదే? " అన్నాడు ఆ వెంటనే రఘుపతి కూడా కోపంగా...

అనంతలక్ష్మికి గిల్టీగా అనిపించింది కాబోలు, ఏం బదులివ్వకుండా తల దించుకుంది చప్పున.

అంతలో మాధవరావు అందుకున్నాడు, "ఇలాంటి తలతిక్క పనులు నేను ఇంతవరకు ఎక్కడా చూడలేదండి..." అని ఇంకా ఏదో అనబోయాడు.

కానీ ఆయనకు మధ్యలోనే అడ్డుతగిలాడు ఆనందరావు.

"దయచేసి కాసేపు ఎవ్వరూ మాట్లా

# కుక్కగోల




అమెరికాలోని చిన్న వివాదాల కోర్టులకి వచ్చే కేసుల్లో 18 శాతం పెంపుడు జంతువులకి సంబంధించినవే. ఇందుకు ఓ ఉదాహరణ గోల్డీ కుక్క వివాదం. పెన్సిల్వేనియా రాష్ట్రంలోని యోర్క్‌స్ప్రింగ్స్ ఊరిలో ఓ కుటుంబం గోల్డెన్ రిట్రైవర్ జాతికి చెందిన గోల్డీ పేరుగల కుక్కని పెంచుకుంటోంది. మే 2006లో ఆ కుక్క మాయ మైంది. ఆ కుటుంబ సభ్యులు ఆరురోజులపాటు కారుమీద, గుర్రాలమీద దానికోసం తీవ్రంగా వెదికారు. పోలీసులకి ఫిర్యాదుచేసి, వివిధ జంతు రక్షణ ఆశ్రమాలకి వెళ్ళి తమ కుక్క అక్కడికి చేరిందేమోనని చూసారు. చివరికి వారికి అది దగ్గర్లో వున్న యార్క్ కౌంటీలోని అనిమల్ షెల్టర్‌లో ఉందని తెలిసి అక్కడికి వెళ్ళారు. దాన్ని రెండురోజుల క్రితమే ఎవరో దత్తత తీసుకుని వెళ్ళారని దాని మేనేజర్ సిండీ స్టోల్ చెప్పింది. స్థానిక నియమం ప్రకారం దాన్ని 48 గంటల్లో చంపడమో లేదా దత్తత ఇవ్వడమో చేయాలి. అలాగే ఎవరికి దత్తత ఇచ్చామన్న వివరాలు కూడా నియమం ప్రకారం సిండీ వీరికి చెప్పలేదు.

ఆ కుటుంబంలోని స్టీఫెన్ (9), హీథర్ (10), సమంత (4)లకి ఆ కుక్కంటే ప్రాణం. దాంతో ఆకుటుంబం ఆ జంతు సంరక్షణ గృహంపై కుక్క వివరాలు చెప్పాలని కేసు వేసింది. 1500 డాలర్లు ఖర్చుచేసి కోర్టులో పోరాడితే, మెలిస్సా వెండ్లర్ అనే ఆమె దాన్ని దత్తత తీసుకుందని తెలిసింది.

గోల్డీకి లైసెన్స్ టేగ్ కట్టనందుకే ఈ సమస్య వచ్చిందని కోర్టు దృష్టికి వచ్చింది. అందుకు ఆ కుటుంబ పెద్దకి కోర్టు ఫైన్ వేసి, చివరికి గోల్డీని ఆ కుటుంబానికే ఇవ్వాలని, అప్పటిదాకా దాన్ని పోషించిన లెండ్లర్‌కి అందుకయిన ఖర్చు ఇవ్వాలని తీర్పు చెప్పింది. దాంతో పిల్లలు కోర్టు హాల్లోనే ఆనందంగా ఎగిరి గంతులు వేసారు.





డొద్దు..." అతని ఆజ్ఞకు కట్టుబడిపోయి కాదుగానీ, ఈ వెధవ ఏం వాగబోతు న్నాడో చూద్దామన్నట్టు మిన్నకుండి పోయాడు మాధవరావు.

"అయితే మీకు మగవాళ్లంటే ద్వేషమా అండీ? మీరసలు పెళ్లి చేసుకోరా.. ఆ ఉద్దేశమే లేదా? " అందరూ సైలెంట్‌గా ఉండటంతో అనంతలక్ష్మివైపు తిరిగి అడి గాడు ఆనందరావు.

"అవునండీ... అందుకేగా ఇదింత నాటకం ఆడ్డ..." స్నేహితురాలి తరుపున సునంద చెప్పింది జవాబు.

"నేనడిగింది వారిని! ఆమెనే చెప్పని వ్వండి"

దాంతో అనంతలక్ష్మికి నోరు విప్పక తప్పలేదు.

"అవునండీ..." అంది గొణిగినట్లుగా.

"మరలాంటప్పుడు ఆ విషయం ధైర్యంగా మీ అమ్మా నాన్నలతో చెప్పలేక పోయారా? "

"చెప్పి వాళ్లను బాధ పెట్టడం దేనికి లెమ్మని..." వాక్యాన్ని పూర్తి చెయ్యలేకపో యింది అనంతలక్ష్మి బిడియం అడ్డు రావటం వల్ల.

"అందుకని ఇంత విచిత్రమైన నాటకం ఆడారన్నమాట! బాగుందండీ! మీరు భలే వారు. మొత్తానికి మీరు ఆడిన నాటకం సంగతి ఎలా ఉన్నా, మీరు మాత్రం నిజంగా నాకు చాలా నచ్చారండీ! కానీ, ఏం లాభం? మీకేదో పురుషద్వేషం ఉందంటున్నారుగా..." అన్నాడు ఆనంద రావు గాఢంగా ఓ నిట్టూర్పు విడుస్తూ.

"అవునండీ... ఉండేది ఒకప్పుడు" అంది అనంతలక్ష్మి బిడియంగా తల దించు కుంటూ.

"ఒకప్పుడా? అంటే ఇప్పుడు లేదని అర్థమా? " ఆశ్చర్యంగా చూశాడు ఆనంద రావు. అతని కళ్లల్లో ఆశ- ఆశగా తొణికి సలాడింది.

"అవునండీ! కొద్ది గంటల క్రితందాకా ఉండేది. కానీ మిమ్మల్ని, మీ సహృదయ తనీ చూశాక... నేనిపుడు మారిపో యాను..." అంది అనంతలక్ష్మి.

"అంటే...? " ఆనందరావు కళ్లల్లోని ఆశ రెట్టింపయ్యింది.

"మీరంటే ఇపుడు నాకూ ఇష్టమేనండీ! మీరు అంగీకరిస్తే నేను మిమ్మల్ని పెళ్లి చేసుకోవడానికి సిద్ధంగా ఉన్నాను"

అతి కష్టం మీద బిడియాన్ని విడిచి తన సమ్మతిని అప్పటికప్పుడే చెప్పేసింది అనంతలక్ష్మి.

దాదాపు అందరూ నివ్వెరపోయారు- ఆమె అలా ప్రకటించగానే.

సునంద అయితే మరీ ఆశ్చర్యపోయింది పోదా... మరీ!

"ఏంటే నువ్వంటున్నది నిజమేనా? " అని అడిగేసింది ఆ ఆశ్చర్యాన్ని.

"అక్షరాలా నిజం" నొక్కి పలికింది అనంతలక్ష్మి.

సావిత్రి, మాధవరావులు ఆ ఆశ్చర్యం నుండి ఇంకా తేరుకోలేకపోతున్నారు.

ఆనందరావు పరిస్థితి ఇంచుమించు అలాగే ఉంది.

"ఏం బావగారూ! అమ్మాయి, అబ్బాయి తమ తమ అభిప్రాయాలు చెప్పేశారుగా మీరేమంటారు? "

రఘుపతి మాధవరావుకి దగ్గరగా వెళ్లి నిలబడుతూ అడిగాడు- సంతోషంగా!

అమ్మాయికి మూర్ఛరోగం లేదని తేలి పోయాక ఇంక కాదనేదేముంది?

"ఇద్దరూ ఇష్టపడుతున్నాక... ఇంక మనం కాదనేదేముందిలెండి..." అనేశాడు మాధవరావు లౌక్యంగా.

అంతలో సుందర్రావు రొప్పుకుంటూ వచ్చాడు అక్కడికి.

మామూలుగా కూర్చుని ఉన్న

అనంతలక్ష్మిని చూసి ఆశ్చర్యపోయాడా యన.

"డాక్టర్‌ని తీసుకొస్తానని వెళ్ళి ఒంటరిగా వచ్చావేం?" ఆనందరావు అడిగాడు ఆయన్ని.

"పేషెంట్‌నే అక్కడికి తీసుకురమ్మన్నా డాయన- అది సరే అనంతలక్ష్మి..." ఆయాసం అడ్డురాగా మాట పూర్తి చెయ్యలేకపోయాడు సుందర్రావు.

"అనంతలక్ష్మికిపుడు బాగానే ఉంది అంకుల్... ఇందాకటిదంతా ఒక నాటకం..." అంది సునంద.

"నాటకమా?!" సుందర్రావు నోరు వెళ్ళ బెట్టాడు.

"అవునంకుల్... అసలేం జరిగిం దంటే..." అని ప్రారంభించి విషయం యావత్తు చెప్పుకొచ్చింది సునంద.

ఆమె అలా చెప్పుకొస్తుండగా ఆనంద రావు తనకు తెలియకుండానే ఒకానొక భ్రమానందంలోకి మెల్లమెల్లగా వెళ్ళిపో యాడు.

అనంతలక్ష్మికి తనకీ అప్పుడే పెళ్ళయిపో యినట్టు ఊహించేసుకుని... శోభనం కూడా అయిపోయినట్టు ఊహించుకుని... అంటే ఆ రెండింటినీ డీటెయిల్డ్‌గా ఊహిం చుకున్నాడని కాదు.

ఆ తర్వాతి దృశ్యాన్ని మాత్రం డీటెయి ల్డ్‌గా ఊహించుకోసాడు ఆనందరావు.

★ ★ ★

"నిజంగా- నేనెంత అదృష్టవంతు రాల్ని..."

"ఆహా... ఏం లేదు డియర్...నేనే..."

ఆమె ముసిముసిగా నవ్వింది. కొంటెగా చూసింది.

"నేనే అదృష్టవంతుడ్ని... ఎంత అదృష్ట వంతుడ్ని కాకపోతే నాకు నీలాంటి అంద గత్తె దొరుకుతుంది చెప్పు..."

"అందందేముందండీ! అందం కన్నా అంతరంగం ముఖ్యం! మీలాంటి సహృద

## కొత్తగాలి...

**నీ తరపున**
**ఓ విత్తు పాతు**
**ఈ లోకాన్ని**
**పచ్చగా ఉంచేందుకు చాలు**

-కంచనపల్లి వేంకట కృష్ణారావు,
బి-క్యాంప్, కర్నూలు

యుడ్ని భర్తగా పొందగలిగిన నేనే నిజంగా మీ కన్నా అదృష్టవంతురాల్ని..."

"నాది అంత సహృదయమా?"

"కాదా మరి?"

"ఎందుకని నన్ను సహృదయుడిగా భావిస్తున్నావ్?"

"భావించటం ఏంటండీ? ఇట్స్ ఎ ఫాక్ట్! నేను మూర్ఛరోగినని తెలిసి కూడా మీరు నన్ను చేసుకోవటం... సహృదయత కాదా?"

"కానీ- నీ మూర్ఛరోగం ఉత్త నాటక మేగా?"

"కావచ్చు.. కానీ అది నాటకం అని తెలియకముందే మీరు నన్ను చేసుకోవడా నికి ఒప్పుకున్నారుగా! దట్టూ మీ అమ్మానా న్నల్ని ఎదిరించి మరీ! ఈ రోజుల్లో ఎంత మందికి ఉంటుంది అలాంటి సహృద యత?"

"అబ్బ! చాల్లే అనంతా! నువ్ మరీ ఇలా పొగిడేస్తుంటే.. నాకు సిగ్గుగా ఉంది..."

"ఇంత సేపూ అన్ని పాడుపనులు చేసారు. మరి అప్పుడు లేదా ఈ సిగ్గు?"

"అది వేరు..."

"మరిదేంటి? బెట్టా?"

అనంతలక్ష్మి నోటి వెంబడి అంత గొప్ప జోక్ వినగానే నవ్వాపుకోలేకపోయాడు ఆనందరావు.

కొత్త పెళ్ళాం పాత జోకులేసినా కొత్త







గానే ఉంటుందిగా!

అందుకని ఘొల్లున నవ్వేశాడు.

★ ★ ★

"ఏంటి బాబూ- ఉన్నట్టుండి అలా నవ్వుతున్నావ్?" రఘుపతి కంగారుగా అడిగాడు.

"మావాడు ఏదో భ్రమానందంలో వెళ్లిపోయి ఉంటాడులెండి..." అన్నాడు మాధవరావు గబుక్కున.

వీళ్లకది అలవాటే కావచ్చు. కానీ మిగతావాళ్లకేం తెలుస్తుంది.

"భ్రమానందం అంటే?" రఘుపతి డైరెక్ట్‌గా అడిగేశాడు.

"మా వాడు ఉన్నట్టుండి ఏవేవో ఆలోచనల్లోకి వెళ్లిపోతుంటాడులెండి... అది వాడికి చిన్నప్పటినుంచీ అలవాటు... దాన్నే మేం భ్రమానందం అంటుంటాం...." కాస్త వివరంగా చెప్పాడు మాధవరావు.

"అదేంటీ? ఏదైనా మానసిక సంబంధమైన వ్యాధా అది?" ఊహించని ప్రశ్న వేశాడు రఘుపతి.

"అబ్బే...లేదండి... ఊర్కే అలా ఏవేవో ఆలోచనల్లోకి వెళ్లిపోతాడు... కాసేపటికి మళ్లీ మామూలుగా అయిపోతుంటాడు. అంతేగానీ... అది జబ్బేం కాదు..." మనసులో కాస్త నొచ్చుకుంటూనే వివరణ ఇచ్చాడు మాధవరావు.

"మీ అబ్బాయికి మెంటలా?" అని రఘుపతి డైరెక్ట్‌గా అడిగి ఉండకపోవచ్చు. కానీ ఆయన ప్రశ్న దాదాపు అలాగే ఉందిగా! అందుకే మాధవరావు మనసుకి కష్టంగా తోచింది.

రఘుపతి ఆనందరావుకేసి పరీక్షగా చూశాడు.

...మిగతా అందరి దృష్టి కూడా అతని మీదనే ఉంది.

ఆనందరావు ఇంకా అదే స్థితిలో ఉన్నాడు. అంటే ఇంకా ఊహానందంలోనే ఉండి ఎందుకో నవ్వుతూనేవున్నాడన్న మాట.

ఎందుకో కాదు- ఊహల్లో అతనికి అనంతలక్ష్మి ఒకటే పనిగా కితకితలు పెట్టేస్తూ ఉంది.

కొత్తపెళ్లాం అలా కితకితలు పెడుతుంటే- నవ్వకుండా ఎవరు మాత్రం ఉండగలుగుతారు?

అసలు విషయం అది.

కానీ చూసేవాళ్లకి ఆ సంగతేం తెలుస్తుంది.

అతను ఉత్తుత్తినే నవ్వుతుంటే అది పిచ్చి నవ్వులా అనిపించింది అనంతలక్ష్మి తరపు వాళ్లందరికీ!

ముఖ్యంగా రఘుపతికి.

"ఇతనికేదో మనోవైకల్యం ఉంది... అందుకేనా మూర్ఛరోగం ఉన్నా కూడా... తన కూతుర్ని చేసుకుంటానన్నది!" అనే ఓ అనుమానం మెదిలింది ఆయన మనసులో.

"మీ అబ్బాయి భ్రమానందం గురించి మరికాస్త వివరంగా చెబుతారా?" అనడిగాడు సందేహంగా మాధవరావు వంక చూస్తూ రఘుపతి.

"ఏముందండీ... పెద్దగా చెప్పడానికి? సడన్‌గా ఏవో ఊహల్లోకి జారుకుంటుంటాడంతే" అన్నాడు మాధవరావు.

"ఊహలంటే... ఎలాంటి ఊహలు?"

"రకరకాల ఊహలండీ?" అప్పటికీ వదల్లేదు రఘుపతి- అంటూనే- ఒక కన్నుతో ఆనందరావు వంక చూశాడు. అతనింకా నవ్వుతూనే ఉన్నాడు.

"చంద్రమండలం మీద విహరిస్తున్నట్టూ, గ్రహాంతరవాసులు తనతో ఏదేదో మాట్లాడుతున్నట్టూ... తానొక పోలీసాఫీసర్ అయిపోయినట్టు... ఇలా ఒకటని కాదండీ... చిత్రవిచిత్రమైన ఊహలు

వస్తుంటాయ్ మావాడికి..." ఎదుటి వ్యక్తి మనసులో ఒక పాడు సందేహం తలెత్తిం దని సావిత్రికేం తెలుసు? ఉన్నదున్నట్టు చెప్పేసిందామె.

ఆమె అలా చెప్పేసరికి...

రఘుపతిలోని దుష్ట అనుమానం మరిం తగా బలపడిపోయింది.

"మరీ దీనిపై మీ అబ్బాయిని ఎప్పుడైనా డాక్టర్‌కి చూపించారా? " అనడిగాడాయన- మాధవరావు వైపు పూర్తిగా తిరిగి- అదోలా ముఖం పెట్టి.

"ఇందులో ఏముందని డాక్టర్‌కి చూపిం చడానికి? " మాధవరావు కాస్త కటువుగానే అన్నాడు.

"ఏం లేకపోవడం ఏంటి? అలాంటి భ్రమలు కలగడం ఒకరకంగా పిచ్చి కిందకే వస్తాయ్! అలాగని ఒకసారెప్పుడో "ఎల్లుండి" అనే సైకాలజీ మాసపత్రికలో చదివాను..." ఎప్పుడో చదివినదాన్ని జ్ఞప్తికి తెచ్చుకుంటూ తన మనసులోని దుష్ట సందేహాన్ని నిర్మొహమాటంగా బయట పెట్టేశాడు రఘుపతి.

మనసులో ఒక అనుమానం అనేది చొరబడాలేగానీ అది పెనుభూతం అయి పోవడం ఎంతసేపు? అందుకే వెంటనే మళ్లీ తనే అందుకుని...

"సో... మీ అబ్బాయిని డాక్టర్‌కి చూపించి... పిచ్చీ గిచ్చీ గట్రా ఏంలేదని సర్టిఫై చేశాకనే పెళ్లి గురించి ఆలోచిద్దాం...." అనేశాడాయన పుసుక్కున.

కొడుకుని అంత డైరెక్ట్‌గా పిచ్చివాడం టుంటే పిచ్చికోపం వచ్చేసింది మాధవరా వుకి.

"చాల్చాల్లే ఆపవయ్యా- మర్యాదగా మాట్లాడండి... వాడికదో అలవాటు. అంతే తప్ప పిచ్చేం కాదు..." అన్నాడు మండిపడుతూ మాధవరావు.

"అని మీరంటే సరిపోతుందా? ఒకసారి అనుమానం అంటూ వచ్చాక దాన్ని క్లారిఫై చేసుకోవటమే మంచిది..." తన దుష్ట సందేహం మీద అలాగే ఇంకా నిల బడిపోతూ అన్నాడు రఘుపతి.

అప్పటికే ఈ లోకంలోకి వచ్చివున్న ఆనందరావు- అంతలో "సరే మామయ్యా గారూ! అలాగే చేద్దాం- దాన్దేముందీ? " అన్నాడు కలగజేసుకుంటూ!

తను గనక ఈ పిచ్చి టెస్ట్‌కి ఒప్పుకోక పోతే- ఎక్కడ అనంతలక్ష్మి లాంటి అంద గత్తె చేజారిపోతుందో అన్న భయం, అ తనిది! మగపుటక పుట్టినవాడెవడైనా చూస్తూ చూస్తూ అనంతలక్ష్మిని వదులుకో గలుగుతాడా? ఆమె అందం అలాంటి దాయె!

అసలే కోపంతో ఉన్న మాధవరావుకి కొడుకు మాటలు చిర్రెత్తించాయి. "ఎవర్రా నీకు మావయ్యగారు? ఆయన నీకు పిచ్చే మోనని అంత ఇదిగా అవమానిస్తుంటే సిగ్గు లేకుండా ఆ టెస్ట్‌కి సిద్ధపడతావా? నేను దీనికి చచ్చినా ఒప్పుకోను..." అన్నాడు ఆవేశంగా.

"ఇందులో సిగ్గుపడాల్సింది ఏముంది నాన్నా? ఆయనకేదో అనుమానం వచ్చింది... అలా అన్నాడు... నిజంగా నాకేదన్నా పిచ్చుంటేగదా, భయపడ్డానికి! వెంటనే ఎవరన్నా సైకియాట్రిస్ట్ దగ్గరికెళ్లి ఆయన సందేహాన్ని తీర్చేద్దాం పదండి..." తండ్రిని శాంతింపజెయ్యచూస్తూ అన్నాడు ఆనందరావు నింపాదిగా!

భ్రమానందంలో కనిపించిన అప్సరస కన్నా అందంగా వున్న అనంతలక్ష్మిని అత నంత తేలిగ్గా ఎలా వదులుకోగలుగు తాడు? అతనికేమన్నా పిచ్చా?

కొడుకు వెంపర్లాట సావిత్రిక్కూడా ఏమాత్రం నచ్చలేదు.

"ఏం అక్కర్లేదు... నేను దీనికి చచ్చినా ఒప్పుకోను..." అంది ముక్కుపుటాలెగ



రేస్తూ కోపంగా!

'కాసేపట్లో ఎంత మార్పు? కథ సుఖాంతం అయిపోయింది లెమ్మనుకుంటే ఇలా రివర్స్ కొట్టిందేమిటి?' అనుకుని... "నువ్వయినా కాస్త శాంతంగా ఆలోచించమ్మా ఇందులో పెద్ద తప్పేముంది?" అన్నాడు ఆనందరావు.

"తప్పా? తప్పున్నరా?" కొడుకు మాటల్ని ఖండిస్తూ అంది సావిత్రి. "నీకు వాళ్లు లేనిపోని పిచ్చి అంటగడుతుంటే- ఠక్కున లేచిపోవాల్సింది పోయి- పైగా వాళ్ల పక్షానే మాట్లాడుతున్నావా? నీక్కాదు పిచ్చి.. మూర్ఛ నాటకం ఆడిన ఆ అమ్మాయికే పిచ్చి, ఆ అమ్మాయిని కన్న వాళ్ల అమ్మా నాన్నలకే పిచ్చి..." అంది రోషంగా.

"అది కాదమ్మా..." అంటూ ఏదో చెప్పబోయాడు ఆనందరావు.

"నా మాట వినరా నందూ, ఈ పాడు సంబంధం మనకొద్దు... పోదాం పద..." అంది కొడుకుని సమీపిస్తూ.

"ఎందుకమ్మా అలా ఆవేశపడిపోతావ్? నేను మాట్లాడతాగా! మీరందరూ కాసేపు ప్రశాంతంగా ఉండండి..." ఏదో మధ్యవర్తి గనక తన పెద్దరికాన్ని గుర్తు చేసుకుంటూ అన్నాడు సుందర్రావు.

"ఇంకా ఏముందని మాట్లాడటానికి? మొత్తానికి భలే సంబంధం చూపెట్టావులే..." స్వీయమౌనాన్ని భంగం చేసుకుంటూ సుందర్రావుమీద తన కోపాన్ని- చేతులు తిప్పుతూ ప్రదర్శించాడు మాధవరావు.

"మన అబ్బాయికి పిచ్చిలేదని వాళ్లకి నచ్చజెబుతాగా..."

"నచ్చజెప్పడం ఏంటీ? అసలు మన అబ్బాయికేదన్నా పిచ్చి ఉంటేగా?"

"లేదని మనకు తెలుసు. కానీ, ఉందని ఆయన అనుమానిస్తున్నప్పుడు దాన్ని తొలగించటం మన బాధ్యత కదా!"

"అంటే ఏంటి నువ్ అనేది? ఆయనగారేదో అంటున్నారు కదాని మన అబ్బాయికి పిచ్చి టెస్ట్ చేయించి ఆయనగారికి సర్టిఫికేట్ తెచ్చి చూపించాలా?"

"అవసరం లేదు..."

సుందర్రావుకాదు ఈ మాటన్నది- అనంతలక్ష్మి!

అనటం కాదు- అరిచింది.

దాంతో అందరి దృష్టి ఒక్కసారిగా ఆమె మీదకు మళ్లింది.

"ఏంటమ్ములూ నువ్ అనేది?" రఘుపతి అడిగాడు కూతుర్ని ఉద్దేశించి.

"అవును నాన్నా! నేను మూర్ఛరోగం నటించినా సరే నన్ను పెళ్లి చేసుకోవటానికి సిద్ధపడిన గొప్ప వ్యక్తి ఆయన! అలాంటి వ్యక్తికి ఎంతో కొంత మనోవైకల్యం ఉంటే మాత్రం ఏమిటి? ఆయన ఏ టెస్టూ చెయ్యించుకోనక్కరలేదు... ఆయనకి పిచ్చున్నా సరే... నేనాయన్ని చేసుకుంటాను..." అంది స్థిరంగా అనంతలక్ష్మి.

ఆమె మాటలకు బహుగా సంతోషిస్తూనే "ఎబ్బే... నాకసలు కొంచెం కూడా పిచ్చి లేదండీ..." అన్నాడు ఆనందరావు.

"ఒకవేళ ఉన్నా కూడా చేసుకుంటానంటున్నాగా" అంది అనంతలక్ష్మి మళ్లీ స్థిరంగా.

"అసలు కొంచెం కూడా లేదంటున్నాగా..."

"లేకపోతే మంచిదే! ఒకవేళ ఉన్నా కూడా పర్లేదు. నేను మిమ్మల్నే చేసుకుంటా..." తన నిర్ణయం ఎంత స్ట్రాంగో తెలియజెయ్యడానికన్నట్టుగా అలా అంది అనంతలక్ష్మి.

"అమ్ములూ..." అన్నాడు రఘుపతి గాభరాగా.

"అవున్నాన్నా! ఇది నా తిరుగులేని

నిర్ణయం. ఒకవేళ మీరు కాదంటే- నేను జీవితాంతం కన్యగానే ఉండిపోతాను తప్ప ఇంకెవర్నీ చేసుకోను"

అనంతలక్ష్మి అంత స్ట్రాంగ్‌గా అలా అంటుంటే ఆనందరావు ఆనందంతో స్పృహ తప్పి పడిపోయాడు. కానీ, దాన్ని మూర్ఛరోగం అని ఎవ్వరూ అనుకోలా! ఆనందంతో స్పృహతప్పి పడిపోవటం అనే అందరూ గుర్తించారు.

అమ్మాయీ, అబ్బాయీ ఒకర్నొకరు అంతగా ఇష్టపడుతున్నప్పుడు ఇంక అడ్డు చెప్పటం దేనికి లెమ్మని ఉభయులూ అను కొని... ఆనందరావు తిరిగి స్పృహలోకి వచ్చేలోగా వేరే మాటలు మాట్లాడుకో వటం ప్రారంభించారు.

అంటే... ముహూర్తాలు ఎప్పుడు పెట్టు కుందాం? ఇచ్చిపుచ్చుకోవడాల మాట ఏమిటి? వగైరా వగైరా అన్న మాట!

★ ★ ★

అలా పెళ్లిచూపుల్లో ఒకింత రభస జరి గినప్పటికీ మొత్తానికి ఆ సంబంధాన్ని ఖాయం చేసేసుకుని ఇంటికి తిరిగొచ్చారు ఆనందరావు కుటుంబసభ్యులు.

మార్చిలో ఎగ్జామ్స్ కాబట్టి ఏప్రిల్ లేదా మేలో పెళ్ళి అనుకున్నారు. ముహూర్తం ఇంకా నిర్ణయించాల్సి ఉంది.

"ఆ విషయం నాకొదిలేయండి... నేను చూసుకుంటా" అంటూ ఆ బాధ్యతను తన నెత్తిమీద వేసుకున్నాడు సుందర్రావు.

ఇంత జరిగాక ఆనందరావుకి నిత్య సుందర స్వప్నాలు రాకుండా ఎలా ఉంటాయ్? పెళ్లిచూపులు ముగిసినప్పటి నుండి ఇంక అదే పని అయిపోయింది అతగాడికి.

ఏమాత్రం ఖాళీ దొరికినా యూజువల్ భ్రమానందాలతో పాటు ఈ సుందర స్వప్నాలు కూడా ఎక్కువైపోయాయ్ అత గాడికి.

తన కాబోయే భార్య ఫలానా ఆమె అని తెలిసిపోయాక ఒక మగాడు ఎన్ని రకాల కలలైతే కనగలుగుతాడో అన్ని రకాల కలల్నీ కంటూ రోజుల్ని అనాయాసంగా నెట్టుకుంటూ వచ్చేశాడు ఆనందరావు.

సహజంగానే కాలం ఇట్టే గడిచిపోయి అనంతలక్ష్మి, ఆనందరావుల పెళ్లికి ముహూర్తం దగ్గరయిపోయింది.

ఒక శుభముహూర్తాన ఆనందరావు అనంతలక్ష్మి మెడలో మూడుముళ్లు వేసే శాడు. నెక్స్‌ట్ శోభనమే కదా! అదీ ఆ రాత్రికే జరగాల్సి ఉండగా... ఊహించని కొన్ని కారణాలవల్ల అది ఓ వారం రోజులు వాయిదా పడింది.

అలా జరిగినందుకు ఆనందరావుకి మొదట చాలా బాధకలిగింది గానీ... తర్వాత సరిపెట్టుకున్నాడు.

పీరియడ్స్ అనేవి అనుకోకుండా ముందు వెనుకలుగా రావటం సహజమే గదా! దానికి పాపం అనంతలక్ష్మి ఏం చేస్తుంది? వాళ్లు మాత్రం ఏం చేస్తారులే- అనుకుని ఊరుకున్నాడు ఆనందరావు.

అయినా వర్రీ కావాల్సిందేముందీ? భ్రమానందాలు ఎలానూ ఉన్నాయిగా! ఈ వారంరోజులూ వాటితో గెటాన్ అయిపో దాంలే అనుకుని అలాగే చెయ్యసాగాడు.

అలా ఓ ఆరురోజులు దొర్లిపోయాక...

"మనం పోలీస్‌స్టేషన్‌కి వెళ్లి చాలా రోజులైందిగా! ఇపుడు వెళ్లినా ఆ ఎస్సయ్ ఏం అనడులే... ఖాళీగానే ఉన్నావుగా. ఓసారి అలా వెళ్లి రారాదూ?" అన్నాడు మాధవరావు. ఏదో భ్రమానందంలోకి జారుకోబోతున్న ఆనందరావుతో.

మర్నాడు శోభనం పెట్టుకుని ఇపుడా పోలీస్‌స్టేషన్‌కి వెళ్లిరావటం అంటే వల్లమా లిన చిరాకేసిపోయింది ఆనందరావుకి...

"ఆ దిక్కుమాలిన పర్స్ సంగతి నువ్ ఇంకా మర్చిపోలేదా నాన్నా?" అన్నాడు







కోపంగా.

"అదేం దిక్కుమాలిన పర్సుకాదు... అందులో అయిదు వందలున్నాయ్..." అన్నాడు మాధవరావ్ అంతకన్నా కోపంగా.

"అయితే ఏంటి? నేనిపుడు మళ్లీ ఆ ఎస్సయ్‌తో చీవాట్లు తిని రావాలా? "

"ఊరుకూరికే వెళ్లినప్పుడయితే తిట్టాడు. ఇపుడు చాలాకాలం తర్వాత వెళుతున్నావ్ కాబట్టి తిట్టడులే..."

"అలాగని నువ్ రాసివ్వగలవా? "

'పెళ్లయ్యాక వీడికి బాగా పొగరెక్కువయ్యింది' అనుకున్నాడు మాధవరావు కొడుకు అలా పెడసరంగా అనేసరికి.

"ఇంతకీ నువ్ అనేదేంటి? వెళ్లనంటావా? "

"నువ్ అరిచి గీపెట్టినా వెళ్లనుగాక వెళ్లను..." ఖండితంగా చెప్పాడు ఆనందరావు.

దాంతో మాధవరావుకి మండుకొచ్చి "సర్లే, నేనే వెళ్తాలే" అనేసి విసవిసా వెళ్లిపోయాడు బయటికి, అంటే పోలీస్‌స్టేషన్‌కి అన్నమాట.




**బూ**తుల్లో కొన్ని మాత్రమే ప్రచురణార్హంగా ఉంటాయ్.

పెక్కు శాతం ప్రచురణార్హంగా ఉండవు. అందుకే మాధవరావు పోలీస్‌స్టేషన్‌కెళ్లాక అక్కడేం జరిగిందన్నది వివరంగా చెప్పడం చాలా కష్టం.

అలా వివరంగా చెప్పాలీ అంటే... హిప్పోపొటమస్ ముఖం ఎస్సయ్ మాధవరావుని బండబూతులు తిట్టిన వైనాన్ని- వివరంగా రాయాల్సి ఉంటుంది కదా!

సో... క్లుప్తంగానే చెప్పుకుంటే...

బుర్ర తిరిగిపోయింది మాధవరావుకి- "ఇన్నాళ్లయినా నువ్ ఇంకా ఆ పర్సు సంగతి మర్చిపోలేదా? " అని ప్రారంభించి ఆ ఎస్సయ్ తిట్టిన బండబూతులకి.

అసలే బూతులు... అందునా పోలీసాఫీసర్ నోటి నుండి వచ్చినవి. అవి గుండెను కొయ్యకుండా ఎలా ఉంటాయ్?

అవమానభారంతో- కుతకుతలాడిపోతూ... ఏడుపు ఒక్కటే తక్కువ అన్న స్థితిలో... పోలీస్‌స్టేషన్ నుండి బయటపడ్డాడు మాధవరావు.

బయటికొచ్చాక కూడా ఇంకా ఎస్సయ్ గొంతు తన చెవుల్లో మారుమోగుతున్నట్టే అనిపించి... మనసంతా కకావికలైపోగా- పరధ్యానంగా నడుస్తూ- రోడ్డుమీద ఓ శాల్తీని గుద్దేశాడు మాధవరావు.

ఉత్తపుణ్యానికి అలా గుద్దేస్తే ఎవరూరుకుంటారు?

"ఏం బాబూ! కళ్లు కనిపించట్లేదా? " అని కోప్పడ్డాడా వ్యక్తి.

తప్పు తనదే గనక "స... స... సారీ... అండీ..." అంటూ తల పైకెత్తి అతని ముఖంలోకి చూశాడు మాధవరావు.

అంతే!

ఆ శాల్తీ "ఒర్రేయ్..." అంటూ మాధవరావుని గట్టిగా వాటేసుకున్నాడు. "నువ్వట్రా మాధవా! అబ్బ! ఎన్నాళ్లకి కలిశాం" అన్నాడు ఆనందంగా.

"నువ్వా మూర్తీ! బాగున్నావా? " అన్నాడు మాధవరావు కూడా ఆనందంగా.

పదేళ్ల తర్వాత కలుసుకున్న స్నేహితులు వాళ్లిద్దరూ- అందుకే అంత

ఆనందం!

రోడ్డుమీద పలకరింపులూ అవీ అయ్యాక "మా అబ్బాయి ఇక్కడే ప్రాక్టీస్ చేస్తున్నాడు. హెల్త్ బాగోని కారణంగా నేను వాలంటరీ రిటైర్‌మెంట్ తీసుకుని ఈమధ్యనే వాడి దగ్గరికొచ్చేసి ఉంటున్నాను... పద... మా ఇల్లు చూద్దువు గాని..." అంటూ మాధవరావుని తమ ఇంటికి తోడ్కొని వెళ్లాడు- సింపుల్‌గా మూర్తి అని పిలవబడే ఆ వీరవెంకట వరాహ సత్యనారాయణమూర్తి.

అంటే- అతను పిలవగానే మాధవరావు వెంటబడి వెళ్లిపోయాడని కాదు - "అడ్రస్ చెప్పరా- తర్వాత ఎప్పుడైనా వస్తాను..." అన్నాడు ముందు

"ఏం ఇప్పుడేం? " అన్నాడు మూర్తి.

"మనసు బాగుండలేదురా!" అంటూ పోలీస్‌స్టేషన్‌లో తనకెదురైన చేదు అనుభవం గురించి చెప్పుకొచ్చాడు మాధవరావు వివరంగా -

అది విని - "అయితే - నువ్విప్పుడే మా ఇంటికి రావటం మరీ మంచిది..." అన్నాడు మూర్తి.

"అదేం? "

అప్పుడు చెప్పాడు మూర్తి- తన కొడుకు ఒక సైకియాట్రిస్ట్ కమ్ హిప్నాటిస్ట్ అనీ, మనసులో ఎలాంటి చికాకు ఉన్నా ఇట్టే తొలగించేస్తాడనీ...

ఇప్పుడు తనున్న పరిస్థితిలో అలాంటిదేదో అవసరమే అనిపించి... "సరే పదయితే..." అంటూ ఆ పాత మిత్రుడ్ని అనుసరించాడు మాధవరావు.

★ ★ ★

ఓ ముప్పావుగంట తర్వాత-

మూర్తివాళ్ల ఇంట్లో మాధవరావు నలిగిన హృదయానికి- అనగా బండబూతుల వల్ల నలిగిన హృదయానికి- హిప్నాటిక్ చికిత్స ప్రారంభమైంది.

మూర్తి కొడుకు డాక్టర్ పవన్

## కొత్తగాలి...

**హోంవర్క్ ఊబిలో పసిపిల్లలు**
**పసిడిబాల్యం కోసం**
**ఇంటిముందు ఇసుకకుప్ప**
**ఎదురుతెన్నులు**

-ఉమాబాల చుండూరు,
దోమలగూడ, హైదరాబాద్

ముందుగా మాధవరావుని డీప్ హిప్నాసిస్ లోకి తీసుకెళ్లి... "మీ మనసిపుడు ప్రశాంతంగా ఉంది... చాలా ప్రశాంతంగా ఉంది. ఇందాక ఆ నీటిగుర్రంగాడు తిట్టిన బండ బూతులేవీ ఇపుడు మీకు గుర్తుకు రావట్లేదు... అస్సలు గుర్తుకు రావట్లేదు... అసలే మాత్రం గుర్తుకు రావట్లేదు... మీ మనసు ప్రశాంతంగా ఉంది..." అని అనేకసార్లు సజెషన్స్ ఇచ్చి ఆ మీదట అతన్ని మళ్లీ మామూలు స్థితికి తీసుకొచ్చాడు.

"ఇప్పుడెలా ఉంది? " మాధవరావు హిప్నాసిస్‌లోంచి బయటికొచ్చాక అడిగాడు డాక్టర్ పవన్.

"మనసంతా చాలా ప్రశాంతంగా ఉంది..." ప్రశాంతంగా చెప్పాడు మాధవరావు.

"దాట్స్ గుడ్... మీరిపుడు ఈ మాత్ర ఒకటి వేసుకోండి..." అంటూ ఓ టాబ్లెట్‌ని మాధవరావు చేతికిచ్చాడు పవన్- చిరునవ్వు నవ్వుతూ.

"నా మనసిపుడు ప్రశాంతంగా అయిపోయిందిగా... ఇంకా ఈ టాబ్లెట్ దేనికి? "

"ఇది మనసుమీద ప్రభావం చూపే ఒక ప్రత్యేకమైన టాబ్లెట్... దీన్ని మింగినపుడు పేషంట్ మానసిక స్థితి ఎలా వుంటే- ఇంకో నెలరోజుల దాకా అలాగే ఉండిపోతుందన్న మాట... అంటే దీన్ని





## నేనిప్పుడు పద్మ విదూషక్!

ఆర్. కె. నారాయణ్‌కు 1964లో 'పద్మభూషణ్' లభించింది. తర్వాత 2000లో పౌరులకు భారత ప్రభుత్వమిచ్చే రెండో అత్యున్నత అవార్డు 'పద్మవిభూషణ్' వచ్చింది. ఆ సందర్భంగా ఒక మిత్రుడు అభినందనలు తెలిపేందుకు వెళ్లినప్పుడు, తన సహజ హాస్య దోరణిలో ఆయన, 'ఇప్పుడు నేను పద్మ విదూషక్' అయ్యాను అని నవ్వుతూ చెప్పారు. దీంతో స్నేహితుడు కాసేపు అవాక్కయ్యాడు.




మింగేక ఇపుడు మీరో నెలరోజులు దాకా ఇలాగే ప్రశాంతంగా ఉండగలుగుతారన్న మాట... వివరించాడు డాక్టర్ పవన్.

"ఒకవేళ నెల తర్వాత మళ్లీ మనసంతా గందరగోళం అయిపోతే?" అన్నాడు మాధవరావు సంశయంగా.

"అదనంగా ఇంకో మాత్ర ఇస్తాను... దాన్ని వేస్కోండి" చెప్పాడు పవన్.

"ఒకవేళ అప్పుడు కూడా..."

"అలాగేం జరగదు... ఈ ప్రశాంత మానసిక స్థితిలో ఓ పదిపది హేను రోజులు గడిపాక 'నేచురల్'గానే మీకా ఎస్సయ్ సంగతి పూర్తిగా మరపుకొస్తుంది. అతను తిట్టిన తిట్లే కాదు, అసలా మనిషే గుర్తుండదు మీకు... మరపు మానవ సహజం గదా!" నవ్వేస్తూ అన్నాడు పవన్. "అవసరం ఉండదని తెలిసినా ఈ అదనపు మాత్ర ఊరికే మీరు అడిగారు కాబట్టి మీ తృప్తి కోసం ఇస్తున్నానంతే..."

ఒక మాత్ర అక్కడికక్కడ మింగి- రెండో మాత్రని పదిలంగా జేబులో వేసుకున్నాడు మాధవరావు. దరిమిలా ఆ తండ్రీ కొడుకులిద్దరికీ థ్యాంక్స్ చెప్పి "మళ్లీ వస్తా౯నా..." అంటూ- ఇల్లు చేరుకున్నాడు.

★ ★ ★

తండ్రి చిన్నబోయిన ముఖంతో ఇంటికొస్తాడనుకుంటే ఆయన ముఖం మామూలుగానే ఉండటం చూసి...

"ఇదేంటబ్బా? ఆ ఎస్సయ్ తిట్టిపొయ్యకుండా ఎలా పంపించాడబ్బా?" అనుకున్నాడు ఆనందరావు.

'బహుశా స్టేషన్‌లో ఎస్సయ్ లేడేమో?' అని కూడా అనుకుని, అదేమాట పైకి అన్నాడు. "హిపోప్పో ఎస్సయ్‌గారు లేరా ఏమిటి?" అంటూ.

"ఎందుకు లేరు? ఉన్నారు..." అన్నాడు మాధవరావు.

"మరి ఉంటే... నిన్ను చూసి మండిపడలేదా?"

"ఎందుకు పడలేదు... పడ్డాడు..." అన్నాడు ప్రశాంతంగా!

అని "మండిపడ్డమేకాదు... బండబూతులు కూడా తిట్టాడు..." అన్నాడు తనే మళ్లీ మాధవరావు.

తండ్రి అలా అంటుంటే చాలా చాలా ఆశ్చర్యంగా అనిపించింది ఆనందరావుకి.

బండబూతులు తినొచ్చి కూడా ఇంకా నిండుగా ప్రవహిస్తున్న నదిలా ప్రశాంతంగా ఈయన ఎలా ఉండగలుగు తున్నాడబ్బా? అనుకున్నాడు.

కానీ, అదేమాట తండ్రిని అడగటానికి అతనికి ధైర్యం చాల్లేదు... 'ఏమోలే... అయినా నాకెందుకులే?' అనుకుని మిన్నకుండిపోయాడు.

అయినా అలా ఆరాలు తీస్తూ కూర్చోవటానికి అతనికిపుడు టైముంటేగా? మన సంతా మర్నాడు జరగబోయే శోభనం మీదనే ఉందాయె!

★ ★ ★

శోభనం గదిలో ఎలా ప్రవర్తించాలి?

అనంతలక్ష్మితో ముందుగా ఏం మాట్లాడాలి?

అసలు ముందుగా తాను మాట్లాడాలా లేక ఆమెనే మాట్లాడనివ్వాలా? ముందు ఎవరు మాట్లాడాలి?

ఇలా శోభనం గురించి ఆలోచిస్తుండగా ఉన్నట్టుండి ఆనందరావు వేరొక భ్రమానందంలోకి జారిపోయాడు... సహజమే కదా అది అతనికి.

★ ★ ★

అదొక కీకారణ్యం

భుజానికి విల్లంబులు ధరించి యువరాజు ఆనంద భూపతి ఓ లేడిపిల్లని తరుముకుంటూ వెళ్తున్నాడు.

బాణంతో దాన్ని వధించాలంటే అతనికి ఒక్క నిముషం పని. కానీ... బుల్లిగా, బుజ్జిగా, ముద్దుగా ఉన్న ఆ లేడికూనని ప్రాణంతోనే పట్టుకోవాలని అతని ప్రయత్నం... దాన్ని తమ కోటకు తీసుకెళ్లి పెంచుకోవాలన్నది అతని కోరిక. అందుకే అతను దాన్ని అలా వెంట తరుముతున్నాడు.

ఎంతైనా మనిషి మనిషే! లేడి లేడే! ఆ లేడికూన... ఆనందభూపతి చేతికి చిక్కినట్టే చిక్కి చిక్కకుండా తప్పించుకుపోతూ కోనంతా తిప్పుతోంది, ఎలాగైనా సరే-దాన్ని పట్టుకుని తీరాలన్న పట్టుదలతో ఆయాసం వస్తున్నా లెక్కచెయ్యకుండా అతను దాన్ని తరుముకుంటూ వెళ్తున్నాడు.

కాళ్లకి ముళ్లకంపలు తగిలి చర్మం రక్తమోడుతున్నా అతను పట్టించుకోవటం లేదు. కార్యదీక్షాతత్పరతకు మారుపేరైనట్టి యువరాజు అలాంటి చిన్నచిన్న గాయాల్ని కేర్ చేస్తాడా?

ఎలాగైనాసరే ఆ లేడికూన తన వశమై తీరాలి... అంతకుమించి ప్రస్తుతం అతనికి వేరే ఏ ధ్యాసా లేదు.

అలా ఓ పదిహేను నిముషాలసేపు అతను దాని వెంట పరుగెత్తాక... ఆ లేడి కూన సడన్‌గా ఓ మునివాటికలోకి ప్రవేశించింది.

ఆ మునివాటికలో- ఓ వటవృక్షం క్రింద గడ్డాలూ, మీసాలూ తెగబారెడు పెరిగిపోయి ఉన్న ఓ ముని... ఘోరంగా తపస్సు చేసుకుంటూ ఉన్నాడు.

అతని చుట్టూ పాముపుట్టలు నిలువెత్తుగా పెరిగిపోయి ఉన్నాయి... ఆ పుట్టల మధ్యలోంచి ముని తల ఒక్కటే కనిపిస్తుంది.

ఆ తల చుట్టూ వలయాకారంలో ఉన్న ఏదో వింతకాంతి... అతనెంతటి తపోధనుడో చెప్పకనే చెబుతోంది. యువరాజు తనని తరిమేది పట్టుకుని పెంచుకోవడానికేనని ఆ లేడికూనకేం తెలుసు?

సహజంగానే అది ప్రాణభయంతో తల్లడిల్లిపోతూ ఆ ముని చెంతకు పరుగుతీసి ఆయన్ని ఆశ్రయించింది.

తపోభంగమైన ముని కళ్లు తెరిచి ఆ భీతహరిణిని చూశాడు. ఆ మీదట దాన్ని తరుముకుంటూ వచ్చిన ఆనందభూపతిని చూశాడు. ఆ తర్వాత-

"ఓయీ... ఎందుకు ఈ లేడికూనని ఇలా తరుముతున్నావ్?" అని అడిగాడు-

"నా పేరు ఆనందభూపతి. నేనీ దేశపు యువరాజుని..." రొప్పుతూ చెప్పాడు ఆనందభూపతి.

"అయిననేమి?" అన్నాడు ముని.

"ఈ లేడికూన చాలా అందంగా ఉంది..."

"అయిననేమి బాలకా?"

"దాన్ని ప్రాణాల్తో పట్టుకుని మా కోటకు తీసుకెళ్ళి పెంచుకోవాలని నా కోరిక" లేడి కూనని పట్టుకోవడానికి ఓ చేతిని







ముందుకు చాస్తూ చెప్పాడు ఆనంద భూపతి.

"అది నీకు తగదు..." అతన్ని వారిస్తూ అన్నాడు ముని.

"ఏం- ఎందుకు తగదు?" ఎంతైనా యువరాజు గనక కాస్త పొగరుగానే ఎదురుప్రశ్న వేశాడు ఆనంద భూపతి.

"నీకే కాదు... అడవిలో స్వేచ్ఛగా విహరించే వన్యప్రాణుల్ని బంధించి తీసుకుపోవటం ఎవ్వరికీ తగదు" అన్నాడు ముని కొంచెం కటువుగా.

అంతగా చెబుతుంటే యువరాజుకి తలకెక్కుతుందా ఏంటి?

"డోంట్ టాక్ రబ్బిష్! నేనీ రాజ్యానికి యువరాజుని. అంటే మా తండ్రిగారి తదనంతరం ఈ రాజ్యానికి కాబోయే రాజుని... ఈ రాజ్యంలోని ప్రతి వ్యక్తి మీదా, ప్రాణిమీదా నాకు హక్కు ఉంటుంది... అధికారం ఉంటుంది" అన్నాడు మరింత పొగరుగా.

కానీ ఈ లేడికూన నన్నాశ్రయించింది... కాబట్టి దీన్ని కాపాడ్డం నా ధర్మం... అంచేత నువ్ దీన్ని తీసుకెళ్ళడానికి నేను అంగీకరించను... 'పిచ్చుక మీద బ్రహ్మాస్త్రం' దేనికి లెమ్మని అప్పటికీ శాంతంగానే చెప్పాడు ముని.

ఆ శాంతం ఆనందభూపతిలోని పొగరుని మరింత పెంచింది. "నీ అనుమతి

ఎవడిక్కావాలయ్యా బోడి? ఈ రాజ్యం నాది... ఈ లేడీ నాది... మర్యాదగా నన్ను దాన్ని తీసుకెళ్లనివ్వు..." అన్నాడు మునికేసి చీదరింపుగా చూస్తూ.

ఎంత యువరాజైతే మాత్రం- మరీ అంత చీదరింపుగా చూస్తే మునికి కోపం రాకుండా ఎలా ఉంటుంది?

సహజంగానే మండిందాయనకు.

"ఓరీ..!ధూర్తుడా!" అన్నాడు ఆవేశంగా.

ఆనందభూపతి పోనీ అప్పటికైనా తగ్గాలా? ఊహుఁ... "మైండ్ యువర్ టంగ్! యువరాజునీ పట్టుకుని ధూర్తుడా అంటావా? " అన్నాడు అంతకన్నా ఆవేశంగా.

"ఒకసారి కాదు ముమ్మారంటాను... నువ్ ఎంతటి ధూర్తుడవు కాకపోతే తపోధనుడినైనట్టి నాతో ఇంత ఇదిగా మాట్లాడ్తావ్? నువ్ అరచి గీపెట్టినా సరే- ఈ లేడికూనని నేనివ్వను... ఏం చేసుకుంటావో చేసుకోపో..." అన్నాడు ముని కూడా అంతకన్నా ఆవేశంగా.

"నువ్ ఇవ్వకపోతే ఇక్కడెవరూ చేతులు ముడుచుక్కూర్చోరు... ఐ విల్ సీ యువర్ ఎండ్..." అంటూ ఒరలోంచి కత్తి లాగాడు ఆనంద భూపతి.

అంతే-

మునికి ఆగ్రహంతో హృదయం భగ్గుమంది.







"ఆంగ్లం నీకే కాదురా, నాకూ వచ్చు.. ఆఫ్టరాల్ ఒక లేడికూన కోసం నాలాంటి తపోధనుడ్ని చంప చూస్తున్నావా? సో... ఐ వోంట్ స్పేర్ యు. నీకిదే నా శాపం... లేడికూన కోసం మామీద కత్తి ఎత్తావు కాబట్టి ఈ క్షణం నుండి నీవు లేడీ మానసిక స్థితిలో బతుకు సాగింతువు గాక" అని శపించేశాడు కోపంగా.

ఆ ముని అల్లాటప్పాగాడేం కాదుగదా!

అంచేత ఆ శాపం వెంటనే ఫలించేసింది.

ఆనందరావు మానసిక స్థితి లేడీ మానసిక స్థితి అయిపోయింది!!!

వెంటనే అతను అనాచ్ఛాదితంగా ఉన్న తన రొమ్ముకి బిడియంగా రెండు చేతులూ అడ్డంగా పెట్టుకుంటూ "స్వామీ!" అన్నాడు ఆవేదనగా.

"ఏమి? " అన్నాడు ముని కోపంగా.

"నా మనసుకి నాకు ఆడదానిలా అనిపిస్తూ ఉంది... చూశారుగా నేనెలా సిగ్గుపడిపోతున్నానో... దయచేసి మీ శాపాన్ని వెనక్కి తీసేసుకోండి..." అన్నాడు ఆనంద భూపతి దీనంగా... చేతులు జోడించబోయాడు గాని రొమ్ము మీంచి చేతులు తియ్యడానికి బిడియం అడ్డొచ్చింది.

మునికి అతనిమీద జాలి కలిగింది గానీ, చెయ్యగలిగిందేముంది?

ఇచ్చిన శాపాన్ని తపోధనులు వెనక్కి తీసుకోలేరు గదా!

ఆ మాటే అన్నాడాయన ఆనందభూపతితో-

"పోనీ విమోచనా మార్గం అయినా చెప్పండి స్వామీ? " అన్నాడు యువరాజు అబలలా కన్నీరు కారుస్తూ.

"కొన్ని శాపాలకి విమోచన ఉండదు... ఈ జన్మంతా నువ్ ఇంక ఇలా అఘోరించాల్సిందే..." అన్నాడు ముని.

"అదేంటి స్వామీ. మరీ అంత అన్యాయంగా మాట్లాడుతున్నారు? శాపం అన్నాక విమోచన లేకుండా ఎందుకుంటుంది? " రొమ్ము మీంచి చేతులు తీయలేని పరిస్థితి గనక తడిసిన చెంపల్ని భుజాలకేసి రుద్దుకుంటూ అన్నాడు ఆనంద భూపతి.

"దేరీజ్ నో సచ్ రూల్! విమోచన లేని శాపాలు కూడా కొన్ని ఉంటాయ్... అంతే..." అన్నాడు ముని.

"ఎందుకని అలా? "

"ఐ టూ డోంట్ నో..." అంటూ పెదవి విరిచాడు ముని.

"మరి అలాంటప్పుడు నాకీ దిక్కుమాలిన శాపాన్నే ఎందుకిచ్చారు? ఏదన్నా విమోచన ఉన్న శాపాన్ని ఇచ్చి ఉండొచ్చుగా? " వలవలా ఏడ్చేస్తూ అడిగాడానందభూపతి.

"కోపంలో నేనంత దూరం ఆలోచించలేదు. ఈ శాపానికి విమోచన ఉందా లేదా అన్న సంగతే పట్టించుకోలేదసలు.." అన్నాడు ముని.

ఆనందభూపతికి మునిని బండబూతులు తిట్టాలనిపించింది... కానీ... తిడితే ఇంకేదన్నా కొత్త శాపం ఇస్తాడేమోనని నిగ్రహించుకున్నాడు.

"కాస్త డీప్‌గా ఆలోచించండి సార్... ఏదన్నా విమోచన గాని ఉందేమో..." అన్నాడు దీనాతి దీనాతి దీనంగా.

"ఊహు, నాకు తెలిసినంత వరకు ఈ శాపానికి విమోచన లేదుగాక లేదు..." అడ్డంగా తలాడిస్తూ అన్నాడు ముని.

'అడ్డంగా నరకాల్రా నిన్ను' అని మనసులో అనుకున్నప్పటికీ లేడీ మానసిక స్థితిలో ఉన్న ఆనందభూపతి అంత సాహసం చేయలేకపోయాడు.

"ఇప్పుడెలా? " అని ఆవేదనగా అనుకుంటుండగా... 'టపక్'మని ఏదో చప్పుడైంది.

ఏంటబ్బా? అని కిందకు చూస్తే- తన

వజ్రపుటుంగరంలోని వజ్రం నేల మీద కనిపించింది ఆనందరావుకి.

లూజై రాలిపడిందన్నమాట! అందుకేన న్నమాట టపక్‌మని శబ్దం వస్తే! అను కుంటూ... వొంగి దాన్ని చేతిలోని తీసు కుని గుటుక్కున మింగేశాడు ఆనందభూ పతి.

జీవితాంతం స్త్రీ మనస్తత్వంలో బ్రతికే కన్నా చావే మేలనుకుని ఆ పని చేశాడ తను.

కానీ, అతను మింగింది నిజంగా వజ్రాన్ని కాదు. అంతక్రితం పొరబాట్న తండ్రి షర్ట్ జేబులోంచి కింద పడిపోయిన టాబ్లెట్‌ని!

డాక్టర్ పవన్ ఇచ్చిన టాబ్లెట్‌ని!!

★ ★ ★

నోట్లో ఏదో చేదుగా అనిపించడంతో గభాల్న భ్రమానందంలోంచి బైటికొచ్చేసిన ఆనందరావుకి... గోడమీద గాలికి రెపరె లాడుతున్న షారుక్‌ఖాన్ క్యాలెండర్‌ని చూడగానే మనసు పులకించిపోయింది.

'అబ్బ! షారుక్ ఎంత బావుంటాడు! ఎంత చిలిపిగా నవ్వుతాడు! నిజంగా మాన్లీ నెస్ అంటే అతనిదే... ఒక్కసారి అతని పొందు లభిస్తే చాలు... ఈ జన్మకి అంత కన్నా ఏం కావాలీ!' అనిపించింది.

అంతలోనే అతనికి తానొక మగాడినన్న సంగతి గుర్తు కొచ్చింది.

అవునుగదా! నేను మగాడ్నయ్యుండి ఇలా ఆలోచిస్తున్నానేంటి? ! అనుకున్నాడు ఆశ్చర్యంగా. అంతలో అతనికి తన భ్రమా నందమూ ముని శాపమూ గుర్తుకొ చ్చాయ్!

భ్రమలో ముని అలా శపిస్తే శపించి ఉండవచ్చు ఉండవచ్చేంటీ శపించాడు. నిజమే! కానీ మెలకువ వచ్చాక కూడా ఆ స్థితి ఇంకా అలాగే కొనసాగటం ఏంటి? మతిపోతున్నట్టుగా అనిపించింది ఆనంద రావుకి.

కాసేపటికి తగ్గిపోతుందేమో అని సరిపె ట్టుకున్నాడు.

షారుక్ క్యాలెండర్ కేసే ఆశగా చూస్తూ ఓ నాలుగైదు నిముషాలు గడిపాడు.

అంతలో... వీధిలోంచి...

'మల్లెపూలోయ్...' అనే కేక వినిపిం చింది. అది వింటుంటే...

'జడ వేసుకుని మల్లెపూలు పెట్టుకుంటే ఎంత బాగుంటుందీ!' అనిపించింది ఆనం దరావుకి.

'కానీ ఏం లాభం- నాకు జడ లేదుగా! ప్చ్' అని కూడా అనిపించింది. అనిపిం చటం కాదు... నిజం చెప్పాలంటే... పూలు పెట్టుకోవాలన్న కోరిక అతని మన సుని కుదిపేసింది.

"ఏయ్... మల్లెపూలూ...." అని పిలవ బోయి నిభాయించుకున్నాడెలాగో.

అప్పటికా మాత్ర అతని రక్తంలోకి ఇంకా పూర్తిగా ఇంకలేదు కాబట్టి అలా నిగ్రహించుకోగలిగాడు.

'ఏంటిది? ఎందుకిలా జరుగుతోంది? కొంపదీసి ఇంకెప్పటికీ నేనిలాగే ఉండిపో తానా? '

భ్రమలోని శాపం... నిజజీవితంలో కూడా నిజమై... ఆ ముని అన్నట్టు జీవి తాంతం నాలో ఈ స్త్రీ మనస్తత్వం ఇంక ఇలాగే ఉండిపోతుందా? అతనన్నట్టు దీని కింక విమోచనే లేదా? " గజగజ వణికిపో యింది ఆనందరావు హృదయం.

హౌటు ఓవర్ కమ్ దిస్ సిట్యుయే షన్? ఎలా... ఎలా? ఈ స్థితి నుండి బయటికి రావటం?

బుర్ర బద్దలయ్యేలా ఆలోచిస్తూ కూర్చు న్నాడు.

అంతలో... వీధిలోంచే మరో కేక...

'గాజులోయమ్మ..గాజులో...' అంటూ....

'అబ్బ! ఈ మొండి చేతులకు గాజులు



వేసుకుంటే ఎంత బావుంటుంది!. అన్న ఊహ వచ్చిందే తడవుగా "ఏయ్... గాజులూ..." అని అరిచేశాడు గట్టిగా. అప్పటికి ఆ మాత్ర అతని రక్తంలోని పూర్తిగా ఇంకిపోవటంవల్ల, అలా అరవకుండా తనని తాను నిగ్రహించుకోవటం అతనివల్ల కాలేదు.

ఆ అరుపుకి వీధిలోని గాజులబ్బాయి ఆగాడు. పక్క గదిలోంచి ఆనందరావు దగ్గరికి అతని తండ్రి వచ్చాడు.

"ఎవరికిరా గాజులు?"

తండ్రి తనని 'రా' అంటున్నందుకు చాలా బాధగా అనిపించింది ఆనందరావుకి- 'అమ్మలూ' అనో, 'తల్లీ' అనో పిలిస్తే ఎంత బావుంటుందీ- అనుకున్నాడు మనసులో- ఆశగా!

"నాకే..." అన్నాడు పైకి!

మాధవరావు ఆశ్చర్యపోయాడు ఆ జవాబుకి.

"నీకా? నీకు గాజులెందుకురా?" అడిగాడు నోరు వెళ్లబెడుతూ- తండ్రి.

"ఎందుకేమిటి? చేతులకి వేసుకోవడానికి..."

ఆనందరావు తన మొండిచేతుల్ని తండ్రికి- మెలికలు తిప్పి చూపిస్తూ చెప్పాడు.

"చస్, నోర్ముయ్... నువ్ మగాడివి... నువ్ గాజులు వేసుకోవడం ఏంటి?"

తండ్రి అలా కసురుకున్నాక ఆనందరావుకి తను మగాడినన్న సంగతి గుర్తుకొచ్చింది.

అయినా గాజులు వేసుకోవాలన్న కోరిక మాత్రం మనసులోంచి పోలా- చావలా!

"అయితే ఏంటి? ఏం వేసుకోకూడదా?" అన్నాడు అచ్చం ఆడపిల్లలాగే బుంగమూతి పెడుతూ... అంటే... మగాళ్లు బుంగమూతి పెట్టరని కాదు... ఆడపిల్లలు బుంగమూతి పెట్టే విధానం వేరేగా ఉంటుంది గదా!

మాధవరావుకి ఏకంగా మతేపోయింది... కొడుకు వాలకం చూస్తుంటే-

"ఏమైందిరా నీకు? పిచ్చెక్కిందా?" అన్నాడు.

"అది కాదు నాన్నా... గాజులు వేసుకుంటే బావుంటుంది కదాని..." చేతులు నలుపుకుంటూ ముద్దు ముద్దుగా నసిగాడు ఆనందరావు.

మండుకొచ్చింది మాధవరావుకి.

"ఏంట్రా బాగుండేది? ఏంటా ఆడంగి మాటలు?" అన్నాడు కోపంగా చూస్తూ.

అప్పటికే గుమ్మంలోకి వచ్చేసిన గాజులబ్బాయ్ ఇదంతా విచిత్రంగా చూస్తున్నాడు.

అతని భుజానికి వేళ్లాడుతున్న గాజుల దొంతరల్ని చూస్తుంటే ప్రాణం తహతహలాడిపోయింది ఆనందరావుకి- మాత్ర ప్రభావం మరి!

"ఏయ్ అబ్బాయ్... ఏయే రకం గాజులున్నాయ్?" అన్నాడు తండ్రి కోపాన్ని లెక్కచెయ్యకుండా ఆ గాజులబ్బాయ్ వైపు తిరిగి.

"కుచ్‌కుచ్ హోతాహై.... మైనే ప్యార్ కియా... దిల్‌తోపాగల్‌హై.. ఓమ్ శాంతి ఓమ్..." అంటూ వాడింకా లిస్ట్ చదవబోతుంటే...

"ఈ పాగల్‌గాడు అడగటమూ బాగుంది.. నువ్ చెప్పడమూ బాగుంది... గెటవుట్..." అనరిచాడు మాధవరావు.

గాజులబ్బాయికి బేరం ముఖ్యంగదా!

"అదేంటిసార్- అలా అంటారు? అబ్బాయిగారు ముచ్చటపడుతుంటేనూ!" అన్నాడు ఓ అడుగు లోనికేస్తూ..

"చంపుతా- ఇంకో అడుగ్గానీ ముందుకు వేశావంటే. గెటవుట్...." మళ్లీ అరిచాడు మాధవరావు.

బేరం ముఖ్యంకదా- అందుకని ఆ అరు




-వి.వి. చందన్‌రావు,
ఆర్. పి. రోడ్, నిజామాబాద్

పుని కేర్‌చెయ్యకుండా- "లేటెస్ట్ వెరైటీస్ చాలా ఉన్నాయ్ సార్! ఒక్కసారి చూడనివ్వండి అబ్బాయిగార్ని..." అంటూ ఆ మరో అడుగు కూడా వేసేశాడు గాజులబ్బాయ్.

అన్నంత ఈజీ ఏంకాదు గదా ఒక మనిషిని చంపడం!

"రేయ్... రేయ్..." అంటూ నెత్తి బాదుకున్నాడు మాధవరావు.

"మీరు రండబ్బాయిగారూ! మీకే గాజులు కావాల్నో చూసుకోండి...." అంటూ గాజులబ్బాయి మలారాన్ని దించబోతుండగా-

"గాజులా? ఎవరు పిలిచారు బాబూ నిన్ను?" అంటూ వచ్చింది- ఎక్కడికో పెత్తనాలకి వెళ్లిన సావిత్రి.

"నేనే పిలిచానమ్మా..." అన్నాడు ఆనందరావు సిగ్గుగా నవ్వుతూ.

"ఏంట్రా- అప్పుడే పెళ్లానికి గాజులు సెలెక్ట్ చేసేస్తున్నావా?" అంటూ తనూ నవ్వింది సావిత్రి.

"పెళ్లానికైతే బాగానే ఉండేది... గాజులు వాడికేనట..." తనకు తెలియకుండానే పళ్లు నూర్తూ అన్నాడు మాధవరావు.

"వాడికా? చాల్లెండి జోకులూ... మీరూ?" చిన్నగా కసురుకుంది సావిత్రి భర్తని.

"జోకులు కాదు... ఈ సన్నాసి గాజులు తొడుక్కుంటాడట... ఇందాకట్నుంచి ఆడంగి మాటలు మాట్లాడుతున్నాడు..." అన్నాడు మాధవరావు కొడుక్కేసి రోతగా చూస్తూ. ఆయన చూపుల్నేమాత్రం ఖాతరు చెయ్యకుండా- "అవునమ్మా నేను గాజులు తొడుక్కుంటానంటే- నాన్న చూడు ఎలా కోప్పడుతున్నాడో..." అన్నాడు ఆనందరావు ఇందాకటికి మల్లే మళ్లీ బుంగమూతి పెడుతూ.

"గాజులు నీకెందుకురా? ఎక్కడైనా మగాళ్లు గాజులేసుకుంటారా?" అని బుగ్గలు నొక్కుకుంది సావిత్రి.

బేరం పోతుందేమోనని కంగారుపడ్డ గాజులబ్బాయ్... "వేసుకుంటే తప్పేంటమ్మా? ఏం మగాళ్లు చెవిపోగు పెట్టుకోవట్లేదా? అలాగే ఇదీనూ..." అన్నాడు సాహసించి మలారాన్ని కిందకు దింపేస్తూ-

అతని మాటల్ని సగం విశ్వసిస్తూ "కొంపదీసి అలాంటి కొత్త ఫ్యాషన్‌గాని వచ్చిందా ఏమిట్రా?" అని తనయుడ్ని అడిగింది సావిత్రి.

తల్లి తనని 'తల్లీ' అని పిలవనందుకు నొచ్చుకున్నాడు ఆనందరావు మనసులో- 'అవును'- 'కాదు'లకు మధ్యస్థంగా తలూపి ఊరుకున్నాడు.

"చూపించమంటారా అమ్మా- అబ్బాయిగారికి గాజుల్ని?" గాజులబ్బాయ్ ఉత్సాహాన్ని పుంజుకున్నాడు.

"ఏంటిరా నువ్ చూపించేది? ఏంటి చూపిస్తావురా నువ్వు?" ఒళ్లు మండిపోయిన మాధవరావు కొట్టేంత స్పీడుగా వెళ్లాడు వాడి మీదకి. "నేను మూడు అంకెలు లెక్కపెట్టేలోగా నువ్విక్కడ్నుంచి వెళ్లిపోకపోతే నేనేం చేస్తానో నాకే తెలీదు..." అన్నాడు కుడిచేతి చూపుడు వేలుని ఊపుతూ.

అంతమాత్రానికే భయపడిపోయి







బేరాన్ని వదిలేసుకుంటే ఎలా? "ఎందుకు సారూ- అలా ఇదైపోతారూ- అబ్బాయి గారు సరదా పడుతుంటేనూ..." అన్నాడు గాజులబ్బాయ్ సాగదీస్తూ.

"ర్రేయ్..." అంటూ మాధవరావు పిడికిళ్లు బిగించగా-

"పోన్లే... ఊర్కోండి... వాడి మీద ఎందుకు కోపం చేసుకుంటారు? పోనీ కోడలికి తీసుకుందాంలే..." అంటూ భర్తని కాస్త ఎడంగా లాక్కెళ్లింది సావిత్రి.

"అదేం కుదరదు... గాజులు నేనూ వేసుకుంటాను..." ముద్దు ముద్దుగా గునుస్తూ అన్నాడు ఆనందరావు.

"వేస్కుని? " అతనికేసి గుర్రుగా చూస్తూ అడిగాడు మాధవరావు.

"వాటికి మ్యాచయ్యే చీరా, జాకెట్టూ కూడా వేసుకుని తలనిండుగా మల్లెపూలు పెట్టుకుంటాను..." అన్నాడు ఆనందరావు సంబరంగా.

అప్పటికి అతనిది పూర్తిగా లేడీ మానసిక స్థితి అయిపోవటంవల్ల అలా అంటున్నప్పుడు అతనికేమాత్రం సిగ్గుగా అనిపించలేదు.

కానీ, సావిత్రికి మాత్రం సిగ్గేసిపోయింది... ఎట్ ది సేమ్ టైం భయంగా కూడా అనిపించింది.

"రేయ్ రేయ్ నందూ! ఏమైందిరా నీకు? ఏంటా పాడు మాటలు? " అంది గాభరాగా.

గాజులబ్బాయ్‌కి ఇదంతా బహు విచిత్రంగా తోచి- ఆనందరావుకేసి గుచ్చిగుచ్చి చూశాడు.

'వీడేం మగాడ్రా బాబూ? ' అన్నట్టు ఆనందరావు ఆ చూపుని చాలా తీవ్రంగా అపార్థం చేసుకున్నాడు. ఒక పరాయి మగవాడు తనకేసి అలా గుచ్చి గుచ్చి చూస్తుంటే- అతన్లోని స్త్రీ మానసిక స్థితి పువ్వులా విచ్చుకుంది.

దాంతో- "ఏయ్ ఏంటలా చూస్తావ్? ఏం నీకు అప్పచెల్లెళ్లు లేరా? " అన్నాడతను గుండెలకు చేతులు అడ్డం పెట్టుకుని సిగ్గుతో మెలికలు తిరిగిపోతూ.

అంతే- కొడుక్కేదో దెయ్యం పట్టేసిందనుకుని భోరున ఏడ్చేయడం ప్రారంభించింది సావిత్రి.

బేరం చెడిపోయేలా ఉందని "ఏడుపులు తర్వాత ముందు బేరం కానివ్వండమ్మా" అన్నాడు గాజులబ్బాయ్.

కొడుకు పద్ధతికి మనసు బేజారెత్తిపోతుంటే- వాడితో గొడవపడ్డానిక్కూడా మనస్కరించక, "నీ గాజులూ వద్దు, గోంగూరా వద్దు- ఈ ఇరవై రూపాయలు తీస్కుని పో- ఇక్కడ్నుంచి..." అంటూ వాడిమీదకో ఎర్రనోటు విసిరేశాడు మాధవరావు.

'ఎర్రోడు' అనుకుంటూ ఆ ఎర్రనోటు అందుకుని... 'భలే బేరం' అంటూ వెళ్లిపోయాడు గాజులబ్బాయ్.

ఆ తర్వాత కొడుక్కు చెరో పక్కచేరి... "ఇందాకటిదాకా బాగానే ఉన్నావుగా- ఇంతలోనే ఏమైందిరా నీకు? " అంటూ అతన్ని గుచ్చి గుచ్చి ప్రశ్నించారా దంపతులిద్దరూ!

అప్పుడు చెప్పుకొచ్చాడు ఆనందరావు. తన భ్రమానందం సంగతీ, ముని తనకి శాపం పెట్టిన వైనం, తాను వజ్రం మింగేసిన ఉదంతం.

అయినప్పటికీ ఇంకా అంతా అయోమయంగానే అనిపించింది వాళ్లిద్దరికీ- భ్రమలో అలా జరిగితే మాత్రం మెలకువ వచ్చాక కూడా ఇంకా అదే స్థితిలో ఉండటం ఏమిటా? అనుకున్నారు- మొదట్లో ఆనందరావు అనుకున్నట్టే- వాళ్లకి మాత్రం ఏం తెలుసు? కొడుకు మింగింది వజ్రం కాదనీ, తన జేబులోంచి పడిపోయిన 'మాత్ర' అని, ఇదంతా దాని ప్రభావమే అనీ- మాధవరావు గ్రహించలేకపోయాడు. తన జేబులోంచి మాత్ర ఎక్కడో

పడిపోయిన విషయాన్ని ఆయనెప్పుడో నోటీస్ చేసినప్పటికీ కొడుకు మింగిన వజ్రం అదేనని మాత్రం ఆయననుకోలేక పోయాడు.

ఇప్పుడెలా? ఏం చేయటం? ఎందు బోవటం? ఎవర్ని సంప్రదించటం? అసలే రేపు వీడికి శోభనం... ఆ తంతు అమ్మాయివాళ్ల ఇంట్లోనే జరగాల్సి ఉంది. ఇప్పుడా పిల్ల అక్కడే ఉంది... రేపు శోభనానికంటూ అక్కడికి బయలుదేరి వెళ్లాక- వీడు అక్కడ కూడా ఇలాగే ఆడంగి చేష్టలు చేస్తే పరువేంగాను?

మల్లగుల్లాలు పడసాగారు ఆ దంపతులిద్దరూ.

ఇదంతా తన సమక్షంలోనే జరుగుతుండటం వల్ల ఒక దశలో తను కూడా నోరు విప్పాడు ఆనందరావు.

"నా కసలు శోభనం వద్దే అమ్మా!" అన్నాడు విరక్తిగా ముఖంపెట్టి తల్లితో-

"అదేంటి నందూ? " అందామె బాధగా.

"ఆ అమ్మాయి ఆడపిల్ల కదా! ఆడపిల్లతో... అలాంటిది... ఛీ... యాక్... థూ..." అన్నాడు ఆనందరావు రోతగా!

నవ్వాలో ఏడవాలో అర్థం కాని పరిస్థితి సావిత్రిది.

"మగాడితో అయితే బాగుంటుందా? పోనీ ఇంకెవరయినా మగాడితో ఏర్పాటు చెయ్యమంటావా శోభనం? " ముఖంలో ఏ భావమూ కనిపించనివ్వకుండా జాగ్రత్త పడుతూ అడిగాడు మాధవరావు.

మగాడితో శోభనం అనగానే ఆనందరావు ముఖం ఆనందంతో చినిగి చేటంత అయ్యింది.

అతని శరీరంలో అతనికి తెలియకుండానే అప్పటికే ఏదో పులకరింతలాంటిది కలిగింది.

మనసునెవరో కోడి ఈకలాంటి దానితో మృదువుగా నిమురుతున్న భావన...

"మీ ఇష్టం నాన్నా..." అన్నాడు బిడియంగానూ, సంబరంగానూ. అలా అంటుంటే అతని కళ్లు సిగ్గుతో వాలిపోయాయ్ బరువుగా.

"ఛస్ నోర్ముయ్..." అన్నాడు మాధవరావు కోపంగా.

నిజానికది బాధపడాల్సిన సందర్భమే. అయినా సరే ఆయనకలా కోపమే వచ్చింది ముందు. కానీ, ఆ వెంటనే పశ్చాత్తాపం చెందాడు.

"మగాడితో శోభనం అయితేనే బావుంటుందని అనిపిస్తోందా నీకు? " అని బాధగా అడిగాడు.

ఆనందరావు దానికి 'మరే' అన్నట్టు సంబరంగా తలాడిస్తుంటే... ఆ దంపతులిద్దరూ ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు కాసేపు.

లక్షణమైన కుర్రాడు సడన్‌గా అలా అయిపోయినందుకు వాళ్లిద్దరి ముఖాల్లోనూ బాధ నిండిపోయింది.

## చూడదగ్గ ప్రదేశాలు

కేంద్ర సాహిత్య అకాడెమీ అవార్డు అందుకోవడానికి 1961లో తొలిసారిగా ఆర్కే ఢిల్లీ వెళ్లినప్పుడు నట్వర్‌సింగ్ ఆతిథ్యాన్ని స్వీకరించారాయన. ఆ సందర్భంగా 'ఢిల్లీలో ఏయే ప్రదేశాలు చూడదలచుకున్నారు?' అడిగారు నట్వర్. రాష్ట్రపతి భవన్‌లోని రోజ్‌గార్డెన్ను, పండిట్ నెహ్రూను చూపించమని బదులిచ్చారు ఆర్కే. తీన్‌మూర్తిభవన్‌లో నెహ్రూను కలిసినప్పుడు ఈ విషయం ఆయన దృష్టికి రావడంతో.. 'ఇక్కడ చూడదగ్గ ప్రదేశాల్లో నన్ను కూడా చేర్చారే!' అని ఆయన ఆర్కే కొంటెతనాన్ని కొనియాడారు.








"ఏంటండీ ఈ గ్రహచారం? ఇప్పుడేం చేద్దాం?" సావిత్రి బేలగా అడిగింది- భర్తని.

"ముందైతే శోభనం కాన్సిల్ చేసెయ్యమని కబురు చేద్దాం..." అన్నాడు మాధవరావు సాలోచనగా!

"కారణం అడిగితే?"

"అడుగుతారు... అడక్కుండా ఉంటారా? ఏదో ఒకటి చెప్పేద్దాం..." ఏం చెప్పాలో మాధవరావుకి మాత్రం ఏం తెలుసు?

"ఏదో ఒకటంటే ఏం చెబుతాం? వీడేమన్నా ఆడపిల్లా- ఆ అమ్మాయికి జరిగినట్లు వీడికీ జరిగిందని చెప్పడానికి?" తల పట్టుకుంటూ అంది సావిత్రి.

అమ్మానాన్నల మాటలు వింటుంటే మండిపోయింది ఆనందరావుకి.

"జస్ట్- ఇంతకు ముందే మగాడితో శోభనం ఏర్పాటు చేస్తాడని చెప్పి, ఇంతలోనే మాట మార్చడం ఏమిటి?" అనుకున్నాడు బాధగా- తల పక్కకి వాల్చి.




మాధవరావు.

"ఆఁ..." అంటూ నిలువుగా తలాడించాడు ఆనందరావు.

"సరే... నువ్వొక పక్కన గమ్మున కూర్చో అయితే" అనేసి భార్యను పక్కగదిలోకి తీసుకెళ్లాడు మాధవరావు.

ఆనందరావక్కడ తనో మగాడి బిగికౌగిట్లో కరిగిపోతున్నట్టు తియ్యటి కలలు కంటూ కూర్చోగా వీళ్లిక్కడ డిస్కషన్‌లో పడ్డారు.

"వాడు శోభనం కావాలనే అంటున్నాడు కాబట్టి కాన్సిల్ చెయ్యకపోవడమే మంచిదేమో సావిత్రీ..."

"అవునండీ- నాకూ అలాగే అనిపిస్తోంది. అదీగాక కాన్సిల్ చెయ్యడం కూడా మనం అనుకున్నంతా ఈజీ ఏంకాదు.. వాళ్లకి తగిన కారణం చెప్పలేక చావాలి..."

"అవుననుకో... కానీ రేపు వీడక్కడ సవ్యంగా ప్రవర్తిస్తాడంటావా? "

"ఎందుకు ప్రవర్తించడూ? కోడలు రంభలా ఉంటుంది గదా! శోభనం గదిలో ఆ పిల్లని చూడగానే వీడొక పులైపోడూ? మగమహారాజైపోడూ? "

అదీ నిజమేననిపించింది మాధవరావుకి... భార్య అలా అంటుంటే... అయినప్పటికీ మనసులో ఎక్కడో సందేహం... పొరపాట్న... రేపు ఏదైనా తిరకాసు వస్తే అభాసుపాలైపోతామేమో

"నో... శోభనం కాన్సిల్ చెయ్యొద్దు..." అన్నాడు గట్టిగా- అంటే అరిచినట్టుగా అన్నమాట.

శోభనం అంటే అతని దృష్టిలో ఇంకా మగాడితో శోభనమే అని వీళ్లకేం తెలుసు? కొడుకు మానసిక స్థితిలో కొద్దిగా మార్పొచ్చిందేమో ననుకుని- సంబరపడిపోయారు.... అంటే... లోలోన అన్నమాట.

అయినప్పటికీ కాస్త అనుమానంగా... "నిజంగానే అంటున్నావా? " అనడిగాడు

కొత్తగాలి...

**ఏ అపార్ట్‌మెంటు ఏ చెరువు సమాధో**

*-కందాళై రాఘవాచార్య, నిజామాబాద్*

నని...

అదే అన్నాడు భార్యతో- అని "ఎందుకైనా మంచిది. నేనొకసారి డాక్టర్ దగ్గరికెళ్లి వీడి సంగతి చెప్పొస్తాను.... ఆయనేమంటారో చూద్దాం..." అన్నాడు చెప్పులు తొడుక్కోవడానికి వెళ్లబోతూ.

"ఏ డాక్టర్ దగ్గరికి వెళ్తున్నారు" అడిగింది.

"డాక్టర్ పవన్ అని మా ఫ్రెండు కొడుకు ఒకతను ఉన్నాడులే! మనోవైద్యుడు..." అని ప్రారంభించి, అతని దగ్గరకు తనువెళ్లటం ఎలా సంభవించిందో అదంతా వివరంగా చెప్పుకొచ్చాడు మాధవరావు.

"నా మనసులోని బాధనంతా ఇట్టే తొలగించేయగలిగాడా మహానుభావుడు..." అన్నాడు చివర్లో.

"మరైతే అబ్బాయిని కూడా అక్కడికి తీసుకెళ్లొచ్చుగా! మీరొక్కరే వెళ్లడం దేనికి? " అంది సావిత్రి.

"ఆయన మెంటల్ డాక్టర్ కదా! వీడ్ని రమ్మంటే బాధపడతాడేమో- నాకు మెంటలా? అని... అందుకని ముందు నేనొక్కడ్నే వెళ్లి విషయం చెప్తాను. ఆయనేం సలహా ఇస్తాడో చూద్దాం... ఒక వేళ పేషంటుని తీసుకురమ్మని ఆయనంటే అప్పుడు చూడొచ్చు.." అన్నాడు మాధవరావు.

"సరే అలాగే చెయ్యండి..." అనేసింది సావిత్రి.

విషయం విని- "ఇదే మొదటిసారా ఇలా జరగటం? " అనడిగాడు డాక్టర్ పవన్.

"అవునండీ... ఇంతకు ముందెప్పుడూ లేదిలా..." అన్నాడు మాధవరావు.

"అయితే పెద్దగా వర్రీ అవ్వాల్సిందేం లేదు... ఏదో టెంపరరీ మెంటల్ డిస్టర్బెన్స్ అయ్యుంటుంది. రెండు నిద్రమాత్రలిస్తాను... తీసుకెళ్లి వెయ్యండి... ఈ రాత్రంతా ప్రశాంతంగా నిద్రపోతే - తెల్లారేసరికల్లా మామూలుగా అయిపోతాడు..." సింపుల్‌గా అనేశాడు డాక్టర్ పవన్.

"అసలు వాడి భ్రమానందాల సంగతి కూడా మీరొకసారి చూడాలండీ.." డాక్టర్ ఇచ్చిన నిద్రమాత్రల్ని జేబులో వేసుకుంటూ అన్నాడు మాధవరావు.

"అదంతా నెమ్మదిగా చూడొచ్చు.. ముందైతే టెంపరరీ సొల్యూషన్ ముఖ్యం కదా! అదీగాక రేపు మీ వాడికి శోభనం అంటున్నారు కదా! సో... ఇప్పటికిలా కానివ్వండి... ఆ శుభకార్యమేదో అయ్యాక ఒకసారి మీవాడ్ని తీసుకొస్తే థరోగా చెక్ చేస్తాను..." అన్నాడు డాక్టర్ పవన్.

"అసలు ఈ భ్రమానందాలు అనేవి మెంటల్ డిజార్డరేనంటారా? "

"పేషెంట్‌ని స్వయంగా చూడనిదే నేనే సంగతీ చెప్పలేను... అప్పుడప్పుడూ ఊహల్లో విహరించటం అనేది మనుషులందరికీ సహజమే! కానీ, మీ వాడిలో అది కొంచెం తీవ్రంగా ఉందంటున్నారు కాబట్టి ఓసారిచెక్ చేద్దాం..."

"ఇది వరకు వాడు భ్రమల్లోంచి బైటకు రాగానే వెంటనే మామూలుగా అయిపోతుండేవాడు... కానీ ఇప్పుడుండే స్థితిలో కంటిన్యూ అవ్వడానికి కారణం ఏమిటంటారు? "

"భ్రమలో తనకి లేడీ మనస్తత్వం వచ్చే సరికి మీవాడు కన్‌ఫ్యూజన్ అయి మెంటల్‌గా కాస్త డిస్టర్బ్ అయ్యుంటాడు. అంత కుమించి ఏం ఉండదు... ముందు నేను చెప్పినట్టుగా నిద్రమాత్రలు వెయ్యండి.... ఒకవేళ రేపు లేచాక కూడా అలాగే ప్రవర్తిస్తే, నా దగ్గరకు తీసుకురండి..." తనకు వేరేపనేదో ఉండటంతో వ్యవహారాన్ని తెగ్గొట్టేయబోతూ అన్నాడు డాక్టర్ పవన్.

అది గ్రహించకుండా -

"కానీ, రేప్పొద్దున్నే మేం ప్రయాణమై వెళ్లాల్సుంటుందే? " అన్నాడు మాధవరావు సందేహంగా ముఖం పెట్టి.

"నైన్‌టీ నైన్ పర్సెంట్ రేపు తెల్లారేసరికల్లా మీ వాడు నార్మల్‌గానే ఉంటాడు... ఏ మాత్రం బాగున్నా మీరు నిరభ్యంతరంగా ప్రయాణమై వెళ్లిపోండి... మరేం పర్లేదు..." అనేసి లేచాడు డాక్టర్ పవన్.

"మీరెక్కడికైనా వెళ్లాల్సి ఉందా? "

"అవును - అర్జెంటుగా ఒక వ్యక్తిని కలవాలి... వస్తా..." అనేసి మరో మాటకు ఆస్కారం ఇవ్వకుండా బయటకు వెళ్లిపోయాడు డాక్టర్ పవన్.

ఆ గదిలోంచి ఇవతలికి వచ్చి, మూర్తితో ఓ రెండు ముక్కలు మాట్లాడి, దరిమిలా ఇంటి ముఖం పట్టాడు మాధవరావు.




"**ఎ**లా ఉంది? నేనెళ్లాక మళ్లీ ఏవన్నా అవకతవక చేష్టలుగాని చేశాడా? " ఇంటికి రాగానే భార్యనడిగాడు మాధవరావు.

"లేదండీ... తన గదిలోకి వెళ్లి పడుకున్నాడు.." అంది సావిత్రి.

"అంటే నిద్రపోతున్నాడా? "

"కళ్లయితే మూసుకుని ఉన్నాడు... నిద్రేపోతున్నాడో, మళ్లీ ఏదైనా భ్రమానందంలోకి జారుకున్నాడో ఎవరికి తెలుసు? " నిట్టూరుస్తూ అంది సావిత్రి.

"సరే... వెళ్లి చూద్దాం పద..."

ఇద్దరూ కలిసికట్టుగా వెళ్లారు తనయుడి గదిలోకి.

ఆనందరావు మంచం మీద వెల్లకిలా పడుకుని ఉన్నాడు.

"నందూ..." పిలిచింది సావిత్రి.

కళ్లు తెరవలేదు ఆనందరావు

"నందూ... నందూ..."

ఈ సారి సావిత్రి చాలా గట్టిగా పిలిచేసరికి "ఏంటమ్మా? " అంటూ లేచి కూర్చున్నాడు ఆనందరావు.

"ఎలా ఉందిరా నీకిపుడు? " మాధవరావు అడిగాడు.

ఓ మగాడితో తనకి జరగబోయే శోభనం గురించి తియ్యని కలలు కంటూ ఉన్న ఆనందరావు "బానే ఉంది" అన్నాడు పొడిగా.

"అన్నం తిన్నాడా? " భార్యని అడిగాడు మాధవరావు

"మీరటు వెళ్లగానే తినేశాడండీ... ఆ తర్వాతే ఇదుగో... ఇలా తన గదిలోకొచ్చి పడుకున్నాడు" చెప్పింది సావిత్రి.

"సరే అయితే... రేయ్... ఇదుగో ఈ మాత్రలు వేసుకుని పడుకో..." అంటూ జేబులోంచి నిద్రమాత్రలు తీసి కొడుక్కందించాడు మాధవరావు.

"దేనికి నాన్నా ఇవి? " అందుకుంటూ అడిగాడు ఆనందరావు.

"రేపు శోభనంగదా! ఈ రాత్రంతా ప్రశాంతంగా నిద్రపోతే - రేపు ఎక్కువ





## కుడి ఎడమైతే!?

మ్యాన్-ఈటర్ ఆఫ్ మాల్గుడి నవలను ఆర్కే 1961లో రాశారు. తను తర్వాత రాయబోయే నవల గురించి మిత్రుడికి సుదీర్ఘమైనలేఖ రాస్తూ ప్రస్తుతం అది ప్రసవ వేదననుభవిస్తూ ఉందని చెప్పారు. అందులో చివరిలో ఇలా ఉంది: 'తర్వాతి నవల వస్తువుపై తీవ్రమైన మధనం జరుగుతోంది. ప్రతిరోజూ ఉత్సాహంగా కొత్తవిషయాన్ని ఆలోచిస్తూ.. కొన్ని గంటల తర్వాత అది కూడా వద్దని తిరస్కరిస్తూ కాలక్షేపం చేస్తున్నాను. ఈసారి రాసేందుకు 'ఉమన్ ఈటర్ ఆఫ్ మాల్గుడి' అనేదే అన్నివిధాలా సరైంది కావచ్చు -ప్రేమతో, ఆర్. కె. ఎన్.'




సేపు మెలకువగా ఉండగలుగుతావని నిద్ర మాత్రలు తెచ్చా..." చెప్పాడు మాధవరావు.

"సరే..." అని వాటిని గుటుక్కున మింగేసి- "ఇంతకీ అబ్బాయిని అరేంజ్ చేశారా?" అనడిగాడు ఆనందరావు.

"అబ్బాయేంటి? అరేంజ్ చెయ్యడమేంటి?" సహజంగానే ఆశ్చర్యపోయాడు మాధవరావు.

"అదే నాన్నా... అబ్బాయితో శోభనం అన్నారుగా! ఆ అబ్బాయి...?" సిగ్గటిల్లిపోతూ చెప్పాడు ఆనందరావు.

మొగుడూ పెళ్లాలిద్దరికీ మళ్లీపోయింది మతి.

"అంటే- నువ్వింకా అలాగే అనుకుంటున్నావా? రేపు నీకు జరగబోయే శోభనం అబ్బాయితో అనుకుంటున్నావా?" మాధవరావు నోరు వెళ్లబెట్టాడు.

"కాదా?" ఆనందరావు ముఖం నిండా నిరాశ ఆవరించుకుంది.

"అబ్బాయితో శోభనం ఏంట్రా మతిలేకుండా. నువ్వే ఒక అబ్బాయివైతేనూ..." నెత్తి బాదుకుంది సావిత్రి.

"కానీ, నాకలా అనిపించటం లేదమ్మా... శోభనం అబ్బాయితో అయితేనే బావుంటుందనిపిస్తోంది." గోళ్లు కొరుక్కుంటూ సిగ్గుగా చెప్పాడు ఆనందరావు.

"ఏంటండీ వీడు మళ్లీ మొదటికొచ్చినట్టున్నాడు? ఇలాగైతే ఎలా?" ఏడ్చేస్తూ అంది సావిత్రి.

"నిద్రమాత్రలు మింగాడుగా! రాత్రంతా గాఢంగా నిద్రపోతే తెల్లారేసరికల్లా బాగైపోతాడని చెప్పాళ్లే డాక్టరు" భార్యని ఓదారుస్తూ అన్నాడు మాధవరావు.

"డాక్టరేంటి? నాకేమయ్యిందని డాక్టర్ దగ్గరికి వెళ్లారు మీ రసలు?" ఆనందరావు ఆశ్చర్యంగా అడిగాడు.

"ఏమీ అవ్వకపోవడం ఏమిట్రా? ఆడపిల్లలా ప్రవర్తిస్తూ ఉండి..." చెంగు నోట్లో కుక్కుకుంటూ అంది సావిత్రి.

"అవును కదూ!" నాది లేడీ మనస్తత్వం అయిపోయిందిగదూ! అలా అనుకుంటుంటేనూ, దుఃఖిస్తున్న తల్లిని చూస్తుంటేనూ, తనకీ దుఃఖంగా అనిపించింది ఆనందరావుకి.

అయినా ఎలాగో నిగ్రహించుకున్నాడు.

మర్నాడు తనకి అనంతలక్ష్మితో శోభనం జరగాల్సి ఉందని అతనికి తెలుస్తూనే ఉంది.

అతనేం వర్తమానాన్ని మర్చిపోలేదు. గతాన్నీ మర్చిపోలేదు.

కానీ మానసిక స్థితి మాత్రం- లేడీదే!

అనంతలక్ష్మితో శోభనం అన్న ఊహ అతనికి పులకరింతనేం కలిగించటం లేదు సరిగదా - కంపరాన్ని కలిగిస్తోంది.

"ఊర్కోమ్మా..." అన్నాడు తల్లిని ఊర డిస్తూ. తల్లి నుదుట ఉన్నబొట్టు చూస్తుంటే తనుకూడా బొట్టు పెట్టుకోవాలన్న కోరిక కలిగి - కుడిచేతి మధ్య వేలితో అతను తన నుదుటి మీద తడుముకుంటుంటే - "ఏమిట్రా?" అంది సావిత్రి.

"నా నుదురు బోసిగా ఉన్నట్టుంది బొట్టుపెట్టమ్మా..." అన్నాడు ఆనందరావు... కళ్లు పైకెత్తి.

"నువ్వేమైనా ఆడపిల్లవా? బొట్టు పెట్టుకోవడానికి?" కాస్త గదమాయింపుగా అన్నాడు మాధవరావు.

"కాదని తెలుసు నాన్నా- అయినా పెట్టుకోవాలని అనిపిస్తోంది..." నిస్సహాయంగా చూస్తూ అన్నాడు ఆనందరావు.

"ఏవండీ... పోనీ పెట్టేదా?" సావిత్రి భర్తవైపు తిరిగి అమాయకంగా అడిగింది.

"చస్ నోర్మూయ్...." భార్యను కసిరి "గట్టిగా కళ్లు మూసుకుని పడుకో... ఈ రాత్రంతా బాగా నిద్రపోతే తెల్లారేసరికి అంతా సర్దుకుంటుంది" అన్నాడు మాధవరావు - కొడుక్కేసి జాలిగా చూస్తూ.

బొట్టుపెట్టి తీరాల్సిందేనని మారాం చేస్తే తండ్రి కోప్పడతాడన్న భయంతో "సరే నాన్నా..." అనేసి మంచం మీద ఓ పక్కకు ఒత్తిగిల్లి నిద్రకుపక్రమించాడు ఆనందరావు.

"మనం పోదాం పద..." భార్యతో చెప్పి బయటికి కదిలాడు మాధవరావు.

సావిత్రి ఏదో అనబోయింది.

"ష్..." అంటూ ముక్కుమీద వేలేసుకుని... చేయి పట్టుకుని ఆమెను తనతో పాటు తీసుకెళ్లిపోయాడు మాధవరావు.

"రేపు ఏమవుతుందో ఏమో?" బయటకు వెళ్లాక మళ్లీ నోరు విప్పింది సావిత్రి.

"ఏంకాదులే - అంతా సవ్యంగా జరుగుతుంది..." అనేశాడు మాధవరావు - అంటే - నిజంగా ఆ ధీమా అతనిలో ఉండి కాదు... ఆ విషయాన్ని ఇంక అంతటితో ఆపేయదలచి - అలా అన్నాడు.

★ ★ ★

నిద్రమాత్రల ప్రభావంవల్ల ఆ రాత్రంతా గాఢంగానే నిద్రపట్టినప్పటికీ - తెల్లారినా కూడా ఆనందరావు మానసికస్థితిలో మాత్రం మార్పేంరాలేదు.

మనసునిండా ఆడ వాసన.

టూత్‌బ్రష్ మీద పేస్ట్ వేసుకుని అద్దం ముందుకి వెళ్లేసరికి బోసి నుదురు అతన్ని మళ్లీ వెక్కిరించింది. అలాగే పైటలేని వక్షస్థలం అతన్ని సిగ్గటిల్లిపోయేలా చేసింది.

చేతులు అడ్డం పెట్టుకోబోయి... అంతలోనే తాను మగాడినన్న విషయం గుర్తుకొచ్చి ఆగిపోయాడు.

అక్కడికీ మనసాగక దండెంమీదున్న ఓ టవల్ని రొమ్ముమీద కప్పుకున్నాడు ఆనందరావు.

అప్పుడు సిగ్గుకాస్త తగ్గినట్టుగా అనిపించింది. ఏంటిది?... జరిగిందంతా తెలుస్తూనే ఉన్నా ఈ ఆడ మనస్తత్వాన్ని ఎందుకని జయించలేకపోతున్నాడు తను?

ఈ రోజంతా ఇలాగే కొనసాగితే ఇంక ఈ రాత్రికి అనంతలక్ష్మితో సుఖించగలుగుతాడా తను?

ఈ రాత్రికే గదా శోభనం!

పోనీ శోభనం వద్దని మొరాయిస్తే? అమ్మా నాన్నా ఊరుకుంటారా? ఊరుకోరు... కాబట్టి ఎలాగైనా సరే ఈ మనోవైకల్యాన్ని జయించి తీరాలి...

కానీ అది తన వల్ల అవుతుందా?

అలా పరిపరివిధాల ఆలోచిస్తూనే తన కాలకృత్యాలన్నీ ముగించుకున్నాడు ఆనందరావు.

అలా అతను తన పనులన్నీ తాను చేసుకుపోతుండటంవల్ల -ఎందుకులే కదపటం అని అతని జోలికి వెళ్లలేదు అతని








అమ్మా నాన్నలు.

స్నానం ముగించి డ్రెస్ చేసుకుంటుంటే అప్పుడొచ్చాడు మాధవరావు అతని దగ్గరికి.

"మరో అరగంటలో మన ప్రయాణం... త్వరగా తయారవ్వు..." అని చెప్పాడు.

"నాకు శోభనం వద్దు నాన్నా..." అని గట్టిగా అరవాలనిపించింది ఆనందరావుకి. అయినా నిగ్రహించుకున్నాడు. ఇదే నిగ్రహశక్తితో తనలోని ఆడ మనస్తత్వాన్ని కూడా జయించాలని అనుకున్నాడు. ఆ మేరకు అతనిందాకే ఓ నిర్ణయం తీసుకున్నాడు గదా!

"నాదేం లేటులేదు నాన్నా! ఓ పావు గంటలో రెడీ అయిపోతా..." అన్నాడు ధైర్యంగా.

దాంతో అప్పుడడిగాడు మాధవరావు "ఇప్పుడెలా ఉంది? " అని.

"అయామ్ క్వయిట్ ఆల్ రైట్..." కావాలనే అబద్ధం చెప్పాడు ఆనందరావు... విల్ పవర్‌తో, నిగ్రహశక్తితో ఆడతనాన్ని జయించలేకపోతానా? అన్న ధీమాతో!

"బొట్టు పెట్టుకోవాలనీ, గాజులు వేసుకోవాలనీ అలాంటివేం అనిపించటంలేదా" ఇంకా అనుమానంగానే అడిగాడు మాధవరావు,

"లేదు..." స్థిరంగా పలికాడు ఆనందరావు.

మాధవరావు సహజంగానే సంతోషపడిపోయాడు- కొడుకు అలా అనేసరికి!

"ఏమేవ్... వీడు మళ్లీ మామూలు మనిషైపోయాడు..." అని అరుస్తూ పరుగుతీశాడు భార్య ఉన్న గదిలోకి.

కొడుకు మామూలు మనిషైపోయాడన్న ధీమాతో ఉన్న మాధవరావుకి- బస్టాండ్‌లో మళ్లీ ఏదో అనుమానం వచ్చింది.

అందుక్కారణం... కొడుకు అల్లంతదూరాన ఉన్న ఓ అందమైన అబ్బాయికేసి ఆశగా, ఆరాధనగా చూస్తూండటం!

ఆ అబ్బాయి చాలా బాగున్నాడు... అయితే మాత్రం? ఆడపిల్ల చూసినట్టు వీడు ఆ అబ్బాయికేసి ఇలా ఆశగా, ఆబగా చూడ్డం ఏమిటి?

కొంపతీసి వీడిలో మళ్లీ స్త్రీ మనస్తత్వం గాని తలెత్తిందా?

"ఏంట్రా- ఆ అబ్బాయికేసి అలా చూస్తున్నావు? " అని కంగారుగా అడిగాడు కొడుకుని.

ఆ అబ్బాయిని చూస్తుంటే మనసు వెర్రెత్తిపోతోందనీ, అతని కౌగిట్లో కరిగిపోవాలని ఆరాటంగా ఉందనీ తండ్రితో ఎలా చెప్పగలడు? అందుకే-

"ఏం లేదు నాన్నా!" అనేశాడు ఆనందరావు పొడిగా.

"ఏం లేకపోతే అతనికేసి ఎందుకలా గుడ్లప్పగించి చూస్తున్నావ్? "

"అతనేసుకున్న జీన్స్ ప్యాంట్ అచ్చం నా జీన్స్ పాంటులానే ఉంటేనూ!" నోటికి తోచిన మాట అనేశాడు ఆనందరావు.

ఆ సమాధానం ఏమంత సంతృప్తికరంగా అనిపించలేదు మాధవరావుకి. "నీ మొహం- జీన్స్‌ప్యాంట్స్ అన్నీ ఒకేలా ఉంటాయ్. నీదిలా అనిపించటం ఏమిటి? " అన్నాడు దీర్ఘం తీస్తూ.

"ఏమో!" అనేసి ముఖం తిప్పేసుకున్నాడు ఆనందరావు.

అంతలో వీళ్లు ఎక్కాల్సిన బస్ రావటంతో అటుకేసి పరుగు తీశాడు మాధవరావు.

సావిత్రి భర్తని అనుసరించగా- ఆశ చావని ఆనందరావు ఆ కుర్రాడి వైపు ఇంకొక్క సారి ప్రేమగా చూసి ఆ మీదట తనూ అమ్మానాన్నల్ని అనుసరించాడు.

వాళ్ల ప్రయాణమిపుడు వధువు వాళ్ల ఊరికి. రాత్రికి శోభనంగా, ఆనందరావుకి అనంతలక్ష్మితో!

బస్‌లో ఆనందరావు ఒక్కడే ఒక సీట్‌లో కూర్చున్నాడు. మాధవరావు, సావిత్రి ఒక సీట్లో కూర్చున్నారు.

ఆనందరావు పక్కసీటు ఖాళీగా ఉంది. బస్ కదలబోతుండగా ఓ పాతికేళ్ల కుర్రాడొచ్చి ఆనందరావు పక్కనే కూర్చున్నాడు.

ఇందాకటి కుర్రాడంత అందంగా లేకపోయినప్పటికీ ఇతను కూడా అందంగానే ఉన్నాడు.

సైడ్ యాంగిల్‌లోంచి చూస్తుంటే- 'ప్రేమదేశం' సినిమాలో అబ్బాస్‌లా ఉన్నాడు.

మనిషి ఎలా ఉంటేనేం? ఓ పాతికేళ్ల పరపురుషుడొచ్చి తన పక్కన కూర్చున్నందుకు ముందు చాలా సిగ్గుగా అనిపించింది ఆనందరావుకి.

కానీ, అతని శరీరం తన శరీరానికి తగులుతుంటే- కాసేపట్లోనే ఆ సిగ్గు కాస్తా పరవశంగా మారిపోయింది.

అబ్బ! ఎంత బావుందీ ఈ స్పర్శ!

జీవితాంతం ఇతనిలాగే తన పక్కనే కూర్చుంటే- ఆహా... ఎంత బావుంటుందీ!

అలా ఆలోచించగానే చటుక్కున విజ్ఞత మేలుకుని- "మగాడినయ్యుండి ఇలా ఆలోచిస్తున్నానేంటీ? ఛీ... తప్పు..." అనుకుని, అతన్నుండి దూరంగా జరిగి కూర్చున్నాడు.

కిటికీలోంచి బయటకు చూస్తూ- ఏదో ఆలోచిస్తూ ఉండిపోయాడు ఆనందరావు.

ఏదోకాదు- రాత్రికి జరగబోతున్న తన శోభనం గురించే! ఈ మానసిక స్థితి ఇలాగే కొనసాగితే రాత్రికి ఎలా? అన్న చింత! ఆ చింత కాసేపు అతని మనసుని కుదిపేసింది గానీ- అంతలోనే ధైర్యం తెచ్చుకున్నాడు.

మనో నిగ్రహశక్తితో ఈ స్థితిని అధిగమించాలని మరోమారు గట్టిగా నిర్ణయించుకున్నాడు.

తీరా అత్తగారింట్లో అడుగుపెట్టేసరికి ఆనందరావులోని మనో నిగ్రహశక్తికాస్తా సడలిపోయింది.

అక్కడ ఓ నలుగురు ఆడంగులు శోభనం గదిని అలంకరించడానికి కాబోలు బోలెడన్ని మల్లెపూలు ముందేసుకుని మాలలు కడుతూ కనిపించేసరికి వెళ్లి వాళ్ల మధ్యలో కూర్చోవాలని అనిపించింది అతగాడికి.

అటుకేసి, ఓ నాలుగడుగులు వెయ్యబోతుంటే "అటెక్కడికి రా? " అంటూ ఆనందరావుని ఇవతలికి లాక్కొచ్చాడు మాధవరావు.

దాంతో కాస్త తెలివి తెచ్చుకుని ఆ ఆడంగుల మధ్య కూర్చోవాలన్న కోరికని అతి కష్టమ్మీద నిగ్రహించుకున్నాడు ఆనందరావు.

"ఎందుకు బాబూ అటుకేసి వెళ్లబోయావు? అమ్మాయి కోసమా? అమ్మాయి అక్కడ లేదు... వేరే గదిలో ఉంది..." అని అత్తగారు అంటుంటే - ఓ వెర్రినవ్వు నవ్వేసి ఊరుకున్నాడు.

ఏదో ఆవిడలా అనుకున్నారేగానీ నిజానికి ఆనందరావుకి భార్యను చూడాలన్నతహతహ ఉంటేగా?

అతన్నిపుడు లేడీ మానసికస్థితాయె!

భార్యని చూడాలని ఎందుకనిపిస్తుంది? !!





ఆ సంగతి అనంతలక్ష్మి అమ్మానాన్న లకేం తెలుసు?

వాళ్ళిద్దరూ ముసిముసిగా నవ్వుకు న్నారు. అల్లుడు ఆత్రుత పడుతున్నాడు - అని అనుకుని!

అత్తవారింట్లో మర్యాదలకేం తక్కువ? సహజంగానే వీళ్ల ముగ్గురికీ అక్కడ రాచ మర్యాదలు జరిగాయి - ఆనందరావుకైతే మరీనూ!!

ఆ మర్యాదలనందుకోవటంలో పడి పోయి, మనసులో ఆడతనం పురివిప్పి నర్తిస్తున్నా కూడా, అసలు ఘడియలు వచ్చే వరకూ అభాసుపాలవ్వకుండా ఎలా గోలా నెట్టుకొచ్చాడు ఆనందరావు.

కొడుకు ధోరణి సవ్యంగానే అనిపించ డంతో అతని అమ్మానాన్నలు కూడా ఎంతో రిలీఫ్‌గా ఫీలయ్యారు.

కానీ....

తీరా అసలు ఘడియలు వచ్చేసరికి - అప్పుడు స్టార్టయిందో ప్రహసనం!

★ ★ ★

తనలో ఆడతనం పురివిప్పి నర్తిస్తున్న ప్పుడు ఏమగాడు మాత్రం శోభనానికి సిద్ధ పడగలుగుతాడు?

శోభనానికి టైం దగ్గర పడేసరికి ఆనం దరావులోని ధైర్యం అంతా సడలిపో యింది.

"నువ్వా గదిలోకి వెళ్లుబాబూ..." అని ముత్తయిదువులు శోభనం గదికి దారి చూపించగా అప్పుడు ప్రారంభమైంది అత నిలో వణుకు.

"కాసేపాగి వెళ్తాలే" అనబోయి, కాసేపా గితే మాత్రం తనలోని ఈ ఆడతనం తగ్గు తుందా అనిపించి, "ఊహూ.... నాకు శోభనం వద్దు..." అనేశాడు చటుక్కున.

అందరూ నిర్ఘాంతపోయారు - అంటే - పెళ్లికూతురు తరపువాళ్లు తాంబూలం తీసుకోవడానికి వచ్చివున్నారుగా - వాళ్లంతా!

"ఏమైంది బాబూ? ఎందుకని శోభనం వద్దంటున్నావు?" రఘుపతి గాభరాగా అడిగాడు.

"ఏంకాలా! ఇప్పుడిప్పుడే నాకు శోభనం వద్దు..."

అంతకన్నా ఎలా చెప్పలో తోచక అలా అనేశాడు ఆనందరావు.

"అదేంటిబాబూ - అలా అంటావు?" అంది కౌసల్య. వియ్యంకుడూ, వియ్యపు రాలూ అలా గాభరాపడిపోతుంటే ఆనంద రావు అమ్మా, నాన్నలు మాత్రం బెల్లం కొట్టిన రాళ్లలా ఉండిపోయారు.

"కొంప మునిగిపోయింది" అని తమ తమ మనసుల్లో అనుకుంటున్నప్పటికీ పైకి మాత్రం ఫేసులనిండా తాము అయోమ యాన్ని పులుముకుని కూర్చున్నారు.

"మీరైనా చెప్పండి బావగారూ! అబ్బాయి ఇలా అంటున్నాడేమిటి."

"ఏంటి అన్నయ్యగారూ ఇది?" అంటూ రఘుపతి, కౌసల్యలు తనకి చెరోపక్కా చేరే సరికి - అప్పుడింక నోరువిప్పక తప్పలేదు మాధవరావుకి.

"ఏమో వాడినే అడగండి" అనేశాడు - తానుగా విషయం బయటపెట్టడం ఇష్టం లేక.

దాంతో రఘుపతి "ఏంటి బాబూ ఇది? ఏమైంది నీకసలు?" అంటూ మళ్లీ అల్లుడి చెంతకు వెళ్లాడు.

అసలు విషయం ఆనందరావు మాత్రం ఎలా చెప్పుకోగలుగుతాడు? "ఏం లేదు. ఇప్పుడప్పుడే నాకు శోభనం వద్దు..." మళ్లీ ఇందాకటి పాటే పాడాడు.

"మొన్న అలా జరిగిందని చెప్పి ఇప్పు డిలా కసి తీర్చుకుంటున్నావా బాబూ? అందులో అమ్మాయి తప్పు ఏముంది చెప్పు?" మనసులో ఏదో సందేహం మెద







లగా అన్నాడు రఘుపతి - మెల్లని గొంతుతో.

"అబ్బే... అందుక్కాదు..."

"మరి?" ఆత్రంగా చూశాడు అల్లుడి దిక్కు. ఏం చెప్పాలో పాలుపోక - మళ్లీ ఇందాకటి పాటని మరొక్కసారి పాడాడు ఇబ్బందిగా ఆనందరావు.

"ఇప్పుడప్పుడే వద్దంటే అదేవన్నమాట? కారణం చెప్పందే ఎలా తెలుస్తుంది - ఎందుకు వద్దంటున్నావో? చెప్పవేం?" - కాస్త కోపంగానే అడిగాడు రఘుపతి ఈసారి.

"అవున్నాయనా! పోనీ కారణమైనా చెప్పు?" అంటూ తనూ అతని దగ్గరికొచ్చింది కౌసల్య.

పెళ్లికొడుకు శోభనం వద్దంటున్నాడన్న సంగతి అప్పటికే అందరికీ తెలిసి పోవడం వల్ల- లోపలెక్కడో ఉన్న అమ్మలక్కలందరూ ఆసరికే పోగయిపోయారక్కడ.

వాళ్లందర్నీ చూస్తుంటే అసలేకంగా మెదడే పనిచేయడం బొత్తిగా మానేసింది ఆనందరావుకి.

దాంతో అతను నోరు తెరుచుకుని ఉండిపోయాడు- ఓ బొమ్మలాగా!

అంత మాత్రానికే వదిలేస్తారా? "చెప్పు నాయనా! ఏవిటసలు కారణం?" అంటూ అమ్మలక్కల్లోంచి కూడా ముఖ్యమైన వాళ్లు ఇద్దరు ముగ్గురు ముందుకొచ్చారు.

దాంతో ఆనందరావు మరింత బిగిసిపోయాడు. కొడుకుని ఆ ఇరకాటంలోంచి ఎలాగైనా సరే బయటపడేయాలన్న ఉద్దేశంతో "ఆపాటి గ్రహించలేకపోతున్నారా? మీ అల్లుడు దేనికో అలిగినట్టున్నాడు" అంటూ తెలివిగా ఓ మాట వేసింది సావిత్రి.

"అలక ఇప్పుడేంటీ? అలక పాన్పు మీద అలగాలిగానీ...." అన్నారెవరో జనాల్లోంచి.

"ఎప్పుడైతేనేం, వాడి కోరికేంటో కనుక్కుని అది తీర్చండి ముందు..." అంటూ ఆ మాటను తిప్పికొట్టింది సావిత్రి.

"పోనీ అలాగే చేద్దాం... అదేంటో చెప్పమనండి...." అన్నాడు రఘుపతి- ఆడపిల్లని ఇచ్చుకున్నాక తప్పుతుందా? అనుకుంటూ.

ఆయన మాటల్ని అడ్వాంటేజిగా తీసుకుని- "నేను కనుక్కుని చెప్తానాగండి..." అంటూ కొడుకుని అక్కడ్నుంచి బరబరా పక్కకు లాక్కెళ్లిపోయింది సావిత్రి.

"అదేంటమ్మా అలా అన్నావు? నేనేం అలగలేదు గదా ఇప్పుడు?"

"తెలుసు. కానీ వాళ్ల ప్రశ్నకేం సమాధానం చెప్తావు? అందుకే ఇలా లాక్కొచ్చా- ఓ అబద్ధం ఎలానూ ఆడేశాగాబట్టి, దాన్నే నిజం చెయ్యి. మారుతీ కారడుగు. ఇప్పటికిప్పుడు తెచ్చివ్వలేరు గనుక శోభనం వాయిదా పడుద్ది..." అంది సావిత్రి తెలివిగా.

తల్లి అలా చెవి కొరికేసరికి ఇదేదో కాస్త బాగానే ఉన్నట్టుందే అనిపించింది ఆనందరావుకి.

కానీ, అంతలోనే వాళ్లందరూ ఏమనుకుంటారోనన్న భయం కూడా కలిగింది.

అదే అన్నాడు తల్లితో-

"అలాగైతే పోనీ శోభనానికి ఒప్పేసుకో..." అంది సావిత్రి.

"నా వల్ల కాదమ్మా! నా మనసంతా ఇపుడు ఆడతనంతో నిండిపోయింది..." అడ్డంగా తలాడిస్తూ అన్నాడు ఆనందరావు.

"మరైతే నేను చెప్పినట్టు చెయ్యి. మా వాడికి మారుతీ కారు కావాలంటా- అప్పటిదాకా 'నో శోభనం' అంటాన్నేను... నువ్ 'సై' అను..."

"సరేనమ్మా..." అనక తప్పలేదు ఆనందరావుకి.

అలా మంతనాలు ముగించి వాళ్ళిద్దరూ మళ్ళీ తిరిగొచ్చేసరికి- ఇపుడు అనంతలక్ష్మి కూడా ఉందక్కడ.

ఆమెని చూసేసరికి ఏదో భయంలాం టిది కలిగింది ఆనందరావుకి. ఆమె తన వైపే సీరియస్‌గా చూస్తుండటంతో ఆ భయం మరింత పెరిగింది.

"మా వాడికి మారుతీ కారు కావాలంట! అప్పటిదాకా 'నో శోభనం'..." సావిత్రి అనుకున్నట్టుగానే అందరి ముందూ అనౌన్స్ చేసింది.

"అడిగిన మేరకు కట్నకానుకలన్నీ సవ్యంగా ఇచ్చాక ఇపుడీ కొత్త కోరికే మిటీ? " అన్నారెవరో-

"ష్... నువ్ ఊరుకో..." అని ఆ అన్న వ్యక్తిని మందలించి "పోనీ అలాగే ఇద్దాం.... ముందైతే శోభనం కాని వ్వండి..." అన్నాడు రఘుపతి.

ఆయనంత తేలిగ్గా ఒప్పేసుకుంటాడను కోని సావిత్రి తత్తరపడిందో క్షణం.

"అదేం కుదర్దు...కారిచ్చాకే శోభనం..." అంది ఆ వెంటనే తేరుకుంటూ.

"ఇప్పటికిప్పుడెలా వస్తుంది? ఓ రెండ్రో జులు గడువివ్వండీ...కొని పారేస్తాను..." అన్నాడు రఘుపతి.

"సరే- శోభనం కూడా రెండ్రోజుల తర్వాతే చేద్దాం అయితే..." అంది సావిత్రి.

మాధవరావు అనుకోని ఈ పరిణామా నికి విస్తుపోయి చూస్తూ నిలబడ్డాడు.

"రెండ్రోజుల తర్వాత అప్పుడు మళ్ళీ ముహూర్తం ఉండొద్దూ? పోనీ మీరైనా చెప్పండి బావగారూ..." అంటూ రఘుపతి తనవైపు చూసేసరికి- అప్పుడింక నోరు తెరవక- తప్పలేదు మాధవరావుకి.

భార్య ఎందుకని ఇలా ప్రవర్తిస్తోందో అప్పటికే అర్థమైపోవటంవల్ల- "దాందే ముందీ- మళ్ళీ ముహూర్తం ఎప్పుడుంటే అప్పుడే పెట్టుకోవచ్చు.. ముందైతే ఆ కారు సంగతి చూడండి..." అనేశాడు తెలి విగా.

"మీదీ అదే మాటా? "

"అంతేగా మరి!"

"చూడబోతే ఇలా చెయ్యాలని మీరంతా కూడబలుక్కునే వచ్చినట్టుగా ఉన్నారే? " రఘుపతి కాస్త బాధగా అన్నాడు.

"ఇది మీకు ధర్మమా అన్నయ్య గారూ? ..." అంటూ కౌసల్య ఇంకా ఏదో అనబోయింది.

అంతలో ఎవ్వరూ ఊహించని విధంగా, అనంతలక్ష్మి నోరు విప్పింది... "మీకు కావల్సింది కారే కదా? "

"అవును..." అంది సావిత్రి

"మీకు? "- ఈసారి ఆనందరావు కళ్ళలోకి సూటిగా చూస్తూ అడిగింది అనంతలక్ష్మి.

ఆనందరావు చటుక్కున తలవాల్చేసు కుని 'మరే' అన్నట్టుగా తలాడించాడు.

"మీకు నాకన్నా కారే ముఖ్యమా? "

అనంతలక్ష్మి అలా అడుగుతుంటే మనసు కకావికలమైపోయింది ఆనందరా వుకి.

ఇప్పుడంటే ఏదో టెంపరరీగా తనలో లేడీ మనస్తత్వం ఏర్పడింది గానీ... నిజంగా అనంతలక్ష్మి అంటే ఎంత ఇష్టం తనకి! ఎంత ప్రేమ తనకి!!

ఈ పరిస్థితి తొలగిపోయాక అనంతల క్ష్మితో జీవితాంతం కాపురం చెయ్యాలి తను.

మరి అలాంటప్పుడు "నీ కన్నా నాకు కారే ముఖ్యం" అన్నట్టు తలాడిస్తే ఏం బావుంటుంది?

ఈవిధమైన విజ్ఞత ఆనందరావుని తల అడ్డంగా ఆడించేలా చేసింది.

"మరైతే అత్తయ్యగారు ఎందుకని అలా అంటున్నారు? " ఎంతో ధైర్యంగా అతన్ని సమీపించి అడిగింది అనంతలక్ష్మి.







ఆమె తనముందుకొచ్చి నిలబడేసరికి అప్రయత్నంగా తలపైకెత్తాడు ఆనంద రావు.

"చెప్పండి..." ఆమె అతని కళ్లల్లోకి తీక్ష ణంగా చూస్తూ అడిగింది.

దాంతో ఏదో భయంలాంటిది కలిగి "నాదేంలేదు. మా అమ్మ అలా అడగ మంది" అనేశాడు ఆనందరావు.

కొడుకు నేరాన్ని అలా తనమీదకు నెట్టే యడంతో హతాశురాలైంది సావిత్రి.

"ఏం అత్తయ్యగారు! నిజమేనా?" అంటూ ధైర్యంగా అత్తగారివైపు చూసింది అనంతలక్ష్మి.

అవునని కానీ, కాదని కానీ అనలేకపో యింది సావిత్రి. వియ్యపురాలి ఇబ్బందిని గమనించి "పోనీలేమ్మా అడిగింది ఎవరై తేనేం? కారు కొనిస్తానంటున్నాగా! ముందైతే ఈ శుభకార్యం జరిగిపోని వ్వండి..." అన్నాడు రఘుపతి.

"ఏం అల్లుడూ! ఇది నీకు సమ్మత మేనా?" అన్నాడు ఆనందరావువైపు తిరిగి.

ఇంత జరిగాక కాదని ఇప్పుడెలా అనగ లడు? 'ఊ' అనేశాడు ఆనందరావు మూలి గినట్టుగా.

దాంతో చకచకా మళ్లీ శోభనం ఏర్పాట్లు జరిగిపోయాయి.

★ ★ ★

పాల నురగలాంటి తెల్లచీరలో దేవక న్యలా ఉన్న అనంతలక్ష్మి పాల గ్లాసంది స్తుంటే- లోలోన వణికిపోతూ అందుకు న్నాడు ఆనందరావు.

అతనా గ్లాసుని నోటి దగ్గర పెట్టుకోబో తుంటే -

"అవన్నీ తర్వాత - ముందు ఈ సంగతి చెప్పండి..." అంది అనంతలక్ష్మి - ఓరగా చూస్తూ.

"ఏ... ఏ... మి... టి?" నీరసంగా అడిగాడానందరావు.

"మీరెంతో మంచివారని నమ్మి... అసలు... మీ హృదయ సౌంద ర్యాన్నిచూసే మీతో పెళ్లికి ఒప్పుకున్నాను. లేకుంటే నాకున్న పురుషద్వేషానికి నేను చచ్చినా ఎవ్వర్నీ పెళ్లి చేసుకునేదాన్ని కాను... కానీ ఏం లాభం? ఇంతలోపే నా మనసుని రగిలిపోయేలా చేశారు మీరు..." అని... ఆమె తనవేపు చూసేస రికి వెన్నులోంచి వణుకుపుట్టింది ఆనంద రావుకి.

"ఏం చేశాను?" అన్నాడు భయంగా.

"దురాశకి మీరూ అతీతులు కాదని రుజువు చేశారు! అనుకున్న ప్రకారం అన్నీ ఇచ్చాక ఇపుడు మళ్లీ మారుతీకారడగటం అన్యాయం కాదా?"

ఆమె చూపులు తనని కాలుస్తున్నట్టే అనిపించింది - పాపం ఆనందరావుకి.

"చెప్పానుగా..అది మా అమ్మ కోరికని!" అన్నాడు నసిగినట్టుగా- నంగిగా చూస్తూ.

"ఎప్పుడు చెప్పారు? చెయ్యాల్సిందంతా చేసి. బోలెడంత సీన్ క్రియేట్ అయ్యాక - అప్పుడు చెప్పారు... అసలు మీ అమ్మగా రిలో అలాంటి దురాశ ప్రవేశించినప్పుడే మీరావిడ్ని ఎందుకు ఖండించలేకపో యారు?"

"అమ్మ కదాని..."

"నో... మీరలా అంటే నేను నమ్మను. అమ్మానాన్నలకి అంతగా భయపడేవారైతే- మన పెళ్లి చూపుల్లో అంత ధైర్యంగా మాట్లాడగలిగేవారా? ఇందులో మీ స్వార్థం కూడా ఉంది... ఇది మీ అమ్మ గారు ఒక్కర్తికే పుట్టిన బుద్ధని అనిపించ టంలేదు... ఇందాక మా నాన్న అన్నట్టు మీరంతా ప్రీప్లాన్డ్‌గా ఒక మాట అనుకుని వచ్చారు... అవును కదూ?"

ఆమె మాటలు నిగ్గదీస్తున్నట్టుండేసరికి తడబడి పోయాడు ఆనందరావు.

"అహc... అహc హc..." అన్నాడు అడ్డంగా తలాడిస్తూ.

"అయితే మీకలాంటి ఆశ ఎంతమాత్రం లేదంటారా?"

"లేదు..." చెప్పాడు ఎలాగో.

"ఇప్పుడలాగే అంటారులెండి... ఎందు కంటే మానాన్న కారు కొనివ్వడానికి ఒప్పు కున్నారుగా..." క్రీగంట అదోలా చూస్తూ అంది అనంతలక్ష్మి.

"అహc... అహc... హc..." ఆనంద రావు మళ్లీ తడబడిపోయాడు.

"అదుగో... ఆ తడబాటే చెబుతోంది... మీ అసలురంగు ఏమిటో... మా నాన్న మీకు కారు కొనివ్వడు... అయినాసరే నాతో కాపురం చేస్తారా?"

"ఎ... ఎ... ఎందుకు చెయ్యనూ?" భయం భయంగా అన్నాడు ఆనందరావు.

"అలాగైతే... ఇప్పుడే బయటికెళ్లి కారు అవసరంలేదని మానాన్నతో చెప్పండి..."

"రేపు చెప్పొచ్చులే... ఇప్పుడిక్కడ్నుంచి బయటికెళ్తే ఏమన్నా అనుకుంటారు..." అన్నాడు ఆనందరావు.

అతనా మాటల్ని చాలా మామూలుగానే అన్నా అనంతలక్ష్మి వాటిని చాలా సీరియ స్గా తీసుకుంది.

"ఏం అనుకుంటారు? ఏమీ అనుకోరు! అసలు మీరెందుకిలా అంటున్నారో నేను చెప్పనా?"

"............"

"చెప్పేదా?"

"ఊc..." అనక తప్పలేదు ఆనందరా వుకి.

"ఈ రాత్రికి శోభనం కాస్తా కానిచ్చేసి మీ మోజు తీర్చేసుకుంటే - రేపు మళ్లీ కారుపాట యథావిధిగా పాడొచ్చని... యామై రైట్?"

"అహc...." అడ్డంగా తలాడించాడు ఆనందరావు.

"మీరు ఆహc అన్నా ఊహూc అన్నా

## కొత్తగాలి...

**చెరువులు**
**కళ్లలో ఆర్ద్రత ఎండదని**
**చెప్పే రుజువులు**

-ఎస్. మధుసూదనరావు,
హైద్రాబాద్

నేను మీమాటలు నమ్మను.. ఇపుడు మనకి శోభనం గనక జరిగిపోతే రేపు మీరు చెయ్యగలిగేది అదే..." పెదవి విరుస్తూ అంది అనంతలక్ష్మి.

"సరే... నీకంత నమ్మకం లేకపోతే.. నన్నిపుడేం చెయ్యమంటావో చెప్పు?..." నేలచూపులు చూస్తూ అన్నాడు ఆనంద రావు.

"తీరా నేనుచెప్పేక మీరు కాదంటే...."

"అనను.. చెప్పు..."

"ఒట్టు..." చెయ్యి చాచింది అనంత లక్ష్మి.

"ఒట్టు..." అంటూ ఆచేతిలో తనచేయి వేశాడు ఆనందరావు-కొంచెం నిదానంగా!

తన చేతిలో అతని చేయి అలాపడగానే అనంతలక్ష్మికి శరీరం పులకించింది... కానీ, ఆనందరావుకి మాత్రం అలాంటిదేం జరగలేదు.

"ఊc చెప్పు..." అన్నాడు ఆమె చేతి లోంచి తన చేతిని- తీసేసుకుంటూ!

అనంతలక్ష్మికి కాస్త బాధగా అనిపిం చింది గానీ- అంటే తన చేతిని అతనంత తేలిగ్గా వదిలేయగలిగినందుకు- అంతలోనే తమాయించుకుంది.

"తీరా నేను చెప్పిం తర్వాత మీరు బాధ పడకూడదు.."

"ఒట్టేసినా ఇంకా నమ్మకం కలగలేదా నామీద? పర్లేదు చెప్పు..." ఆమె ఏం





చెప్పబోతోందో ఊహించలేక- ఒకపక్క మనసులో భయపడుతూనే పైకి మాత్రం ధీమాగా అన్నాడు ఆనందరావు.

అనంతలక్ష్మి బాధగా ముఖాన్ని పక్కకు తిప్పేసుకుంటూ చెప్పింది... తాను చెప్పదల్చుకున్నది...

అది విని ఆనందరావు లోలోన ఆనంద పరవశుడై పోయాడు.

తాను కోరిందే వైద్యుడిస్తే- రోగి ఆనంద పడపకుండా ఎలా ఉండగలుగుతాడు?

అయినా పైకిమాత్రం ఆ ఆనందాన్ని అసలే మాత్రం కనిపించనివ్వలేదు ఆనంద రావు.

పైపెచ్చు బాధగా పెట్టాడు ముఖాన్ని.

అది చూసి "ఏంటి అలా అయిపోయారు? " అంది అనంతలక్ష్మి.

"ఏం లేదు... నువ్ చెప్పిందానికి... నేను.. సిద్ధమే..." అన్నాడు ఆనందరావు. ఆశ్చర్యంగా చూసింది.

"అంత తేలిగ్గా ఊఁ అనేస్తున్నారు! అస లింతకీ నేనేం చెప్పానో స్పష్టంగా విన్నారా మీరు? "

"వినకేం... చాలా చాలా స్పష్టంగా విన్నాను... నాలోంచి ఆ కారు కోరిక పూర్తిగా తొలగిపోయిందన్న నమ్మకం నీకు కలిగేదాకా- చిక్కేదాకా లోకం దృష్టిలోనే తప్ప- మనకి నిజంగా శోభనం జరగదు- అదేగా నువ్ చెప్పిందీ!" అన్నాడు- లోలోన 'అద్దిరబన్నా' అనుకుంటూ- పైకి మాత్రం ఎంతో గంభీరంగా.

అనంతలక్ష్మికి అసలు విషయం ఏం తెలుసు? ఆ గాంభీర్యాన్ని చూసి... 'ఆహా! ఇతనికి ఎంత నిగ్రహశక్తి! అని మనసులో అనుకుని- "సరే- అదేమాట మీద ఉండండి.. ఆ పాలు తాగేసి మీరు హాయిగా పడుకోండి. నేను కింద పక్కేసుకుని వేరేగా పడుకుంటాను..." అంటూ దిండూదుప్పటి చేతిలోకి తీసుకుంది అనంతలక్ష్మి.

"నువ్వెందుకూ కింద పడుకోవటం? నేనే పడుకుంటాలే..." అన్నాడు ఆనంద రావు.

"సరే... మీ ఇష్టం..." ఏమాత్రం మొహమాటంలేకుండా అనేసి- తనే మంచం ఎక్కేసింది అనంతలక్ష్మి.

దాంతో దిండూ, దుప్పటి అందుకోవటం ఆనందరావు వంతైంది.

"ముందు పాలు తాగండి..."

"అక్కర్లేదు... నువ్వే తాగెయ్..." అనేసి- చకచకా ఓమూలకి వెళ్లిపోయి- నేలమీద తన పడక ఏర్పాటు చేసుకున్నాడు ఆనందరావు.

పాపం- అనిపించినా, సరే చూద్దాం లెమ్మని అలాగే బిగిసిపోయింది అనంతలక్ష్మి.

ఆనందరావుకి అంతకన్నా కావాల్సింది ఏముంది? ఆమె చెప్పినట్టే హాయిగా నిద్రలోకి జారిపోయాడు.

★ ★ ★

ప్రొద్దున్న లేవగానే ఏవేవో ఆడకోరికలు మనసులో తలెత్తినా, వాటిని బలవంతంగా అణచుకుని- మామూలుగానే ఉంటూ, కాఫీ, టిఫిన్లు అయ్యాక- "మామయ్యగారూ! మాట..." అన్నాడు ఆనందరావు.

"ఏమిటి? -" కారుగోల ఇంతపొద్దున్నే మొదలు పెడతాడా ఏంటి? అనుకుంటూ కాస్త భయంగా చూశాడు రఘుపతి.

"కాస్త అలా పక్కకి వస్తారా? "

"ఎందుకూ మీరు చెప్పదల్చుకున్నదేదో ఇక్కడే చెప్పండి..." సరేలెమ్మనుకుని అక్కడే చెప్పేశాడు అనందరావు తాను చెప్పదల్చుకున్నదేమిటో-

అది డైనింగ్ రూము- ఆ సమయంలో ఇరుపక్షాల వాళ్ళూ అక్కడే ఉన్నారు.

"నాకు కారు వొద్దుగాక వొద్దు! మీరు కొనిస్తానన్నా నేను తీసుకోను..."

అనందరావు అలా అంటుంటే-

"ఒక్క రాత్రిలో వీడ్ని ఎంతగా మార్చేసిందీ ఆ అమ్మాయి!" అనుకుంది సావిత్రి లోలోన ఆశ్చర్యపడుతూ.

మాధవరావు "నీకిదేంపోయ్యేకాలంరా! ఇచ్చినా పుచ్చుకోకపోవడం ఏంటి?" అన్నట్టుగా చూశాడు కొడుక్కేసి-

అనంతలక్ష్మి 'దాట్స్ గుడ్' అన్నట్టు చూడగా-

కౌసల్య 'పర్లేదు మంచి కుర్రాడివే' అన్నట్టు చూడగా- రఘుపతి మాత్రం "అదేంటల్లుడుగారూ! అలా అంటారు? ఒకసారి ఇస్తానని కమిటయ్యాక నేను మాటతప్పను... మీరు వద్దన్నా సరే నేను ఇచ్చే తీర్తాను..." అన్నాడు అభిమానంగా చూస్తూ!

'అధ్గదీ మనిషంటే- అలా ఉండాలి!' అనుకున్నాడు మాధవరావు మనసులో!

"మీరంత ఇదిగా చెబుతుంటే కాదనేదేముంది లెండి" అనేశాడు పైకి ఎంతో లౌక్యంగా.

కానీ ఆనందరావు గమ్మునుంటేనా?

"అంతిదిగా కాదు- ఎంతిదిగా చెప్పినా సరే- నేను కారుని తీసుకునే ప్రసక్తే లేదు... అసలు ఇంకోసారి గనక 'కారు'- పేరు ఎత్తితే బావుండదంతే.... " అన్నాడు సీరియస్‌గా.

"మీరు అలా అనొద్దు అల్లుడుగారూ! నిన్న మీరు సడన్‌గా అడిగేసరికి కాస్త సంకోచించాను గానీ- నిజానికి మీ కోరిక నేను తీర్చలేందేంకాదు... మీకు ఏ మోడల్ కావాలో చెప్పండి..." అన్నాడు రఘుపతి.

"పట్టుదల విషయంలో నేనూ మీలాంటివాడినే మాంగారూ! ఒకసారి వద్దన్నాక వద్దంతే... ఈ విషయంలో ఇంక ఆర్ట్యుమెంట్లు అనవసరం..."

కొడుకు అలా అంటుంటే 'పనికిమాలిన సన్నాసి' అనిపించింది మాధవరావుకి- అయినా పైకేం అనలేకపోయాడు.

"సరే అల్లుడుగారూ! మీ ఇష్టం" అనేశాడు రఘుపతి.

కొడుకు ఒక మంచి అవకాశాన్ని చేజార్చుకున్నందుకు సావిత్రికీ బాధగానే అనిపించినా, ఆమె కూడా ఏమీ అనలేకపోయింది పైకి.

అలా ఆ కారు కోరిక్కి శాశ్వతంగా నోరు నొక్కేశాడు ఆనందరావు.




**రెం**డోరాత్రి...

ఊహించని ఉపద్రవం ఇలా ముంచుకొచ్చింది.

"మీరు మానాన్నతో అంత ఖచ్చితంగా చెప్పేశారు. కాబట్టి మీలోంచి కారు కోరిక తొలగిపోయినట్టు నేనిపుడు మనసారా నమ్ముతున్నాను... సో... ఇవ్వాల్టినుంచి మీ ఇష్టం..." అనేసింది అనంతలక్ష్మి అతనికేసి సిగ్గుగా, ప్రేమగా చూస్తూ.

అది శోభనానికి గ్రీన్‌సిగ్నల్ అని అర్థమవుతూనే ఉన్నా "అంటే?" అన్నాడు ఆనందరావు.

"అంటే... అబ్బాయిగారు.. నన్నేంచేసినా... ఏం చేసుకున్నా... మీ ఇష్టం... అని.. అర్థం..." అంది అనంతలక్ష్మి బిడియంగా.

అతను ఎగిరి గంతేస్తాడని ఆమె







ఊహించింది.

కానీ, ఆనందరావు అలాగేం చెయ్య లేదు.

మనసులో బోలెడంత గాభరా పడిపో యినా పైకి మాత్రం గాంభీర్యాన్ని నటిం చాడు ఎలాగో-

"అహc హc..." అన్నాడు అడ్డంగా తలాడిస్తూ.

"అదేంటీ?" అన్నట్టు ఆశ్చర్యంగా చూసింది అనంతలక్ష్మి.

"అవును అనంతా! ఒక్కరోజుకే నీలో నామీద అంత నమ్మకం ఏర్పడిపోవటం ఏం బావులేదు..." మాటలకోసం వెతు క్కుంటూ అన్నాడు ఆనందరావు.

"అదేంటండీ అలా అంటున్నారు? పొద్దున్న మానాన్నతో మీరంత స్పష్టంగా చెప్పాకా ఇంకా మీమీద నాకు అనుమానం ఎందుకుంటుందీ?" అంది అనంతలక్ష్మి... అలా అంటున్నప్పుడామె కంఠంలో ఒకింత గాభరా తొంగిచూసింది.

"నువ్ మంచి దానివి కాబట్టి ఇంత త్వరగా అలా అనుకోగలుగుతున్నావ్.. కానీ, ఒకవేళ నేను చెడ్డవాడినై రేపో మాపో మళ్లీ అదే కోరిక కోరితే? సో.. ఇంకా కొన్నాళ్లదాకా మనకి శోభనం అన్న ప్రసక్తేలేదు..." అన్నాడు ఆనందరావు స్థిరంగా.

"కొన్నాళ్లంటే? ఎన్నాళ్లు?"

"నా మనసులో ఇంకా ఏ మూలనో ఆ కోరిక- ఐమీన్ కారు కోరిక మెదుల్తూనే ఉంది. అది పూర్తిగా చచ్చిపోయిందని నాకు అనిపించిననాడు, అప్పుడు నేనే చెబుతాలే..." అని అతితెలివిగా అనేసి, మరోమాటకు ఆమెకు ఆస్కారం ఇవ్వ కుండా దిండూ, దుప్పటీ తీసుకుని చకచకా అక్కడ్నుంచి వెళ్లిపోయాడు ఆనందరావు.

అతని ప్రవర్తనా, మాటలూ చాలా అస హజంగా అనిపించాయి అనంతలక్ష్మికి.

"నిన్నటి కోపాన్ని దృష్టిలో పెట్టుకుని ఇతనుగాని ఇలా అంటున్నాడా?" అనిపించి-

తనూ అతని వెంటే వెళ్లిందామె.

అది చూసి... "ప్లీజ్ అనంతా! వద్దు... నామాట విను... నాలోంచి ఆకారు కోరిక(ఈ ఆడమనస్తత్వం) పూర్తిగా తొల గిపోయాక నాఅంతట నేనే నీకు దగ్గరవు తానంటున్నాగా!" అంటూ ముఖం తిప్పే సుకున్నాడు ఆనందరావు.

"నిన్న జరిగిన దానికి నామీద కోపం వచ్చిందా?"

"అదేంకాదు... నేను మనస్ఫూర్తిగానే అంటున్నాను ఈ మాటలు! పొద్దున్న మీ నాన్నగారితో చెబుతుంటే విన్నావుగా- నేను మాటంటేమాటే! నాకుగా నేను చెప్పే వరకూ ఇకనుంచి మనం ఇంతే..." ముఖం మళ్లీ తిప్పేసుకుంటూ అన్నాడు ఆనందరావు.

ఏం అనేందుకూ నోరు పెగల్లేదు అనం తలక్ష్మికి.

అతని మాటల్ని ఎలా జీర్ణం చేసుకో వాలో కూడా అర్థం కాలేదు.

ఎంతైనా స్త్రీ కదా!!

"మీకు అక్కర్లేకపోయినా శోభనం నాకు కావాలి!" అని ఎలా చెప్పగలదు!

"సరే మీ ఇష్టం" అనేసి చిన్నబోయిన ముఖంతో మళ్లీ తన మంచం దగ్గరికి వెళ్లిపోయిందామె.

ఆనందరావు ఆడమనసు హాయిగా నిట్టూర్చింది.

★ ★ ★

మూడో రేయి కూడా అలాగే తెల్లవారి పోయాక- నాలుగోనాడు భర్తతో పాటు అత్తవారింటికి ప్రయాణమైంది అనంత లక్ష్మి.

అనుకున్నట్టుగా అభా సేమీ జరగకపో యేసరికి 'శోభనంగదిలో ఎవ్రీ థింగ్

ఈజ్ ఓకేనేమో అనుకున్నారు అతని అమ్మా నాన్నలు.

కానీ! తీరా ఇంటికొచ్చాక-

కొడుకుని ఒంటరిగా దొరకబుచ్చుకుని తరచి తరచి ప్రశ్నించిన మీదట-

అప్పుడు తెలిసొచ్చింది వాళ్లకి.

శోభనం గదిలో అసలేమీ జరగలేదని-

"అయితే నీలో ఆ లేడీ మనస్తత్వం ఇంకా అలాగే ఉందేమిట్రా?" అన్నారు ఆశ్చర్యంగా.

"అవును... చీరకట్టుకోవాలనీ, గాజులేసుకోవాలనీ, బొట్టూ, పువ్వులూ పెట్టుకోవాలనీ- ఎంతో ఆరాటంగా ఉంది... అయినా మన పరువు పోకూడదని ఎంతో కష్టం మీద నిగ్రహించుకుంటూ వచ్చాను..." అన్నాడు ఆనందరావు ఎంతో బాధగా.

"మరైతే ఇప్పుడెలారా?" అంది సావిత్రి నెత్తిమీద దబాదబా బాదుకుంటూ!

"ఈ మూడురోజులూ అంటే ఎలాగోలా ఉగ్గబట్టుకున్నావు. కానీ రేపోమాపో నీ పరిస్థితి ఆ అమ్మాయికి అర్థమైపోతే ప్రమాదం గదా..." అన్నాడు మాధవరావు.

"వాడితో అంటే ఏం లాభమండీ? ఏం చెయ్యాలో మీరే ఆలోచించండి..." బాధగా అంది సావిత్రి.

మాధవరావు మనసులో డాక్టర్ పవన్ మాటలు చటుక్కున మదిలాయి.

"వీడినొకసారి ఆ డాక్టర్ దగ్గరకి తీసుకెళ్తాను..." అన్నారాయన భార్యతో

"అయితే ఆలస్యం దేనికి? వెంటనే బయల్దేరండి..."

ఆ ప్రకారంగా తండ్రీ కొడుకులిద్దరూ తయారవుతుంటే-

"ఎక్కడికండీ వాళ్లిద్దరూ వెళుతున్నారు?" అని అత్తగార్ని అడిగింది అనంతలక్ష్మి.

"మగాళ్లు బయటికి వెళుతున్నప్పుడు అలా ఎక్కడికీ? ఏమిటీ? అని అడక్కూడదు లక్ష్మీ..." అంది సావిత్రి- ఏమి చెప్పాలో తెలియక.

"అడిగితే ఏమవుతుంది?" పాపం నిజంగానే అమాయకంగా అడిగింది అనంత లక్ష్మి.

"వెళ్లిన పని జరగదు..." లోలోన విసుక్కుంటునే అయినా శాంతంగా చెప్పింది సావిత్రి.

"ఎందుకని?"

"ఏమో- పెద్దలు అలా అంటారు."

గాడిద గుడ్డేంకాదూ? అందామనుకుని ఆగిపోయింది అనంతలక్ష్మి- అత్తింట కాలు పెట్టిన నాడే పెద్దపెద్ద మాటలు ఎందుకు లెమ్మని!

తన భర్త, అత్త, మామలు ఏవో మంతనాలు ఆడ్డం తను గమనించినందునే అసలలా ఆరా తీయబోయింది- ఆ కొత్త కోడలు!

కానీ, అత్తగారు ఆ టాపిక్‌ని అలా కట్ చేసేసరికి దాన్నింక పొడిగించలేకపోయింది.

అయితే, మనసులో మాత్రం ఏమూలనో ఏదో సందేహం లాంటిది మెదుల్తూనే ఉండిపోయింది.

★ ★ ★

బ్యాడ్ లక్...

తండ్రీ కొడుకులు వెళ్లేసరికి డాక్టర్

**కొత్తగాలి...**

**ఒక్క రాత్రి సుఖానికి**
**[illegible]**
**ఒక జీవితం స్త్రీ పొందుటకు**
**లక్షలు తీసుకునేవాడు 'మొగుడు'**

-అయినాల కనకరత్నాచారి,
కొరిశపాడు, ప్రకాశం జిల్లా



పవన్ అందుబాటులో లేడు.

పనిమీద ముంబయి వెళ్లాడనీ, పదిహే నురోజుల తర్వాతగానీ రాడని- మూర్తి చెప్పగా ఉసూరుమన్నారు వాళ్లిద్దరూ.

పదిహేనురోజులపాటు ఈ గండం గడి చేదెలా అని మాధవరావు ఆందోళన చెందాడు. ఇంటికొస్తుండగా... "పోనీ ఇంకో డాక్టర్ ఎవరి దగ్గరకైనా వెళ్తే?" అన్నాడు ఆనందరావు.

ఎందుకంటే అతనికీ ఆరాటంగానే ఉంది- ఎంతటెంతటట ఈ ప్రమాదకర పరిస్థితి లోంచి బయటపడిపోతానా- అని.

అయితే మాధవరావు మట్టుకు ఆ ప్రతిపాదనను ఒప్పుకోలేదు.

"అతనంటే తెలిసినవాడు... ఫ్రెండు కొడుకు... అదీగాక ఇప్పటికే నీ గురించి ఓ అవగాహన ఏర్పడినవాడు... ఇంకో డాక్టర్ దగ్గరకెళ్తే- ఆయన్తో ఇదంతా ఏమని చెప్పుకుంటాం? బట్టబయలైపోతుంది! ఈ పదిహేను రోజులూ ఎలాగోలా ఓర్చుకో... ముఖ్యంగా ఆ అమ్మాయి చూస్తుండగా ఆడంగి చేష్టలేం చెయ్యకుండా నిన్ను నువ్ కంట్రోల్ చేసుకో..." అనేశాడాయన.

అదీ నిజమేలే అనుకుని... "సరే..."- అంటూ తలాడించాడు ఆనందరావు.

రెండు వారాలే గదా! ఈ మూడ్రోజులూ ఉన్నట్టే- కాస్త జాగ్రత్తగా ఉంటే సరిపోతుందిలే అనుకున్నాడు కానీ, ప్రమాదాలు చెప్పి ముంచుకొస్తాయా?

ఇంటికెళ్లిన ఓ గంటసేపటి వరకూ బాగానే ఉన్నాడు ఆనందరావు.

ఆ తర్వాతే జరిగిపోయింది ఒక అనర్థం.

టీవీలో వనితల కోసం ప్రత్యేకంగా 'రుచీ పచీ' వంటల కార్యక్రమం ఏదో వస్తుంటే- తనకు తెలియకుండానే ఆ కార్యక్రమాన్ని తదేక దీక్షగా చూడసాగాడు ఆనందరావు.

యధాలాపంగా ఆనందరావు వంక చూసిన అనంతలక్ష్మికది చాలా విస్మయంగా తోచింది.

తనలాంటి పడుచు పెళ్లాన్ని పక్కనుంచుకుని తనతో ఏవైనా స్వీట్ నథింగ్స్ చెప్పడానికి బదులు అతనలా టీవీలో లీనమైపోవడం... దట్టూ వంటల కార్యక్రమంలో... ఆమెకి వింతన్నర వింతలా తోచింది. "అదేంటండీ? అంత దీక్షగా చూస్తున్నారు? మీకు వంట చెయ్యడంలో అనుభవం ఉందా? ఏమిటి?" అనడిగింది తమాషాగా.

"లేదు" అన్నాడు ఆనందరావు టీవీ మీంచి దృష్టి మరల్చకుండానే.

"మరెందుకని ఆ ప్రోగ్రాంని అంత పర్టిక్యులర్‌గా చూస్తున్నారు?"

"వంట చెయ్యడం నేర్చుకుందామని..."

"ఎందుకు వంట నేర్చుకోవడం?"

"చెయ్యడానికి!"

"ఇంట్లో నేనూ అత్తయ్యగారూ ఉండగా మీతో వంట చెయ్యనిస్తామా?"

ఒక పక్క ఆ ప్రోగ్రాం చూస్తూనే సమాధానా లిస్తున్నందున తను చాలా జాగ్రత్తగా ఉండాలన్న విషయం మర్చేపోయాడు ఆనందరావు.

"అయితేనేం? నాకు మాత్రం వంట రావద్దా? నాది మాత్రం అడజన్మకాదా?" అనేశాడు ఏమరుపాటున.

"ఏవన్నారూ? !!" నిర్ఘాంతపోతూ అంది అనంతలక్ష్మి పెద్దగా.

"నాది మాత్రం ఆడ..." అని- ఒంటి మీదకు స్పృహొచ్చి... అప్పుడు నాలుక కరుచుకున్నాడు ఆనందరావు.

"మీది ఆడజన్మా? !" ఇంకా అలాగే చకితురాలవుతూ- ఆశ్చర్యంనుంచి తేరుకోలేక- అతనికేసి అనుమానంగా చూసింది అనంతలక్ష్మి.

"అహాc... అహcహc... అహc..." తడబడిపోయాడు ఆనందరావు.

ఆ తడబాటు అనంతలక్ష్మిలోని అనుమానాన్ని రెట్టింపు చేసింది. "మగవాళ్లెవ్వరూ 'నాది ఆడజన్మ' అని పొరపాట్న కూడా అనరు, అనలేరు. అలాంటిది మీరలా అనగలిగారూ అంటే నాకేదో అనుమానంగా ఉంది... చెప్పండి... ఏంటి దీని వెనుకున్న నిజం..." అంది నిగ్గదీస్తూ.

'ఎంత పొరపాటైపోయింది భగవంతుడా ఇప్పుడేది దారి?' అనుకున్న ఆనందరావు "ఎబ్బే... ఊర్కే అన్నా..." అన్నాడో వెర్రి నవ్వు నవ్వుతూ.

"ఊర్కే అలాంటి మాటలు అంటారా ఎవరైనా?"

"తమాషాకి...నిన్ను నవ్వించటానికి..." బుకాయించబోయాడు.

అయినా అతని పప్పులు ఉడకలేదు.

"తమాషాకైతే మాత్రం అంత అధ్వాన్నంగా మాట్లాడుతారా ఎవరైనా? నిజం చెప్పండి... మీలో ఆడంగితనం ఉంది కదూ?" అని డైరెక్ట్‌గా అడిగేసింది అనంతలక్ష్మి.

ఆమె అంత డైరెక్ట్‌గా అలా అడిగేసరికి బుర్ర గిర్రున తిరిగిపోయింది ఆనందరావుకి.

బుర్ర అలా గిర్రు గిర్రున తిరిగిపోతున్నప్పుడు మెదడేం పనిచేస్తుంది?

"అబ్బే... ఆడంగితనం కాదు... లేడీ మానసిక స్థితి... అది కూడా ఈ మధ్యనే వచ్చింది- అదైనా మునిశాపంవల్ల..." అనేశాడు కంగారుగా.

అవి పిచ్చి మాటలు కావని ఎవరు మాత్రం అనుకోగలుగుతారు?

"ఇవి కూడా హాస్యానికంటున్న మాటలేనా?" అనడిగింది అనంతలక్ష్మి- మనసులో ఓ అనుమానం బలపడి పోతుండగా.

## కొత్తగాలి...

**శస్త్రం లేకుండానే**
**మనసుకు గాయం**
**ప్రేమవల్ల**

—అనూరాధ రామకృష్ణ,
వాకర్స్‌రోడ్, నెల్లూరు

"కాదు... నిజంగానే మునిశాపం... అందుకే నాకీ ఆడమనస్తత్వం వచ్చింది" నిజం చెబుతున్నాననుకున్నాడే తప్ప, ఆమె దృష్టిలో తానొక పిచ్చివాడినైపోతూ ఉన్నానని గ్రహించలేకపోయాడు ఆనందరావు.

అనంతలక్ష్మికి తన పెళ్లి చూపుల్లో జరిగినదంతా సినిమాలా గుర్తుకొచ్చింది.

నాన్న అనుమానం నిజమేనన్నమాట.

అయితే ఇతనికి నిజంగానే పిచ్చి ఉందన్న మాట!!

మెడికల్ చెక్ అప్ అనేసరికి వీళ్ల నాన్న అంతగా మండిపడింది ఇందుకేనన్న మాట!

హే భగవాన్! ఎంత అన్యాయం జరిగిపోయింది.

ఇతనిలాంటి వాడని తెలీక, నిజపిచ్చివాడని తెలీక కొరివితో తలగోక్కున్నట్టు- ఏరి కోరి ఇతన్ని చేసుకుంది తను! తనెంత పిచ్చిది... ఛా....

ఈ పిచ్చివాడితో ఎలా కాపురం చెయ్యడం?! ఓరి దేవుడోయ్ నా బ్రతుకు నాశనమైపోయింది...

అలా అనుకుంటుంటే దుఃఖం ఎగదన్ను కొచ్చేసింది ఆమెలోంచి.

అంతే!

"నా బతుకు బండలైపోయిందిరా దేవుడా!" అంటూ పెద్ద పెట్టున ఏడ్చే







యటం ప్రారంభించిందామె.

కొత్త దంపతుల మధ్య తామెందుకులె మ్మని అంతవరకూ వేరేగదిలో ఉన్న ఆనందరావు అమ్మా నాన్నలు ఆ ఏడుపు విని పరుగెత్తుకుంటూ వచ్చారు. అక్క డికి... వచ్చి-

"ఏమైందమ్మా... ఏమైందిరా అబ్బాయ్?" అనడిగారు గాభరాగా. ఇద్దరూ ఒకేసారి.

"చెయ్యాల్సిందంతా చేసేసి... ఏమైందని అడుగుతున్నారా? మీ అబ్బాయికి పిచ్చన్న విషయం చెప్పకుండా నా గొంతు కోస్తారా?" అంది అనంతలక్ష్మి, ఇంకా ఏడుస్తూనే.

"అదేంటమ్మా అలా అంటావ్? అది పిచ్చి కాదమ్మా"

'భ్రమానందం' అని పెళ్లిచూపులప్పుడే చెప్పేనుగా! అన్నాడు మాధవరావు బింకంగా.

"లేదు... మీ అబ్బాయికి పిచ్చే! తనది ఆడజన్మ అంటున్నాడు. అదేమంటే! ముని శాపం అంటున్నాడు. ఇలాంటి మాటలు మంచివాళ్లు మాట్లాడ్తారా? ఎక్కడైనా ఇలా మాట్లాడేవాళ్లని పిచ్చివాళ్లనే అంటారు..." ముక్కు చీది జుట్టు పీక్కుంటూ అంది అనంతలక్ష్మి.

తనయుడు కొంప ముంచేశాడని అర్థమై పోయి... "అసలేం జరిగిందో కాస్త వివ రంగా చెప్పమ్మా..." అన్నాడు మాధవ రావు అదే బింకంతో!

"చెబితే...?!"

"నీకు అసలు విషయం చెబుతాను..."

మాధవరావు అలా అనేసరికి ఆ అసలు విషయం ఏంటో తేల్చేసుకోవాలన్న ఉద్దే శంతో ఇంకేం ప్రశ్నించకుండా జరిగిం దంతా వివరంగా చెప్పుకొచ్చింది అనంత లక్ష్మి.

ఇంత జరిగాక ఇంక కోడలి వద్ద ఏవి షయం దాచినా అది మరింత అనర్థానికి దారి తీస్తుందనిపించి...

"నువ్ చెప్పడం అయ్యిందిగా! ఇంక నేను చెబుతాను వినమ్మా..." అని ప్రారం భించి ఏదీ దాచకుండా జరిగిందంతా తానూ వివరంగా చెప్పుకొచ్చాడు మాధవ రావు.

ఆ పెద్దమనిషి అబద్ధం ఆడ్డంలేదని గ్రహించి...

"మరైతే ఇప్పుడేం చెయ్యాలనుకుంటు న్నారు మీ అబ్బాయిని?" అనడిగింది అనంతలక్ష్మి కళ్లు తుడుచుకుంటూ.

"డాక్టర్ పవన్ వచ్చేదాకా వీడిలో మార్పు రావడం కష్టం అమ్మా..." అన్నాడు మాధవరావు సిన్సియర్‌గానే.

"ఆ డాక్టర్ మాత్రం ఈయన్ని బాగుచె య్యగలడని ఎలా అనుకుంటున్నారు? ఒక వేళ ఈ స్థితినుండి ఈయనింక బయటప డకపోతే నా బతుకు నాశనం అయిపోయి నట్టేగా?" మళ్లీ దుఃఖం ముంచుకు రాగా ఏడ్చేస్తూ అంది అనంతలక్ష్మి.

"నయంకాదని ఎందుకనుకోవాలి? అలా అశుభం పలక్కు తల్లీ..." అంది సావిత్రి కోడలి భుజంమీద చెయ్యేసి అనున యిస్తూ.

"నయం అవుతుందని మాత్రం ఎందుక నుకోవాలి?" దుఃఖాన్నే ధైర్యంగా మార్చు కుని ఎదురుప్రశ్న వేసింది అనంతలక్ష్మి.

"అలా అనకమ్మా. తప్పకుండా నయమ వుద్ది! ఎందుకంటే డాక్టర్ పవన్ సైకియా ట్రిస్ట్ మాత్రమే కాదు హిప్నాటిస్ట్ కూడా. అంచేత ఏదో ఒకరకంగా వీడ్ని బాగు చెయ్యగలుగుతాడు..." ధైర్యం చెబుతూ అన్నాడు మాధవరావు.

"సరే... రెండువారాల్లోగా మీ అబ్బాయి మామూలు మనిషి అయితే ఓకే, లేదంటే నేను మా పుట్టింటికి వెళ్లిపోతాను..." అనేసి చరచరా అక్కడ్నుంచి వెళ్లిపోయింది

అనంతలక్ష్మి.

బెల్లంకొట్టిన రాయిలా కూర్చుని ఉన్న కొడుకువంక దిగులుగా చూశారు మాధవ రావు, సావిత్రి.




'ముత్యమంతా పసుపు
ముఖమంత చాయ,
ముత్తయిదు కుంకుమ
బతుకంత చాయ...'

ఆదమరచి నిద్రపోతున్న అనంతలక్ష్మి చెవిని అలవోకగా తాకిందో స్వరం.

అటు నుంచి ఇటు సాగింది.

'ముద్దు మురిపాలొలుకు ముంగిళ్లలోనా
మూడు పువ్వులు
ఆరు కాయల్లు కాయ...

ఇటు నుంచి అటు పొర్లింది.

'ఆరనైదో తనము ఏ ఇంట నుండు...'

ఈసారి పొర్లడం మానేసి కళ్లు తెరి చింది. 'ఈ పాట పాడింది. పి. సుశీ లమ్మనుకుంటానే! ఎస్పీ బాలు ఎప్పుడు పాడాడబ్బా?' అనుకుంది అనంతలక్ష్మి.

'తీరైన సంపదా ఎవరింటనుండూ...'

"ఊహుఁ... ఇది బాలు గొంతు కూడా కాదు..." బెడ్‌మీద లేచి కూర్చుంది.

'తీరైన సంపదా ఎవరింటనుండు...'

లైన్ రిపీటైంది.

ఇదేదో తనకు బాగా అలవాటయిన గొంతే...! అనుకుంటూ అనంతలక్ష్మి మంచం దిగింది. పాట బయటి నుండి వినిపిస్తుండటంతో మెయిన్‌డోర్ వైపు నడి చింది.

ఆ తెల్లవారుఝామున చలిలో... ఎడం చేతిలో ముగ్గుగిన్నె పట్టుకుని... కళ్లాపు చల్లిన నేలమీద గొంతుక్కూర్చుని ముద్దుగా పెట్టిన చుక్కల్ని కుడిచేత్తో ముచ్చటగా కలుపుతూ కూనిరాగం తీస్తు న్నాడు ఆనందరావు.

అవాక్కయిపోయింది అనంతలక్ష్మి. "దినదినము ముగ్గున్న లోగిళ్ల నుండు... ముత్యమంతా... పసుపు."

"యాఁవండీ..."

అనంతలక్ష్మి వేసిన గావుకేకతో ఉలిక్కి పడిన ఆనందరావు గొంతుకు పాట అడ్డు పడింది. చెయ్యి వణకడంతో ముగ్గుగిన్నె దబ్బున కిందపడింది.

"అబ్బ... ఎవరో అనుకున్నా..." అంటూ తనవీపు మీద తనే తట్టుకు న్నాడు.

ముందుకంటే అతనిలో స్త్రీ మనస్తత్వం మరింత ముదిరింది.

"ముందు మీరు లోపలికి నడవండి..." తొందర చేసింది అనంతలక్ష్మి- సందు మొగసాల్లోంచి పనిమనిషి పద్మ రావడం గమనించి...

"ఒక్క నిముషం... ఆ నాలుగు చుక్కలు కలిపితే అయిపోతుంది..." అంటూ వయ్యారంగా వంగి ముగ్గుగిన్నె అందుకుని... ఒలికిపోయిన ముగ్గుని సుతారంగా ఎత్తబోయాడు.

ఇక లాభం లేదనుకున్న అనంత లక్ష్మి... అతని చేతిలోంచి ముగ్గుగిన్నె లాగి దూరంగా విసిరికొట్టింది.... రెక్కప ట్టుకుని లోనికి బరబర లాక్కొచ్చింది.

"మరీ ఏంటండీ...మొరటు సరసం..." ఆనందరావు మెలికలు తిరిగిపోతూ అనం తలక్ష్మికేసి సిగ్గుగా చూశాడు.







"బాగానే ఉంది సంబడం... అండీనా నన్ను... భార్యని పట్టుకుని..." అనంత లక్ష్మి విస్తుపోతూ చూసింది.

ఆనందరావు కనురెప్పలు రెపరెపలాడిస్తూ ఆమెకేసి చూసి "అదికాదండీ..." అంటూ గునిశాడు.

"నోర్ముయ్యండి... మీరు నా భర్త, నేను మీ భార్యని... మిమ్మల్ని మీరు కంట్రోల్ చేసుకోండి..." అనంతలక్ష్మి అరిచేసరికి. ఆనందరావు కళ్లలో గిర్రున నీళ్లు తిరిగాయ్.

పైట కొంగు కోసం తడుముకుని... లుంగీ అంచుతో కళ్లు తుడుచుకున్నాడు.

అట్లా తుడుచుకుంటున్నపుడు అతని మనసులో మెదిలిందో సందేహం... "తనే మిటి లుంగీలో ఉన్నాడు? ఎంత సిగ్గు చేటు! బరితెగించిన ఆడదాన్లా... లుంగీ ఏంటి లుంగీ... తను ఆడది కాదా? తనలో లేడీ మనస్తత్వం లేదా?"

అతని ఆలోచనలు పసిగట్టినదాన్లా "వెధవ ధాట్స్ మానేసి... వెళ్లి స్నానం చేసి రండి..." అంది అనంతలక్ష్మి.

గతుక్కుమని... బాత్‌రూమ్ వైపు నడిచాడు ఆనందరావు- అడుగులో అడుగు వేసుకుంటూ.

ఆనందరావు వేసిన ముగ్గు చెరిపేసి మళ్లీ పనిమనిషితో వేరే ముగ్గు వేయించాకగాని... మనసు శాంతించలేదు అనంతలక్ష్మికి.

స్వతహాగా పురుషద్వేషిణి అయిన... ఆమెకు ఈ పురుష పుంగవుడ్ని శిక్షించాలా? క్షమించాలా? అనే విషయం అర్థం కాలేదు?

జరిగిన తంతు మొత్తం గమనిస్తున్న ఆనందరావు తండ్రికి కోడల్ని ఓదార్చే ధైర్యంలేక అటూ ఇటూ గదిలోనే పచార్లు చేస్తున్నాడు.

డాక్టర్ పవన్ మెడికల్ కాన్ఫరెన్స్‌కి ముంబయి వెళ్లడంతో వచ్చింది చిక్కంతా...

ఓ పదిహేను రోజులు కేంప్ అది.

"వాడ్ని చూస్తుంటే కడుపు తరుక్కుపోతోందండీ. ఇందాక తలస్నానం చేసి బాత్‌రూంలోంచి బయటకు వచ్చాడా.... చూద్దునుగదా తలకి ఆడాళ్లలా టవల్ చుట్టుకొచ్చాడు" అంది సావిత్రి దిగులుగా భర్త వంక చూస్తూ.

ఆయన నిట్టూర్చాడు. "పదిహేను రోజుల వరకు తప్పదీ బాధ..."

"ఆ తర్వాతైనా మనబ్బాయి మామూలు మనిషవుతాడంటారాండీ?" సందేహంగా చూసింది.

"ఎందుక్కాడు... నువ్వు శుభం పలకవు కదా" చిరాకు పడ్డాడాయన.

"అమ్మాయినీ, అబ్బాయినీ... అట్లా బయటకి పంపిస్తే... కాసేపైనా ఈ పిచ్చి పనులు మర్చిపోతాడేమోనండీ... బయట మగవాళ్లని చూసి తనూ మగాడన్న విషయం స్ఫురణకొచ్చి ఆడంగి చేష్టలు తగ్గించుకుంటాడేమోనండీ..." అందామె.

ఆ ఆలోచన బాగానే వుందనిపించిందాయనకు.

ఆ సాయంత్రం అనుకున్న ప్రకారం... అనంతలక్ష్మి ఆనందరావు సినిమాకి బయలుదేరారు.

ముందు అనంతలక్ష్మి వెనకాడింది. "ఇంట్లో కాబట్టి సరిపోయిందత్తయ్యా.. బయట కూడా ఈయనిలాగే చేస్తే నా తలెక్కడ పెట్టుకోనూ?"

"నలుగుర్ని చూసి సిగ్గుపడతాడు లేమ్మా... అట్లా చెయ్యడని నా మనసు చెప్తోంది..." అన్నాడు ఆయన.

"అవునండోయ్... నా మనసు కూడా అదే చెపుతోంది..." అంది సావిత్రి సంబరంగా.

ఆనందరావు బండి తీస్తాడేమోనని

కాసేపు చూసి... అతనా ప్రయత్నం చెయ్యకుండా తన వెనకాలే నిలబడి ఉండటం చూసి పళ్లు కొరుక్కుంది. కొరికి "బండి తియ్యండి" అంది అనంతలక్ష్మి.

ఆమె గుడ్లు ఉరమడంతో విధిలేక బండి తీసాడు.

కౌంటర్‌లో టిక్కెట్లు తీసుకుని థియేటర్ లోపలకి వెళ్లారు. టికెట్ మీది నెంబర్‌తో సీట్ నెంబర్ సరిచూసుకుని కూర్చుంది అనంతలక్ష్మి. ఆమె పక్కసీట్లో కూర్చోబోతున్న ఆనందరావు... తటపటాయిస్తున్నట్టుగా ఆగిపోయాడు.

"సీటు బాగాలేదా? " అడిగింది అనంతలక్ష్మి సీటువంక వంగి చూస్తూ.

"ఊహు.. అది కాదూ..." నీళ్లు నమిలాడు ఆనందరావు. తన పక్క మనిషి వంక అదోలా చూశాడు. మళ్లీ అనంతలక్ష్మి వంక చూశాడు.

"నీళ్లు నమలొద్దు!..." ఆర్డర్ చేసి... ఆనందరావు చూపులెక్కడ పడ్డాయో గమనించింది.

ఆనందరావు సంశయానికి కారణం అర్థమైంది. పక్కసీట్లో మగవాడున్నాడు గనుక కూర్చోడానికి సంకోచిస్తున్నాడు.

"కూర్చోండి..." కఠినంగా అంది.

"మరీ... మరేమో..." మళ్లీ నీళ్లు నమిలాడు.

"నీళ్లు నమలొద్దన్నానా.. కూర్చోండి..."

ఇక తప్పదన్నట్టు తన పక్క సీట్లోని కుర్రాడికేసి బెరుగ్గా చూస్తూ కూర్చున్నాడు.

చెయిర్ హేండ్‌మీద అతని చేతికి తన చేయి తగలకుండా జాగ్రత్త తీసుకున్నాడు ఆనందరావు.

స్క్రీన్ మీద అడ్వర్టయిజ్‌మెంట్ వస్తోంది.

పక్క సీట్లో కుర్రాడు 'ఓ' అని ఆవులించి ఒళ్లు విరుచుకున్నాడు. అనుకోకుండా అతని చెయ్యి ఆనందరావు చెంపకి తగిలింది.

## కొత్తగాలి...

**ఆకాశాన్ని**
**తామే మోస్తున్నట్లు**
**తాటిచెట్లు**
**తెగ పోజుకొడుతున్నాయ్**

-మాధవీసనారా,
అనకాపల్లి

"అబ్బాయి... చేతులూ, ఒళ్లూ దగ్గర పెట్టుకో..." ఆనందరావు కుర్రాడికేసి చిరుకోపంగా చూశాడు.

"ఏంటీ? " అంది అనంతలక్ష్మి- స్క్రీన్ మీంచి కళ్లు ఆనందరావుకేసి తిప్పుతూ..

"అబ్బే ఏంలేదు. ఆ కుర్రాడు బుగ్గ గిల్లుతుంటేనూ..."

అనంతలక్ష్మి కొరకొర చూసింది.

వెంటనే ఆనందరావు బుద్ధిగా స్క్రీన్ వైపు చూశాడు.

పక్క సీట్లో కుర్రాడు.. తన పక్క సీట్లో కూర్చున్న తన ఫ్రెండ్ చెవిలో ఏదో చెప్పాడు.

ఇద్దరూ ఆనందరావుకేసి అదోలా చూసి గుంభనంగా నవ్వుకున్నారు... మళ్లీ ఏదో చెప్పుకున్నారు చెవుల్లో.

సినిమా మొదలైంది.

కుర్రాడి ఫ్రెండ్ సీటు వెనక్కివాలి చేతిని బార్లా చాపి... ఆనందరావు మెడ వెనుక భాగంమీద సుతారంగా నిమిరాడు.

ఆనందరావు చుర్రుమని చూశాడు. మళ్లీ సద్దుక్కూర్చుని సినిమా చూడటం మొదలెట్టాడు.

ఈసారా కుర్రాడు ఆనందరావు పాదం మీద- తన పాదంతో గోకాడు.







ఆనందరావు మళ్లీ చురచురమని చూసి ఏదో అనబోయినవాడల్లా అనంతలక్ష్మి "ఏంటీ" అనడంతో "ఏంలేదు" అంటూ సర్దుకున్నాడు.

ఇక వాళ్లిద్దరూ సినిమా చూడ్డం మానేశారు. ఒకడు ఆనందరావు నడుంమీద గిల్లాడు. ఇంకోడు అతని తొడమీద చెయ్యి వేశాడు.

ఆనందరావు ఓర్చుకోలేకపోతున్నాడు. ఆ కుర్రాడింకొంచెం ఫార్వర్డ్ అయి ఆనందరావు చెవిలో "వస్తావా?" అన్నాడు రహస్యంగా.

అంతవరకూ అనంతలక్ష్మి భయానికి కోపాన్ని అణుచుకున్న ఆనందరావు... ఇక సహించలేకపోయాడు.

కానీ, మళ్లీ... ఈ గలభా అంతా అవసరమా? అనుకున్నాడు. తనలోని లేడీ మనస్తత్వం పురివిప్పింది. అంతలోనే... "అక్కా... చెల్లీ... లేరా?" అంటూ తాచుపాములా లేచాడు... తను మగాడినన్న జ్ఞానమూ తెలుస్తోంది... కానీ... ఏవిటో ఆనందరావు...

"ఉన్నారు... నాకిద్దరు... వీడికి ముగ్గురు..." అన్నాడా కుర్రాడు పళ్లికిలిస్తూ.

"మరి వాళ్లతో ఇట్టాగే ఎవరైనా వెధవ్వే



షాలేస్తే... నువ్వూరుకుంటావా? "

"చెప్పుచ్చుక్కొడతా..." అన్నాడా కుర్రాడు వెటకారంగా నవ్వుతూ.

ఈలోపు ముందు వెనక సీట్లలోంచి కొందరు లేచి, వాళ్లకేసి అయోమయంగా చూస్తూ "ఏమైంది? ఏమైంది? " అంటున్నారు.

అనంతలక్ష్మి ఇబ్బంది పడిపోతూ ఆనందరావుని వారించేలోగా... అతను కాలి చెప్పు తియ్యడం ఆ కుర్రాడ్ని కొట్టడం ఒక్కసారిగా జరిగిపోయాయ్...

ఇప్పుడు గనక ఆ కుర్రాడు రెచ్చిపోయి నోరు విప్పాడంటే... వందలమందికి ఆనందరావు విషయం అవుట్ అయిపోతుంది.

అనంతలక్ష్మి వెంటనే అలర్ట్ అయింది. చుట్టూ ఉన్న వాళ్లతో "వీడు నా నడుం మీద గిల్లాడు" అందామె... ఆ కుర్రాడికేసి వేలు పెట్టి చూపుతూ.

"భర్తతో కలిసి సినిమా చూడ్డానిక్కూడా నోచుకోలేదురా మా ఆడవాళ్లు... అంత అలుసై పోయామా..." అంటూ చాచి లెంపకాయ కొట్టిందో స్త్రీ... ఆ కుర్రాడ్ని.

"తన్నండి... వెధవల్ని..." అన్నారింకొకరు.

"పోలీసుల్ని పిలవండి..." అంటున్నారిం




కొకరు. ఆ సందట్లో అనంతలక్ష్మి, ఆనంద రావు రెక్కపట్టుకుని లాక్కెళ్తూ థియేటర్ బయటకు జారుకుంది.

★ ★ ★

ఆ రాత్రంతా అనంతలక్ష్మి ఏడుస్తూనే ఉంది.

ఆనందరావుకి తన తప్పేమిటో తెలుస్తూనే ఉంది... తను మగాడు కదా... ఇదేమిటి... ఇలా జరుగుతోంది... అని అనుకుంటూనే ఉన్నాడు... అయినా తన మనసు తన మాట వినటం లేదే...

అనంతలక్ష్మితో మాట్లాడే ధైర్యం లేక చాలాసేపు మౌనంగా ఉండిపోయాడు... ఇక ఇలా జరక్కూడదు... అని ఒకటికి నాలుగుసార్లు లోపల్లోపల అనుకున్నాడు.

చివరికెలాగో గొంతు పెగుల్చుకుని "బాధపడకు అనంతా! నన్ను నేను కంట్రోల్ చేసుకోవడానికి ప్రయత్నిస్తాను..." అన్నాడు గంభీరమైన గొంతుతో.

"ప్రయత్నించటం కాదు. ఖచ్చితంగా కంట్రోల్ చేసుకోవాలి..." తీక్షణంగా చూసింది.

"అట్లాగే..."

"అట్లాగే కాదు... ప్రామిస్ చెయ్యి..."

"ప్రామిస్... సరా..."

అనంతలక్ష్మి మనసులో బెంగ మాయమైంది. "పాపం ఆ కుర్రాళ్లు వృథాగా దెబ్బలు తినుంటారు..." అనుకుంది.

మళ్లీ అంతలోనే వృథాగా ఏముందిలే... ఆనందరావుని ఏడ్పించారుగా... ఎవర్నయితే మట్టుకు ఎందుకు ఏడ్పించాలి... అనుకుంది.

ఆ తర్వాత వరసగా రెండు రోజులు ఆనందరావు... చిన్న చిన్న పొరపాట్లు చేసినా అంతలోనే దిద్దుకుని మామూలయ్యేవాడు.

డాక్టర్ పవన్ ఊర్లోకి దిగేవరకూ తనకీ తిప్పలు తప్పవు- అందాకా ఓర్పుగా ఉండాలి- అనుకున్నాడు.

"పర్లేదు... డాక్టర్ వచ్చేవరకూ ఈ మాత్రం పద్ధతిగా ఉన్నా చాలు..." అనుకుంది కొంచెం తృప్తిగా.

మూడోరోజు సాయంత్రం "అమ్మాయ్... ఎల్లుండే కదూ పండగ... ఈ గొడవలోపడి ఆ మాటే మరిచాం... మీ నాన్నగారొచ్చి పిలుస్తారేమో... ఎలాగా..." అంది సావిత్రి ఎంతో సంశయంగా.

"అందుకే అత్తయ్యా మా నాన్నగారికి ఇందాక ఫోన్ చేసొచ్చాను... మేము తిరుపతి వెళుతున్నాం... వచ్చాక మనూరు వస్తామని..."

"హమ్మ నా కోడలా... మొగుడ్ని ఎంత బాగా కడుపులో దాచుకున్నావే..." అని మనసులోనే అభినందించుకుని "షాపింగ్‌కెళ్లి రాకూడదూ" అంది.

"అట్లాగే అత్తయ్యా! మనిద్దరం వెళ్లొద్దామా?" అంది అనంతలక్ష్మి.

"ఆడంగులం ఇద్దరం వెళ్లితెస్తే... మగాళ్లకి నచ్చుతాయో లేదో... నువ్వూ, అబ్బాయ్ వెళ్లకూడదూ... వాడికీ వాళ్ల నాన్నకీ వాడు సెలెక్ట్ చేసుకుంటాడు. నాకా నేత చీరలేగా... మంచి రంగులు చూసి... పెద్ద బోర్డర్లు లేకుండా...

గద్వాల్ చీరలు నువ్వే రెండు పట్టుకురా" అంది సావిత్రి.

"అమ్మో! ఆయనతోనా..." అనుకుంది గానీ "ఏమోలే... మొన్న సినిమాహాల్లో ఇన్సిడెంట్ తర్వాత సగం మారాడు. అట్లా బయట తిరగడం మంచి ఫలితమే దక్కింది... పోనీ... షాపింగ్‌కి వెళ్లి చూద్దాం..." నిర్ణయించుకుంది.

పది నిముషాల్లో రెడీ అయి, ఆనందరావుతో షాపింగ్‌కి బయలుదేరింది అనంత లక్ష్మి.

"బండి వద్దు... అట్లా నడుచుకుంటూ వెళ్దాం..." అన్నాడు.

మామూలుగా అంటున్నాడా... అదోలా అంటున్నాడా అనుకుంటూ అనంతలక్ష్మి అతనివంక ఆరాగా చూసింది.

ఆనందరావు అప్పటికి మేన్లీగానే అన్పించాడు.

"హమ్మయ్య" అనుకుంటూ "ఓకే..." అంది.

ఇద్దరూ నడుస్తున్నారు.

కొద్దిదూరం నడిచాక- పక్కనుండి ఎవరో అనుకుంటూ వెళుతున్నారు "చక్కటి జంట" అని.

అనంతలక్ష్మి సన్నగా నవ్వుకుంది సంతోషంగా.

ఆనందరావ్ కామ్‌గా నడుస్తున్నాడు.

అనంతలక్ష్మి అప్పుడప్పుడూ అతని ముఖంకేసి చూసి"మేన్లీగానే వున్నాడు..." అనుకుంటూ తనకుతాను ధైర్యం చెప్పుకుంటోంది.

దార్లో పార్కు తగిలింది.

"కాసేపట్లా కూర్చుని వెళదాం" అన్నాడానందరావు.

అతనికేసి చూసి 'హి ఈజ్ మేన్లీ ఓన్లీ అనుకుని' "సరే పదండి..." అంది.

ఇద్దరూ పచ్చికలో ఒకరికెదురుగా ఒకరు కూర్చున్నారు.

పల్లీల కుర్రాడొస్తే పిల్చి పల్లీలు కొంది అనంతలక్ష్మి... అదీ ఇదీ మాట్లాడుకుంటూ పల్లీలు తింటున్నారు... ఆనంద రావు మగ మూడ్‌లో ఉన్నాడు.

అనంతలక్ష్మి సిగ్గు పడుతూ అతనివంక చూస్తోంది. అంతలో... ఓ పూలమ్మే అమ్మాయొచ్చి 'జాజిపూలు కావాలా?' అంది.

"మూర ఎంత?" అనంతలక్ష్మి రేటు అడిగింది.

"అయిదు రూపాయలమ్మా!" అంది ఆ పిల్ల.

"నాలుక్కివ్వకూడదూ?" అన్నాడు ఆనందరావు.

అతని మాటేదో తేడాగా అనిపించి, అతన్ని పరిశీలనగా చూసింది "నో...హి ఈజ్ మేన్లీ" అనుకుంది అనంతలక్ష్మి.

ఆ పిల్ల ఇవ్వనంది.

"సర్లే... ఓ మూడు మూరలివ్వు" అన్నాడు.

ఆ పిల్ల పూలు కొలిచి, బ్లేడ్‌తో కట్ చేసి ఇచ్చింది.

డబ్బులిచ్చి ఆ పిల్లని పంపాక...

ఆనందరావు దోసిట్లోని పూలని ముక్కు దగ్గరగా పెట్టుకుని గాఢంగా వాసన పీల్చుకున్నాడు. ఆ పూల పరిమళానికి... అతని కళ్లు తన్మయంతో అరమోడ్పులయ్యాయి. కళ్లు తెరిచి అనంతలక్ష్మికేసి గారంగా చూశాడు. "ఊ" అంటూ మత్తుగా మూలిగాడు.

ఆమె గుండె ఝుల్లుమంది. అనుమానంగా అతనికేసి చూసింది... "ఛ... ఛ... హి ఈజ్ మేన్లీ ఓన్లీ..." అనుకుంది.

ఆనందరావు పూలమాలని కుదురుగా మడుస్తుంటే మురిపెంగా అటుతిరిగి కూర్చుంది 'జడలో తురమండీ' అన్నట్టు.

ఒకటి... రెండు... మూడు... ఆరు... ఎనిమిది... క్షణాలు గడుస్తున్నాయ్





## కొత్తగాలి...

**కన్ను చిన్నదైనా**
**ప్రపంచాన్ని చూపిస్తుంది**
**కవిత చిన్నదైనా**
**హృదయాలను కదిలిస్తుంది**

*-సంగంబండ జగన్నాథరెడ్డి,*
*మక్తల్*

గాని... ఆనందరావు అటువంటి ప్రయత్నమేం చేస్తున్నట్టనిపించలేదు.

అనంతలక్ష్మి ఇటు తిరగడం.. ఆమె గుండె గుభిల్లుమనడం ఒక్కసారే జరిగాయ్.

జాజిపూల మాలని తల్లో ముడుచుకోవాలని ఆనందరావు నానా తంటాలు పడుతున్నాడు.

నిలువుగుడ్లేసుకు చూస్తున్న అనంతలక్ష్మిని "ఓ హెయిర్ పిన్నుంటే ఇవ్వు" అన్నాడు.

వీళ్లను అంతదూరం నుండి గమనిస్తున్న కొందరు అమ్మాయిలు ఘొల్లుమని నవ్వారు.

అనంతలక్ష్మి లేచి చరచర పార్కు బయటికి నడిచింది.

వెనకాలే పరుగెత్తుకొచ్చాడు ఆనందరావు.

"సారీ..." అన్నాడు గసపెడుతూ.

అదేం వినిపించుకోకుండా ఆటోని కేకేసిందామె.

"ప్లీజ్... వెళ్లిపోకు... ఒక్కక్షణం వీక్ అయ్యానంతే... అది నా తప్పుకాదు... శాప ప్రభావం... నీకు తెలిసిందేగా... కంట్రోల్ చేసుకుంటాను..." బతిమాలాడాడు.

అనంతలక్ష్మికి జాలేసింది. మౌనంగా అతని వెంట నడిచింది. ఎంతైనా తను మూర్ఛరోగినన్న సంగతి తెలిసి కూడా తనను వరించిన భర్తాయె!

శారీమందిర్‌లోకి వెళ్లారిద్దరూ.

"ముందు మీకూ, మామయ్యకూ కొందాం... జంట్స్ వేర్‌కి పదండి..." అంది.

"ఇది రేమాన్... మీటర్ ఆరొందలు... ఇది సియారామ్... మీటర్ ఐదొందలు... అది..." సేల్స్‌మేన్ ఒక్కొక్కటి తీసి చూపిస్తున్నాడు. చకచక రేట్లు కూడా చెప్పేస్తున్నాడు.

"ఏమండీ... ఈ గ్రే కలర్ బాగుంది కదూ..."

"ఆc... బాగుంది..." చెప్పాడు ఆనందరావు చుట్టూ చూస్తూ.

"దీనికి షర్టింగ్ వైట్ బాగుంటుంది..." చెప్పింది అనంతలక్ష్మి...

"నువ్వు చూస్తూ ఉండు... నేనిప్పుడే వస్తా..." అంటూ ఆనందరావు ఆ సెక్షన్ లోంచి బయటకొచ్చాడు.

"త్వరగా రండి..." అంటూ షర్టింగ్ చూడ్డంలో పడిపోయింది యధాలాపంగా.

ఆనందరావు ఒక్కడే అటూ ఇటూ తిరిగితే ప్రమాదమవుతుందని ఆ సమయంలో మరిచింది అనంతలక్ష్మి.

ఎంతసేపటికీ ఆనందరావు రాకపోవడంతో... అతని బట్టలు ప్యాక్ చేయించి మామగారికి సెలెక్షన్ చెయ్యడంలో బిజీ అయిపోయింది.

ఆ పర్చేజింగ్ అయిపోయినా ఆనందరావు జాడలేదు.

"ఏమయ్యాడబ్బా ఈయనా?" అనుకుంటూ... ఆ సెక్షన్‌కి పక్కనే ఉన్న చిల్డ్రన్స్‌వేర్‌లో వెదికింది.

పండుగ సీజన్ కావటంతో జనం విపరీతంగా ఉన్నారు.

అటూ ఇటూ చూస్తున్న అనంతలక్ష్మికి చప్పున వచ్చిందో అనుమానం.

ఒకవేళ... ఒకవేళ...

ఆమె గబగబ మెట్లు దిగింది. లేడీస్‌వే ర్‌లో అడుగుపెడుతుండగానే ఆమె అనుమానం నిజమైంది.

శారీస్ కౌంటర్ దగ్గర ఆడవాళ్ల మధ్యలో నిలబడి చీరలు సెలెక్ట్ చేస్తూ కనబడ్డాడు ఆనందరావు.

"అవి నా కోసం కొంటున్నారేమో..." ఒక్కక్షణం మురిసి ముక్కలైపోయింది... ఏం సెలెక్ట్ చేస్తాడో చూద్దామని అతనికి కనబడకుండా కాస్త దూరంలో నిలబడి గమనించటం మొదలెట్టింది.

అదే తను చేసిన పొరపాటని ఐదు నిముషాల తర్వాత తెలిసిందామెకు.

చీరలు అటూ ఇటూ తిప్పి చూస్తున్న ఆనందరావు ఉన్నట్టుండి తన పక్కన నిలబడ్డావిడవైపు ఎగాదిగా చూశాడు... ఆమె కట్టుకున్న చీరమీదే ఓ క్షణం దృష్టి నిలిపాడు. అది మంచి ఖరీదైన డిజైనర్ శారీ.

"ఎంతయిందండీ చీరె?" అడిగాడు.

ఆమె అతనివంక అదోలా చూసింది. ఒక పరాయి మగవాడు. అదీ... ముక్కుముఖం తెలియనివాడు. చీర గురించి ఆరా తియ్యడం ఎబ్బెట్టుగా అనిపించిందామెకు.

అయినా బయటపడకుండా డీసెంట్‌గా "నాలుగు వేలా రెండొందలు..." అంది.

"ఎక్కడ కొన్నారో?" అన్నాడు మళ్లీ.

"సీఎమ్మార్..." అతన్ని ఎగాదిగా చూసింది.

"క్లాతేంటో... లేజరా... షిఫానా?" అంటూ చొరవగా ఆమె పవిటకొంగు అందుకుని పరిశీలించబోయాడు. "ఫిష్ కటింగ్ చీర..." అనుకుంటూ.

అంతే- ఆమె నిప్పులు కక్కింది.

అతని చెంప ఛెళ్లుమంది.

కస్టమర్లూ... స్టాఫూ వింతగా చూశారు.

"ఇంతమందున్నా... జంకూ గొంకూ లేకుండా నా కొంగు పట్టుకుంటావా? ఎంత ధైర్యంరా నీకు?"

ఆవిడ ఆనందరావు చొక్కా పట్టుకుంది. నలుగురూ నానా మాటలు అంటున్నారు. అనంతలక్ష్మి కళ్లలో గిర్రున తిరిగాయి కన్నీళ్లు. 'సినిమా హాల్లో ఆ కుర్రాళ్లని కొట్టించిన పాపం ఇది' అనుకుంది.

పోలీసులకి ఫోన్ చెయ్యమంటున్నారు. మేనేజర్- నెంబర్ డయల్ చెయ్యబోతున్నాడు. ఇక లాభం లేదనుకున్న అనంతలక్ష్మి... ఒక్క ఉదుటున మేనేజర్ దగ్గరికెళ్లి "ప్లీజ్... అతను చెడ్డవాడు కాదు... మతిస్థిమితం లేని మనిషి..." అంది.

మేనేజర్ రిసీవర్ పెట్టేసి, శారీస్ కౌంటర్ దగ్గరి వెళ్లి ఆడవాళ్లకేదో సర్దిచెప్పి ఆనందరావుని విడిపించాడు.

బిక్కముఖం వేసుకుని తనవైపే వస్తున్న ఆనందరావుకేసి అసహ్యంగా చూసి పరుగులాంటి నడకతో షాపు బయటికొచ్చేసి... ఆటో ఎక్కి పోనీమంది అనంతలక్ష్మి.

ఆమె వెనకాలే బయటికొచ్చిన ఆనందరావు తనను ఒంటరిగా వదిలేసి వెళ్తున్న అనంతలక్ష్మికేసి విషాదంగా చూస్తుండిపోయాడు. అంతలోనే తన వింత ప్రవర్తన గుర్తుకొచ్చి 'ఛ' అనుకున్నాడు. విసుగ్గా కాలితో నేలని తన్నాడు. ఇక ఇలా కాదు. బాగా మనసుని కంట్రోల్‌లో పెట్టుకోవాలి అనుకున్నాడు.




**చూ**స్తుండగానే వారం గడిచిపో







యింది. అనంతలక్ష్మి ఆనందరావుతో బయటకు వెళ్లే సాహసం చేయలేదు.

ఎవరూ లేనప్పుడు చీరని పైటలాగా వేసుకుని అద్దంలో చూసుకోవడం, నుదుట బొట్టు పెట్టుకోవడం... గాజుల స్టాండు నుంచి గాజులు మాయం కావడం... బుంగమూతి పెట్టుకోవడం, త్రిషలాగా నాలుక బయటపెట్టి వెక్కిరించుకోవడం లాంటి చెదురు మదురు సంఘటనలు తప్ప పెద్దగా చెప్పుకోవలసిందేమీ జరగ లేదు.

అనంతలక్ష్మి మనసు కాస్త తేటప డినా... ఈ చెదురు మదురు సంఘటనలే గాలివాన కావచ్చేమోనన్న భయం మాత్రం ఆమెను వెంటాడుతూనే ఉంది.

ఆ రోజు హాల్లోంచి అత్తగారి స్వరం వినబడింది.

"అమ్మాయి అనంతా!... నీ ఫ్రెండ్ సునందొచ్చింది... ఊర్నుండి..."

బెడ్ రూంలో మొగుడి పరిస్థితి ఎలారా దేవుడా అని తల బాదుకుంటున్న అనంత లక్ష్మి గతుక్కుమంది. 'ఈ పరిస్థితిలో సునంద ఈ విషయాన్ని చూస్తే... అయినా ఇప్పుడెందుకొచ్చిందది...' అను కుంటూ 'లేదు. ఈయన విషయం సునంద పసిగట్టకూడదు..' గట్టిగా నిర్ణ యించుకుంది.

"ఎవరటా వచ్చింది? " అడిగాడు ఆనం దరావు.

సునంద అంటే దూసుకు వచ్చేస్తాడని తెలుసు అనంతలక్ష్మికి. పెళ్లిలో, పెళ్లి చూపులప్పుడు బాగా పరిచయంకదా ఇత నికి.

"డిష్ బిల్ కలెక్షన్ బాయ్ వచ్చాట్ట. మీరు టీవీ చూస్తుండండి నేనిప్పుడే వస్తాను" అంటూ బయటపడి బెడ్‌రూం తలుపులు బయటినుంచి లాక్ చేసేసింది.

ఆనందరావు సినిమా చూడ్డంలో ముని గిపోయాడు.

★ ★ ★

పలకరింపులూ, ఆప్యాయంగా కౌగలిం చుకోవడాలూ అయ్యాక, కాఫీ సిప్ చేస్తూ అడిగింది సునంద.

"మీ ఆయనేడే? "

"ఆయనా... మా ఆయనా..." తడబ డింది అనంతలక్ష్మి.

"అక్షరాలా మీ ఆయనే..." నవ్వింది సునంద.

"ఆయనా.. ఆఫీస్‌కెళ్లాడు. అదేనే కొత్తగా రియల్ ఎస్టేట్ బిజినెస్ స్టార్ట్ చేశాంగా... ఆ ఆఫీస్‌కి..."

"అవునూ... ఎప్పుడు స్టార్ట్ చేశారు? కనీసం మీ అమ్మా నాన్నల్నయినా పిలవ లేదేం..."

"ఈయన స్వంతంది కాదు... ఫ్రెండ్‌ది... అలవాటు కోసం వెళుతున్నా రంతే..." పొంతన లేని జవాబులు ఏవో చెప్పింది అనంతలక్ష్మి... ఉన్నట్టుండి తేరు కుని. "అయినా చెప్పాపెట్టకుండా ఊడిప డ్డావేంటే? ఫోనన్నా చెయ్యొచ్చుకదే వచ్చే ముందు... మా, మీ అమ్మానాన్నలెలా వున్నారు? " అంది. లోపల్లోపల కంగా రుగా ఉంది.

"ఉంటావుటే రెండ్రోరోజులు అని అన టానికి లేదు... వెళ్లిపోతావా? అని అంటే ప్రాణం తీసేస్తుంది... ఇలాంటి విషమ ప రిస్థితి కల్పించావేందయ్యా భగవంతుడా" అని మనసులో సతమతమవసాగింది.

అనంతలక్ష్మి కంగారుని పట్టించుకోని సునంద- "నేనెలా వచ్చానో చెప్పాలి కదూ. మా నాన్న మేనత్త మనవరాలు ప్రసవించింది ఈ ఊళ్లో... బారసాలకి అంతా వచ్చాం... పెద్దవాళ్లను అక్కడ ఇరి కించేసి నేనిలా ఉడాయించాను..."

"ఆహా... అలాగా...." అన్యమనస్కంగా అంటూ ఉపాయం కోసం వెదుకుతోంది

అనంతలక్ష్మి.

"మేమూ స్థలం కొనాలనుకుంటు న్నామే... ఉండటానికి కాదులే. కొనిపడేస్తే రేట్లు విపరీతంగా పెరిగినప్పుడు అమ్ముకో వచ్చు. మీ ఆయనని మా కోసం ఫ్లాట్స్ చూపించమను.."

"అట్లాగేలే... అన్నట్లు విద్యుల్లతా, సుష్మా ఎట్లా ఉన్నారే?" అంది మాట మారుస్తూ...

"బ్రహ్మాండంగా ఉన్నారు.. అసలివాళ నాతో నిన్ను చూడ్డానికి వాళ్లు కూడా రావ ల్సింది... ప్చ్... మిస్సయ్యారు..."

"బతికించారు" అనుకుంది మనసులో అనంత.

"షకీలా మాత్రం రేపొస్తానంది... ఇక్కడ దానికేదో ఆటల పోటీలున్నా యట... అట్లా వచ్చి ఇట్లా నిన్ను కలుస్తా నంది..."

"చచ్చాను..." అనుకుంది అనంతలక్ష్మి. ఎవర్నయినా మభ్యపెట్టవచ్చుగానీ- షకీలా దగ్గర సీక్రెట్ వర్కవుట్ కావు. ఆవులించకుండానే పేగులు లెక్క బెడుతుం దది.

"అవునే... అడగటం మరిచాను... మీ శోభనంరోజు 'కారో రామచంద్రా!' అంటూ గోలచేసిన మీవారు ఊరుకున్నారా? మళ్లీ కారు గోల ఎత్తలేదా?" అంది సునంద.

"లేదసలు. ఆ మాట కూడా ఎత్తరు మా ఆయన బంగారం" అంది అనంత లక్ష్మి.

"మరి ఆయన లంచ్ మాటేంటి... ఇప్పుడు వస్తారా?"

"అబ్బే... ఆయనిప్పుడు రారు... కేరేజ్ పంపిస్తా..." అని సునందతో అని "అత్తయ్యా" ఇవాల్టికి ఆయనక్కాస్త కేరేజ్ సర్దేయ్యండి మీరు..." అంటూ కేకవేసింది లోపలికి అనంతలక్ష్మి.

అత్తగారికి విషయం అర్థమై "అట్లాగే అనంతా..." అంటూ సపోర్టిచ్చింది- తెలి



## కొత్తగాలి...

**పరిచయం అనే విత్తనం నాటి**
**మమకారం అనే నీరు పోసి**
**అనురాగం అనే పువ్వుపూస్తే**
**ఆ పువ్వుపేరు నా స్నేహం**

-యు. సూర్యకుమారి,
విశాఖపట్టణం

విగా.

"ఏం మగాళ్లో... పెళ్లయి ముచ్చటగా మూణ్నాళ్లయినా కాలేదు... అప్పుడే కేరేజ్ భోజనాలూ... గాడిదగుడ్డూ... చక్కగా పెళ్లాం ఎదురుగా కూర్చుని గోరు ముద్దలు తినిపించుకోక... పనీ... పనీ... పనీ..." విసుక్కుంది సునంద.

"భోంచేద్దువుగానీ... లే..." అంది అనం తలక్ష్మి.

"యాక్... ఏం భోజనాలో... పుట్టినప్ప ట్నుంచి పొయ్యేదాకా భోజనాలే.. వెరైటీ టిఫినుంటే పెట్టు శుభ్రంగా లాగించేస్తా" అంది.

ఇద్దరూ డైనింగ్ టేబుల్ దగ్గర సెటిల య్యారు.

"ఇది ఇడ్లీ... ఇది ఉప్మా... రెండూ మిక్స్ చేస్తే వెరైటీ టిఫిన్ అవుతుంది... కలిపిపెట్టనా... విడివడిగా పెట్టనా?" అడిగింది అనంతలక్ష్మి నవ్వుతూ. పైకి నవ్వుతున్నా 'ఈ సునంద తొందరగా వెళితే బాగుండు' అని ఒకటికి నాలుగు సార్లు అనుకోసాగింది మనసులో...

"ఈ సెటైర్లన్నీ మీ ఆయన నేర్పాడేంటే నీకు?" ప్లేట్లో ఇడ్లీ వడ్డించుకుంటూ అడి గింది సునంద.

అటు తిరిగి, ఇటు తిరిగి మళ్లీ టాపిక్ 'ఆయన' మీదకు మళ్లేసరికి అనంతలక్ష్మి





ఉలిక్కిపడింది.

ఉలికిపాటును కప్పి పుచ్చుకుంటూ "అదేం లేదుగానీ... ఈమధ్య సినిమాలేం చూశావే? " అంది.

"ఒక్కటి చూస్తే ఒట్టు... ఇంతకీ నువ్వూ మీ ఆయనా ఏమేం చూశారు? "

అనంతలక్ష్మి ఏదో అనబోతుండగా విన బడింది తలుపుమీద ఎవరో దబదబ బాదుతున్న శబ్దం.

'ఇంకెవరూ... ఆయనే...' పై ప్రాణాలు పైనే పోయాయి అనంతలక్ష్మికి.

"ఎవరే లోపల? " ఇడ్లీ తుంచి అడిగింది సునంద. మేడమీది బెడ్‌రూమ్ డైనింగ్ హాల్లోకి స్పష్టంగా కనబడుతోంది.

"అబ్బే... మనింట్లో కాదా సౌండ్!" అనంతలక్ష్మి సర్ది చెప్పింది.

"సరే... చెప్పు... డాన్ కెళ్లావా? నాగా ర్జున నటన బాగుందట..." అంది సునంద.

తల అడ్డంగా ఊపింది అనంతలక్ష్మి... భయం భయంగా బెడ్‌రూమ్ తలుపు వంక చూస్తూ...

"పోనీ... మంత్ర? అనసూయ? "

"ఊహూఁ..."

మళ్లీ తలుపు తడుతున్న శబ్దం. ఈసారి మరింత పెద్దగా...

"ఆ తలుపేనే... ఎవరో తడుతు న్నారు..." సునంద అంది.

"ఊహూఁ... కాదు..." అనంతలక్ష్మికి ఏడుపు తన్నుకొస్తోంది.

"సర్లే... చూస్తే ఏం పోతుంది? నే వెళ్తానుండు..."

అనంతలక్ష్మి వారించేలోగా... సునంద మెట్లెక్కి పైకి వెళ్లింది.

పైకి వెళ్లి చెప్పింది... "ఈ తలుపే... బయట తాళం వేసింది..."

అనంతలక్ష్మి గుటకలు మింగుతూ సునందకేసి చూస్తోంది.

"అనంతా... అనంతా..." శబ్దంతో పాటూ పిలుపులు కూడా వినబడ్డంతో సునంద ఎంగిలి చేతిని చున్నీకి తుడుచు కుని- లాక్ తీసేసి తలుపు నెట్టింది.

తలుపు తెరుచుకోగానే కనబడ్డ దృశ్యం చూసి ముందు కన్‌ఫ్యూజ్ అయింది సునంద.

"హాయ్... సునందా... బావున్నావా? " అంటూ చనువుగా భుజం మీద చెయ్యేసిన ఆ ఆకారాన్ని గుర్తుపట్టటానికి ప్రయత్నం చేస్తూ- ముఖంలోకి పరిశీలనగా చూసిన సునంద... కొయ్యబారిపోయింది.

సునంద కంటే ముందే కొయ్యబారిపో యిన అనంతలక్ష్మి దగ్గర కెళ్లాడు ఆనంద రావు.

లిప్‌స్టిక్ వేసుకున్న పెదవుల్ని నాలుకతో తడిచేసుకుంటూ... ఒక్క జెర్క్‌తో ఒళ్లంతా వయ్యారంగా కదిలిస్తూ అడిగాడు ఆనందరావు-

"హన్సికలా ఉన్నానా? "

★ ★ ★

అత్తగారు ఆనందరావుని లోపలికి లాక్కెళ్లాక... సునంద ఒళ్లో తలపెట్టుకుని బావురుమంది అనంతలక్ష్మి-

మొత్తం కథంతా పూస గుచ్చేసింది.

"పురుషులంటేనే పురుగులన్నట్టుండే అనంత- పెళ్లి చేసుకోవటమే ఒక వింతైతే, కాపురం ఇట్లాకామెడీ కావడం మరోవింత" - అనిపించింది సునందకు.

స్నేహితురాలి తలమీద సుతారంగా రాస్తూ- "నయం విద్యుల్లతా, సుష్మా రాలేదు..." నిట్టూర్చింది.

"ఎవరికీ చెప్పకే..." అనంతలక్ష్మి సునంద ఒళ్లోంచి లేచి కళ్లు తుడుచు కుంది.

అనంతలక్ష్మి పడుకోవడం వల్ల నలిగిన కాటన్ పంజాబీ డ్రెస్‌ని సవరించుకుంటూ- "నేన్నీ బెస్ట్‌ఫ్రెండ్ అనుకొంటే ఇట్లా అడు





## కొత్తగాలి...

సూరీడుకీ ఉందంట
ఓ అభిసారిక
పొద్దుతిరుగుడు
అమరప్రేమిక

—వి. గీతిక, తాడేపల్లిగూడెం

గవ్. అయినా ఇదేమన్నా శుభవార్తా-టముకు వేయటానికి...”

“సారీ...నే...” నొచ్చుకుంది అనంతలక్ష్మి.

“ఇట్నోకే... ఆ డాక్టర్ మహాశయుడు వస్తేగానీ మీ ఆయన మహాశయుడు దార్లోకి రాడంటావా...”

“అవునే- ఇంకో వారం వరకూ అతన్రాడు...”

“పురుషుల్ని ద్వేషించిన పాపం నిన్నిలా వెంటాడుతుందేమోనే...” సునంద మరోసారి నిట్టూర్చింది.

“అట్లా మాటిమాటికీ నిట్టూర్చకే సునీ... నాకేదోలా ఉంది...” అనంతలక్ష్మి గొంతు జీరబోయింది.

సునంద ఏదో అనబోతున్నంతలో తల్లి మాట వినకుండా, మళ్లీ హాల్లోకి వచ్చేశాడు ఆనందరావ్.

ఈసారి మీసాలు తీసేసి ఉన్నాయి.

“ఏమే సునందా! ఏంటి విశేషాలు?” అన్నాడు అతి మామూలుగా సునంద ఎదురుగా సెటిలైపోతూ.

“ఏమండీ సునందగారు!” అనే ఆనందరావు తననిలా ఏమే సునందా... అంటుంటే గమ్మత్తుగా అనిపించింది సునందకు.

“విశేషాలా...” ఒక్క క్షణం ఆలోచించి అంది.

“ఓ ఆర్నెల్ల క్రితం అనుకుంటా... టీవీలో చూపించారు... అదేదో ఊళ్లో ఓ ఐ.జి. ఉన్నట్టుండి 'నేను రాధనోయీ... గోపాలా...' అంటూ పాడేసుకుని, ఉద్యోగానికి రిజైన్ చేసి... కృష్ణుడ్ని వెతుక్కుంటూ వెళ్లిపోయాట్ట... అన్నట్టు అతని పెళ్లాం... అతనికి విడాకులిచ్చేసింది...”

అనంతలక్ష్మి సునంద కాలు గోకి “ఊరుకో” అన్నట్టు చూసింది.

సావిత్రి... సిగ్గుతో చచ్చిపోతున్నట్టుగా సునందవైపు చూస్తూ.... “ఉత్తినే అమ్మాయ్.. చిన్నప్పుడు మాకు ఆడపిల్లల్లేరని... వీడికి గౌనూ గట్రావేసేదాన్నా... ఆ అలవాటు చొప్పున అప్పుడప్పుడూ ఇట్లా... అల్లరి చేస్తుంటాడు...” అంటూ నీళ్లు నమిలింది.

ఆమె బాధ అర్థం చేసుకున్న సునంద “నేనూ అంతే ఆంటీ ...మా అమ్మ నన్ను మగరాయుడులా పెంచిందా... అప్పుడప్పుడూ నేనూ ప్యాంటూ, షర్టూ వేసేసి ఇంట్లో చెలాయిస్తుంటా...” అంది.

సావిత్రి గిల్టీగా నవ్వి ఏదో అనబోతున్నంతలో...

“మేడమ్... డిష్ బిల్...” అంటూ కేబుల్ టీవీ కుర్రాడొచ్చాడు.

చనువుగా ఇంట్లోకొచ్చే అలవాటున్న ఆ కుర్రాడు నేరుగా హాల్లోకొచ్చాడు.

మెజంటా కలర్ క్రేప్ శారీలో... దానిమ్మ ఎరుపు లిప్‌స్టిక్ పెదాలతో... ఐలైనర్‌తో అందంగా దిద్దిన కనురెప్పల్ని రెపరెపలాడిస్తున్న - ఆనందరావుని చూసి 'ఎవరీ స్టన్నింగ్ బ్యూటీ?' అనుకున్నాడు.

ఆనందరావు ఆ కుర్రాడికేసి చిలిపిగా చూసి, ఓ చిర్నవ్వు విసరగానే... తడబడి, తట్టుకొని పడబోయి ఎలాగో నిలదొక్కుకున్నాడు.

అనంతలక్ష్మి ప్రాణం చచ్చిపోతుండగా... హడావుడిగా పరిగెత్తి- అత్తగారి

దగ్గర్నుండి అమౌంట్ కనుక్కుని తెచ్చి- ఆ కుర్రాడి చేతిలో పెట్టింది.

వాడు స్థిమితంగా రశీదు రాయబోతుంటే- "అక్కర్లేదు... మళ్లీ తీసుకుంటా... వెళ్లు..." అంది అనంతలక్ష్మి.

"లేదు మేడమ్... ఇప్పుడే ఇస్తాను... లేకపోతే మా ఓనర్ ఒప్పుకోడు..." అంటూ రశీదు రాస్తున్నంతసేపూ ఆనంద రావుకేసి దొంగచూపులు చూస్తూనే ఉన్నాడతను.

రశీదు రాసిస్తూ రహస్యంగా అడిగాడు, "మీ బంధువులమ్మాయా? ఎవరు మేడమ్ ఆవిడ? ఎన్నో ఏళ్లుగా వస్తున్నా ఎప్పుడూ చూడలేదు..."

"చెప్పాలా? " కోపంగా అడిగింది అనంతలక్ష్మి.

"నువ్వుండవే నేను చెప్తా..." సునంద కల్పించుకుని ఆ కుర్రాడితో అంది "బాలీవుడ్ హీరోయిన్ ప్రీతిజింటా లేదూ... ఆవిడ పిన్ని కూతురు స్వాతి గంటా... మా అనంత మొగుడు ఆనందరావునెక్కడో బాంబే బస్టాండ్‌లో చూసిందట... నా మొదటి సినిమాలో హీరో అతనే కావాలంటూ పట్టుపట్టి ఇట్లా వచ్చింది... సరేనా? ఇక తమరు దయచేయండి"

వాడు మరోసారి అడ్మయిరింగ్‌గా ఆనందరావుకేసి చూసి వెళ్లిపోయాడు.

"నువ్వు చేసిన పనికి... వాడెళ్లి పదిమందినీ పోగేసుకొస్తే... సిగ్గుతో చావాలి..." అనంతలక్ష్మి చిరుకోపంగా అంది.

"వస్తే... జస్ట్ ఇప్పుడే స్వాతీగంటా రిక్షాలో బాంబే వెళ్లిపోయిందని చెప్పు... లేదా మీ ఆయన్ని ఈ గెటప్‌లోనే కంటిన్యూ అయిపోనీ..." అనంతలక్ష్మికి మాత్రమే వినబడేలా అంది సునంద.

"పిల్లికి చెలగాటం.. ఎలక్కి ప్రాణసంకటం అంటే ఇదేగా..." నిష్ఠూరంగా చూసింది అనంతలక్ష్మి.

"ఇదేనేమో గాని... మనలో మాట..."

"ఏంటీ? " అంది అనంతలక్ష్మి.

అనంతలక్ష్మి చెవి దగ్గర నోరుపెట్టి గుసగుసమంది సునంద. "ఆ క్రేప్ శారీ... నీకన్నా... మీ ఆయనకే బాగా నప్పిందే... సూపర్‌గా ఉంది... ఎంత క్యూట్‌గా ఉన్నాడో... చూడూ..."

అప్పుడే లోపలికి వస్తున్న భర్తను చూసి సావిత్రి "ఏమండీ..." అంటూ విషయమంతా చెప్పి బావురుమంది.

"సరే... ఊరుకో..." అన్నారాయన.

"అటు చూడండి... వాడి అవతారం... మరీ శృతిమించిపోతోంది... నాకేమో భయంగా ఉంది... ఇంకేమన్నా మార్పులు జరుగుతాయేమోనని... అవునూ... ఆ డాక్టర్ గారొచ్చారేమో కనుక్కున్నారా? " అంది వెక్కుతూ.

"ఇప్పుడే ఫోన్ చేసి వస్తున్నానే... ముందా ఏడుపు ఆపు... రేపు ఉదయం అయిదు గంటలకల్లా వచ్చేస్తాట్ట... మనం రెడీ అయి తొమ్మిదికల్లా అక్కడుందాం... అన్నాడాయన నిబ్బరంగా.

"హమ్మయ్య" అనుకుంది సావిత్రి.

సగం బరువు దిగినట్లయ్యింది అనంతలక్ష్మికి.

"ఇక ధైర్యంగా ఉండు" అంది సునంద.

"డాక్టరొచ్చేస్తాడు... నయమైపోతుంది... ఈ నరకం నుండి అందరం బయటపడొచ్చు..." తృప్తిగా అంది అనంతలక్ష్మి.

మర్నాడు-

ఎంతటెంతట ఉదయం 9 అవుతుందా అని అందరూ ఎదురు చూశాక-

మొత్తానికి ఎలాగోలా ఆ సమయం అయింది. టెన్షన్‌లో ఉన్నప్పుడు నిదానంగా జరిగినట్టు అనిపిస్తుందే తప్ప కాలం నిజంగా స్తంభించి పోదుగదా!

ఎవరి మట్టుకు వారు టెన్షన్‌లో ఉన్నం





దువల్ల ఈసారి అందరూ కలిసే వెళ్లారు డాక్టర్ పవన్ దగ్గరికి.

డాక్టర్ పవన్ ఇల్లూ, క్లినిక్కూ ఒకటే- ముందరి రెండు గదులూ క్లినిక్... మిగ తాదంతా ఇల్లు!

విషయం తెలుసుకుని ఆనందరావుని థరోగా ఎగ్జామిన్ చేశాడు డాక్టర్ పవన్.

మానసిక వైద్యుడు కదా! ప్రశ్నల పరంపరతో ముంచెత్తాడు ఆనందరావుని.

ముని శాపం, భ్రమానందం గురించి ఆనందరావు డీటెయిల్డ్‌గా చెబుతుంటే... అతను 'వజ్రాన్ని మింగేను' అన్నప్పుడు... సడన్‌గా ఏదో స్ట్రయిక్ అయ్యింది డాక్టర్ పవన్‌కి.

"ఆ రోజు మీకు స్పేర్‌గా ఉంటుందని ఓ మాత్ర ఇచ్చాను... అది ఇంకా మీ దగ్గరే ఉందా? " అనడిగాడు మాధవరావుని.

"లేదు సార్... అది ఆరోజే ఎక్కడో పడిపోయింది..." అన్నాడు మాధవరావు గుర్తు చేసుకుంటూ!

వెంటనే డాక్టర్ పవన్‌కి విషయం అర్థమైపోయింది.

ఎంతైనా డాక్టర్ కదా!

"అదీ సంగతి... మీ వాడు ఆ రోజు భ్రమానందంలో మింగింది వజ్రాన్ని కాదు... మీరు నేలమీద పారేసుకున్న ఆ మాత్రని..." అంటూ 'యురేకా' అన్నంత సంతోషంగా- సస్పెన్స్ విడగొట్టేశాడాయన.

ముఖ్యంగా మాధవరావుకి బాగా అర్థమైపోయింది జరిగిందేమిటో-

అనంతలక్ష్మి, సావిత్రిలు ఒకింత అయోమయంగా చూస్తుంటే- వాళ్లకి సిట్యుయేషన్ అంతా ఎక్స్‌ప్లెయిన్ చేసి... ఆ మీదట డాక్టర్‌ని అడిగాడు మాధవరావు.

"అయితే నెల రోజులుదాకా మా వాడింక ఇలాగే ఉంటాడా డాక్టర్? "- అని.

"ఉంచితే ఉంటాడు" విరుగుడు మాత్ర వేస్తే మామూలుగా అయిపోతాడు..." చాలా తేలిగ్గా నవ్వేశాడు డాక్టర్ పవన్.

దాంతో ఆనందరావుతో సహా అందరి ముఖాల్లోనూ ఆనందం నిండిపోయింది.

"మరైతే లేటెందుకు డాక్టర్- వెంటనే ఇచ్చేయండి. మాత్రో, ఇంజక్షనో... ఆ విరుగుడుకి..." అన్నాడు మాధవరావు ఆ ఆనందంలోంచి ముందుగా తేరుకుని- ఆత్రంగా!

డాక్టర్‌కి అదెంత పని!

"ఇంద..." అంటూ బల్ల సొరుగులోంచి ఓ మాత్రని వెతికి తీసి- దాని మీది పేరు



చదివి- ఆనందరావు చేతికిచ్చాడు డాక్టర్ పవన్.

ఆనందరావు నవ్వుతూనే ఆ మాత్రని గుటుక్కున మింగేశాడు.

ఓ పది నిమిషాల తర్వాత-

విరుగుడు మాత్ర వల్ల మామూలుగా అయిపోయిన ఆనందరావు అనంతలక్ష్మి వైపు చిలిపిగా, ఆశగా చూస్తుంటే-

"నౌ హి ఈజ్ పర్‌ఫెక్ట్‌లీ ఆల్ రైట్! మీరింక వెళ్ళిపోవచ్చు..." అన్నాడు డాక్టర్ పవన్.

ఆ మాట కోసమే ఎదురు చూస్తున్న ఆనందరావు "రండ్రండి పోదాం... లేవండి..." అన్నాడు ఆత్రంగా.

అతని చూపు అంతా అనంతలక్ష్మి మీదే ఉంది. కళ్లతోనే అతను తన అందాన్ని జుర్రేస్తుంటే లోలోన సిగ్గు పడిపోతూనే, "మనం అప్పుడే వెళ్లడానికి వీల్లేదు..." అందామె.

అందరూ ఆమెకేసి ఆశ్చర్యంగా చూశారు.

"అదేంటి మేడమ్ అలా అంటున్నారు? అతనిప్పుడు పూర్తిగా మామూలు మనిషిగా, మగాడిగా అయిపోయాడు. మీరా



యన్ని నిర్భయంగా ఇంటికి తీసుకెళ్లొచ్చు డాక్టర్‌గా నేను చెబుతున్నాగా!" అన్నాడు డాక్టర్ పవన్ భరోసా ఇస్తున్నట్టుగా కుడి చెయ్యి ఎత్తి.

"ఆ చూపులే చెబుతున్నాయిగా, అతను మామూలు మనిషైపోయాడని-" అన్నాడు కొసమెరుపుగా!

"అది సరే డాక్టర్! మీరంటున్నది ఆయనలోంచి ఆడతనం పోవటం గురించి... కానీ మెయిన్ ప్రోబ్లమ్ ఇంకొకటి ఉందిగా!" అంది అనంతలక్ష్మి.

"ఏంటది? " అడిగాడు డాక్టర్ పవన్.

"ఏంటా? బ్రహ్మానందం... పన్లో పనిగా. అది కూడా పోయేలా చెయ్యండి... ప్లీజ్..."

ఆమె మాటలు ఆమోదయోగ్యంగానే అనిపించాయ్ అందరికీ- ముఖ్యంగా మాధవరావ్ దంపతులకి- వాళ్లూ తలలూపారు.

"అవును డాక్టర్- ఆ పనేదో చేసి పుణ్యం కట్టుకోండి" అన్నాడు మాధవరావు గబుక్కున.

"సరే" అని మరో చికిత్స చేశాడు పవన్.

అదయ్యాక-

"ఒక్క సందేహం డాక్టర్‌గారు" అన్నాడు మాధవరావు.

డాక్టర్ పవన్‌తో సహా అంతా ఆయన వైపు ఏమిటన్నట్లు చూశారు.

"స్పేర్‌గా నాకిచ్చిన మాత్ర మింగి మా వాడిలా అయిపోయి ఇంత రాద్ధాంతం చేశాడే... నేను మింగినా నా పరిస్థితీ ఇలాగే అయ్యేదా? "అన్నాడు మాధవరావు.

పవన్ బాధగా కొన్ని క్షణాలు తల దించుకున్నాడు.

"తర్వాత సారీ మాధవరావుగారూ... ఆ రోజున నా పరంగా ఓ పొరపాటు జరిగింది. మీరు వేసుకున్నది మంచి మాత్రే గాని స్పేర్‌గా ఇచ్చింది మాత్రం ఎక్స్‌పయిరీ తేదీ దాటిపోయింది. ఆ తొందరలో నేను గమనించలేదు. దాని ప్రభావమే మీ అబ్బాయిపై ఇలా పని చేసింది. మీరు వేసుకున్నా ఇలాగే అయ్యేవారేమో! ఎనీహౌ ఐ యామ్ ఎక్స్‌ట్రీమ్‌లీ సారీ... అందుకే నా పొరపాటుకు ప్రాయశ్చిత్తంగా మీ అబ్బాయి చికిత్సకు నేను పైసలేం తీసుకోదల్చుకోలేదు" అన్నాడు.




ఏడాది తర్వాత-

ఒకరోజు-

"మనకి బాబు పుడితే ఏ పేరు పెడదాం? " అని ఆనందరావుని అడిగింది అనంతలక్ష్మి.

"ఏమో! నాకేం తెల్సు? నువ్వే పెట్టు- మంచి పేరు ఏదైనా!" అన్నాడు ఆనందరావు.

ప్ఫ్... అని నిట్టూర్చి- "అసలు మీకు బాబు కావాలా? పాప కావాలా? " అంది అనంతలక్ష్మి.

"ఏమో నాకేం తెల్సు? నీకెవర్ని కనాలనిపిస్తే వాళ్లని కను..." అన్నాడు ఆనందరావు.

"ఖర్మ... అని ముద్దుగా గొణుక్కుని..." ఒకవేళ పాపపుడితే ఏ పేరు పెడదాం? " అంది.

"ఏమో... నాకేం తెలుసూ? పాప పుట్టినా కూడా నువ్వే పెట్టు పేరు..."

"ఏం మనిషిరా బాబూ? " అని నవ్వు



# అతి పొడవైన బల్ల




రాయల్ టేబుల్ అంటే ఇదే. ఇంగ్లండ్‌లోని విండ్సర్ కేజిల్‌లోని సెయింట్ జార్జి హాల్‌లోని ఈ పొడుగాటి టేబుల్ ముందు మొత్తం 166 మంది కూర్చున్నారు. ఒకేసారి అన్ని ప్లేట్లలోకి వేడి వేడి పదార్థాలు వడ్డించడం అక్కడ సమస్యేం కాదు. అయితే అవసరం వస్తే తప్ప బట్లర్లు కనబడరు. ఇది క్వీన్ ఎలిజిబెత్ ఓసారి ఇచ్చిన స్టేట్ బేంక్వెట్ (విందు) దృశ్యం. ఈ బల్ల వయసు 123 సంవత్సరాలు!

కుని "పోనీ ఇదైనా చెప్పండి... రాత్రికి కూరేం చెయ్యమంటారు?" అంది అనంత లక్ష్మి- అతని దగ్గరగాజరిగి.

"ఏమో- నాకేం తెలుసూ? నీకేం చెయ్యాలనిపిస్తే అది చెయ్యి..." చేతిలోని వీక్లీని పక్కన పెట్టేసి భార్యకేసి ప్రేమగా చూస్తూ అన్నాడు ఆనందరావు.

"ఏమో నాకేం తెల్సు, ఏమో నాకేం తెల్సు... ఇదొక ఊతపదమైపోయింది మీకు! అసలు మీకేం తెలుసు?" చిరుకోపంగా అంది అనంతలక్ష్మి.

"నువ్వు చెప్పినట్టల్లా వింటూ, నిన్ను ప్రేమగా చూసుకుంటూ బుద్ధిమంతుడిలా జీవించడం..." మంచి బాలుడు రాములా చేతులు కట్టుకుంటూ, అల్లరిగా కన్ను గీటుతూ అన్నాడు ఆనందరావు.

అతన్ని ఆ ఫోజులో, ఆ అల్లరిలో అలా చూస్తుంటే ప్రేమ పొంగుకొచ్చింది అనంత లక్ష్మికి.

"నిజంగా మీరెంత మంచివారండీ- మీలాంటి భర్త దొరకటం నా అదృష్టం" అంటూ అతన్ని పెనవేసుకుపోయి... "ఒక వేళ మనకి బాబు గాని పుడితే పవన్ అనే పేరు పెట్టుకుందామండీ" అంది అనంత లక్ష్మి.

"అంటే- నా బ్రహ్మానందాన్ని పోగొట్టాడు చూడు- ఆయనా?" గతాన్ని గుర్తుకు తెచ్చుకుంటూ అడిగాడు ఆనంద రావు- "అంత మాత్రానికే ఆయన్ను దేవుడితో పోల్చాలా?"

"ఖచ్చితంగాను- ఎందుకంటే ఆయన పోగొట్టింది కేవలం మీ బ్రహ్మానందాన్ని మాత్రమే కాదు. లేడీతత్వంలాంటి మీ తింగరి చేష్టలన్నీ పోగొట్టాడు ఔనా" అంటూ అతన్ని మరింత బలంగా తనకేసి హత్తుకుందామె.





# ప్రజాహిత నవలాకారుడు రాబర్ట్ పెన్ వారెన్

**సా**హిత్యమనేది సంఘాన్ని, సంఘం లోని సమస్యలను, సంఘర్షణలను ప్రతి బింబింపజేసే దర్పణం అంటారు, సామాజిక స్పృహలేని రచయితలుండరు కాబట్టి. ఇది విశ్వసాహితికి వర్తించే విషయమే అయినా కూడ అమెరికాలోని దక్షిణాదికనే ప్రత్యేకించి చెప్పినట్లనిపిస్తుంది. కారణం ఈ దక్షిణాది రచయితలందరూ ప్రాంతీయాభిమానానికి, స్వస్థలాపేక్షకు పేరెన్నిక గాంచినవారు. వీరిలో మిన్న సుప్రసిద్ధ నవలాకారుడు రాబర్ట్ పెన్ వారెన్.

వారెన్ దక్షిణాదిలోని కెంటకీ ప్రాంతంలోని "గత్రీ" అనే గ్రామంలో పుట్టాడు. వ్యవసాయ కుటుంబానికి చెందిన రాబర్ట్ ఫ్రాంక్లిన్ వారెన్, అనారూత్ పెన్ వారెన్ దంపతుల ముగ్గురు సంతానంలో మధ్య వాడిగా ఏప్రిల్ 24, 1905న ఆయన జన్మించాడు. తల్లి ఉపాధ్యాయ వృత్తి, తండ్రి కవిత్వం వారెన్‌కు ఉగ్గుపాలతోనే లభించాయి. మాతామహుడైన గాబ్రియన్ థామస్ పెన్ సైన్యంలో పనిచేయడంతో సుప్రసిద్ధ 'సివిల్ వార్' గాథలను కథలుగా ఉయ్యాల్లోంచే విన్నాడు. తాత చెప్పిన గత కాలపు కతలూ మనసులో చెరగని ముద్రను వేసుకోవటమే కాకుండా గతం మీద అతనికొక ప్రత్యేకమైన ఆసక్తిని

పెంచి పోషించాయి. తమ్ముడు విసిరిన రాయి ప్రమాదవశాత్తు యెడమ కంటికి తగిలి దురదృష్టవశాత్తు ఆ కంటి చూపు పోగొట్టుకున్నాడు కూడా. తాతగారు కల్గించిన 'చారిత్రక స్పృహ' అతని అంతర్ దృష్టిని వారసత్వంగా సంపాదించి పెట్టిందనే చెప్పాలి. తాత, తల్లిదండ్రులు చదివి, చదివించిన పుస్తకాల వలన ఆయన బాల్యం గ్రంథ సాంగత్యంలోనే గడపటం తన అదృష్టంగా భావించాడాయన.

ఇంజనీరింగ్‌లో చేర్పించినా కవితా వ్యాసంగాన్ని ప్రోత్సహించే ఫ్యూజిటివ్ పత్రికలో సభ్యుడైనాడు వారెన్. ప్రాంతీయాభిమానంతోపాటు కవితా రచన వేళ్ళు ఆయన సాహిత్య వ్యాసంగంలో నాటుకోవటం మొదలుపెట్టాయి. అందువలనే చదువులో వెనకబడి ఓసారి ఆత్మహత్యా ప్రయత్నానికీ ఒడిగట్టాడు వారెన్. కాని సాహిత్య రచనకు తన దిశను మార్చుకోవటంతో, 1925లో అతి ప్రశంసనీయంగా పట్టభద్రుడైనాడు. ఇంతవరకూ దక్షిణాదిలోని వాండర్‌బిల్ట్ యూనివర్సిటిలోనే చదివిన అతను ఎం.ఎ.కోసం కాలిఫోర్నియా యూనివర్సిటికి వెళ్ళి అక్కడినుంచి 'రోడ్స్ స్కాలర్‌షిప్' మీద ఆక్స్‌ఫర్డ్‌కి వెళ్లాడు. పిహెచ్.డి. పట్టా రావడం, దాంతో పాటు తన కవితా సంకలనం 'పాండీ ఉడ్స్' ప్రచురితం కావటం 1930లో జరిగాయి. అలాగే 'గుగెన్ హామ్ స్కాలర్‌షిప్' రావటం, ముస్సోలినీ పరిపాలనాకాలంలో ఇటలీ వెళ్ళటం జరిగింది. ఇదే సమయంలో సుప్రసిద్ధ సాహిత్యకారుడైన ఎజ్రాపౌండ్, హెమింగ్‌వే లాంటివారితో పరిచయభాగ్యం కలిగింది.

ఇంగ్లిష్ ప్రొఫెసర్‌గా పనిచేస్తూనే, తోటి సాహిత్య విమర్శకుడైన క్లియాంత్ బ్రూక్స్‌తో కలిసి 'ద సదర్న్ రివ్యూ' అనే సాహిత్య త్రైమాసికను ప్రారంభించి దానికి సంపాదకుడుగా వ్యవహరించాడు. ఇలా ఈ ఇద్దరూ సాహిత్య విమర్శ గ్రంథాలైన 'అండర్‌స్టాండింగ్ పోయిట్రీ', 'అండర్‌స్టాండింగ్ ఫిక్షన్'లతో ఆంగ్లసాహిత్యానికి 'కొత్త విమర్శనా దృక్పథాన్ని పరిచయం చేశారు. తర్వాత తన మిత్రుడైన బ్రూక్స్‌ని సాహిత్యవేత్తగాను, విమర్శకుడుగాను వదిలేసి వారెన్ మాత్రం అన్ని ప్రక్రియల్లోనూ 'సాహిత్యకర్త' ముందుకు సాగిపోయాడు.

వారెన్ వైవాహిక జీవితం మొదటి రెండు దశాబ్దాలు అంత సుఖసంతోషాలతో గడవలేదు. కారణం మొదటి భార్య ఎమ్మాయానా అనారోగ్యమే. రెండోభార్య ఎలినా క్లార్క్ నవలాకారిణి కావటంతో అసలు సిసలు సహధర్మచారిణి కాగలిగింది. ఈ వివాహం వలన రోజన్నా గేబ్రియల్ అనే కుమార్తె, కుమారుడూ కలిగారు. జీవితంలో ఏవిధమైన ఒడుదుడుకులు లేకపోవటంతో నిర్విరామంగా సాహిత్యసృష్టిలో లీనమైనాడు వారెన్.

వారెన్ సాహిత్యసృష్టిలో పది నవలలు, 16 కవితా సంపుటాలు, ఒక నాటకం, ఒక కథల సంపుటి, మరెన్నో విమర్శనాత్మక వ్యాసాలు చోటుచేసుకున్నాయి. ఈ వ్యాసాలు సాహిత్య విద్యార్థులకు ఉపయోగకరమైనవి. హథార్న్ హార్డీ, విట్‌మన్, టి.ఎస్. ఇలియట్ వారెన్‌ని ప్రభావితం జేస్తే ఆయన వ్రాసిన గ్రంథాలు విద్యార్థులకు, పాఠకులకు వెలుగుబాటను పరిచాయి. తనని ప్రభావితం చేసిన మహానుభావులనందరినీ వెనుకకు నెట్టి తాత్విక నవలాకారుడిగా తనదంటూ ప్రత్యేకమైన ముద్ర వేసుకోగలిగాడు వారెన్. నిజానికి వారెన్‌కి వ్యక్తిగతంగా కవిగా గుర్తింపబడటమే ఇష్టమట. కాని మొట్టమొదటగా ఆయన గుర్తింపబడింది దార్శనికుడైన నవలాకారుడిగా మాత్రమే మరి!

వారెన్ రచయితగా, పద్యమైనా, గద్య

మైనా అమెరికాలోని దక్షిణాదికి ప్రాతిని ధ్యం వహించాడనే చెప్పాలి. తనతోటి రచయితల మాదిరి ఆ ప్రాంతీయతను ఒంట బట్టించుకోవటమే కాకుండా, ఆ ప్రాంతపు సమస్యలు, సంఘర్షణలతోపాటు, ఆ ప్రాంతీయగతాన్ని అవగతం చేసుకుని, అందులోని పరమార్థాన్ని చదువరులకు అందించే పనీ చేశాడు. నీగ్రోజాతికి ప్రత్యేక గుర్తింపు లేదనే ఆక్రోశం, వ్యవసాయ ప్రాధాన్యత, ప్రాకృతిక సౌందర్యం తదితరాలన్నీ దక్షిణాదివారికే సొంతం. అయినా వీటన్నిటినీ విశ్వమానవాళికి వర్తించే తత్త్వచింతనగా, దర్శనంగా అందించాడు వారెన్ నవలా సృష్టి కర్తగా.

తన 10 నవలల్లోనూ వారెన్ దక్షిణాదికి సంబంధించిన గతానికి, దాని సమస్యలకు, సంఘర్షణలకు అద్దంపట్టాడు. వీటిలో రచనాకాలానికి కొంచెం ముందుగా జరిగిన రైతుల పోరాటం, దానిమీద అప్పుడే ప్రస్ఫుటమైన పారిశ్రామికోన్నతి ప్రభావాన్నీ నైట్ రైడర్ (1938), ఎట్ హెవెన్స్ గేట్ (1943)లలో చూపాడు..

'నైట్ రైడర్' దీనికి ముందు రాసిన నవలిక 'ప్రమ్ లీఫ్'కి అనుబంధం. కెంటకీ ప్రాంతంలో జరిగిన రైతుల పోరాటం దీనికి ఆధారం. ఈ పోరాటంలో కథానాయకుడైన ఫెర్సీవన్ తన ఆదర్శాలూ ఆశయాల ద్వారా తన గుర్తింపును ఆశించి అహంకారాన్ని ఆలింగనం చేసుకుని వ్యక్తిగతమైన విలువలనే లేకుండా, నైతికవిలువలనూ పోగొట్టుకోవటమే ఇతివృత్తం.

రెండో నవల 'ఎట్ హెవెన్స్ గేట్' కథావస్తువు పెట్టుబడిదారుల ధనదాహం. విత్తపువేటలో మనసును మరచి బోలు మనుషులుగా మిగిలిపోవటం, చివరి దశలో మంచిపనులు చేసి స్వర్గానికి నిచ్చెన వేద్దామనుకున్నా వేయలేక స్వర్గ ద్వారం దగ్గరే మిగిలిపోవుటమూను.

'సివిల్ వార్' అనబడే పౌరుల పోరాటం దక్షిణాదికి చెందిన ప్రత్యేకమైన ప్రశ్న. ఇది ఒక చారిత్రక సంఘటనే అయినా కూడ 'చారిత్రక స్పృహ' గల వారెన్ భావుకతను ప్రేరేపించిన ముఖ్య సంఘటన. 'బాండ్ అఫ్ ఎంజెల్స్', 'వైల్డర్ నెస్' అనే రెండు నవలల్లోనూ పౌరుల పోరాటపు ఫలితంగా ప్రకోపించిన 'చెరగని పుట్టుమచ్చ' నల్లవాడి ఉనికి, అతను తన స్వాతంత్ర్యానికీ, గుర్తింపుకు పోరాడే పోరాటమే యీ నవలల ఇతివృత్తం.

'బాండ్ అఫ్ ఏంజెల్స్'లో కథానాయకి అమాంతా స్టార్‌కి తలెత్తిన ప్రశ్న 'నేనెవరు? ' అనేది. ఆమె తెలుపు నలుపు జాతుల సంతతి. తను ఆరాధించిన దేవతల మధ్యలో తన ఉనికికి అర్థం తెలియక ఆరాటపడ్తుంది. ఆవేదనకు లోనవుతుంది. చివరికి యీ నలుపు తెలుపు భేదం శరీరానికేగాని ఆత్మకు లేదని స్వేచ్ఛ తనలోనే ఉందని అర్థం చేసుకుని 'నేను నేనే' అని తృప్తిపడటంలో కథ యిమిడి ఉంది.

మరో నవల 'వైల్డర్‌నెస్' బానిసత్వపు నిర్మూలనానికి కంకణం కట్టుకున్న 'ఆడమ్' తన అపరిపూర్ణమైన ఆశయానికి ప్రతీకగా ఉన్న మెలిక తిరిగిన పాదంతో, ఆదిమానవుని ప్రతీకగా దక్షిణాదిలో జరిగే యుద్ధంలో పాల్గొనటానికి రావటంతో స్వేచ్ఛ అనేది రెండు జాతుల మనసులో మార్పు రావటంలోనే ఉందనే తత్వాన్ని తెలుసుకుంటాడు. అతని వంకర పాదమూ బాగుపడ్తుంది.

ఇది వారెన్ వ్రాసిన నవలలన్నిటిలోకి చాలా చిన్నదైనా, అందించిన సందేశం బహు దొడ్డది. మనిషి మనసే ఒక చొరరాని అరణ్యం. అందులోకి చొచ్చుకుని పోవటం సమరమే అంటాడు వారెన్.

ఈ నవలా రచనకు ముందే తన ప్రాంతపు నల్లవారి సమస్యను 'హూ

స్పీక్స్ ఫర్ ద నీగ్రో' అనే పుస్తకంలోను, 'లెగసీ ఆఫ్ ద సివిల్ వార్' అనే గద్యరచనలోనూ వాదించి, వారికి పౌరహక్కుల నివ్వాలనీ, వారిని బానిసలుగా ఉపయోగించుకున్న తెల్లవారికంటే వారే అసలు సిసలైన అమెరికన్‌లని నొక్కి వక్కాణించిన మహామనీషి. అందుకనే కాబోలు 'బాండ్ ఆఫ్ ఏంజెల్స్'ను చలనచిత్రంగా తీసి యీ సమస్యను ప్రజానీకం ముందు పెట్టారు.

ఇక 'ఆల్ ద కింగ్స్ మెన్', 'వరల్డ్ ఎనఫ్ అండ్ టైమ్', 'ఎ ప్లేస్ టు కమ్ టు' అనే మూడు నవలలూ స్వస్థలాపేక్ష,

**అందరి తప్పులనెంచే ఇతడు తన తప్పుల నెరుగడు. కాని పరుల గతాన్ని తవ్వే పనిలో తన గతాన్ని తెలుసుకునే ఆవశ్యకత కన్పిస్తుంది. జీవితమనేది ఒక సాలెగూడులాంటిదని తెలుసుకుంటాడు. తన తప్పు తెలుసుకుని, ప్రక్షాళనకని పశ్చిమానికి వస్తాడు.**

స్వగతంగా వెలువర్చే వ్యక్తిగత 'గతం', అమెరికన్‌లకు సహజమైన వలసపోయే గుణానికి అద్దం పట్టి చూపుతాయి. ఈ నవలల్లోని కథానాయకులు గతావలోకనం మూలంగా ప్రస్తుతం నుంచి వెనుక ముందులకు పోవటంతో ప్రస్తుతానికి గతంతో సంబంధముందని, ప్రస్తుతంలోని ఉనికి ద్వారానే గతావలోకనం చేసి దాని అంతరార్థం తెలుసుకుని భవిష్యత్తుకు బాట వేసుకోవాలనే సందేశాన్ని పాఠకులకు అందిస్తాడు వారెన్. కాలప్రవాహంలో ప్రస్తుతం నుంచి గతంలోకి తొంగి చూసి భవిష్యత్తుకి బాటవేసుకోవటమే తరుణోపాయమంటాడు.

ఈ వరుసలోని మొదటి నవల 'ఆల్ ద కింగ్స్‌మెన్' వారెన్ లూసియానా యూనివర్సిటీలో ఆచార్య పదవిలో ఉండగా హ్యూయీ లాంగ్ అరాచకపు అగ్ని వేడిమిని అనుభవించి వ్రాసినది. షేక్స్పియర్ వ్రాసిన 'జూలియస్ సీజర్' నాటకంలో చూపించినట్లు అరాచకానికి, నిరంకుశత్వానికి ప్రతినిధి అయిన పరిపాలకుడు అంతమైనా, అతని నిరంకుశత్వం, అవినీతి చావవు అని చూపిస్తాడు. ఈ నవల కథానాయకుడు జాక్‌బర్డెన్ చారిత్రక పరిశోధకుడిగా రాజకీయనాయకుల గతాన్ని తవ్వి కోహినూర్ వజ్రం లాంటి నిజాన్ని బయటికి లాగే బాధ్యతను తన భుజస్కంధాలమీద వేసుకుంటాడు. అందరి తప్పులనెంచే ఇతడు తన తప్పుల నెరుగడు. కాని పరుల గతాన్ని తవ్వే పనిలో తన గతాన్ని తెలుసుకునే ఆవశ్యకత కన్పిస్తుంది. జీవితమనేది ఒక సాలెగూడులాంటిదని తెలుసుకుంటాడు. తన తప్పు తెలుసుకుని, ప్రక్షాళనకని పశ్చిమానికి వస్తాడు. యోగమే ఉత్తమమని తెలుసుకొని ప్రేమ, కర్మ జ్ఞాన మార్గాల ద్వారా పాప విముక్తిని పొందటానికని 'బర్డెన్స్ లాండింగ్' అనే తన స్వస్థలానికి చేరుకుని తన బాధ్యతను దింపుకుంటాడు.

'ఆల్ ద కింగ్స్‌మెన్' నవల చలనచిత్రంగా వచ్చింది. ఇది అకాడమీ పురస్కారాన్ని పొందింది. దీనికి అనువాదాలూ అనుసరణలూ జరిగాయి. దీనికి 'పులిట్జర్ ప్రైజ్' లభించటం విశేషం.

వరల్డ్ ఎనఫ్ అండ్ టైమ్ (1956) నవలకు దక్షిణాదిని ఊపివేసిన 19వ శతాబ్దపు ఒక సంఘటన ఆధారం. గతాన్నుంచి ఎన్నుకున్న ఈ ఇతివృత్తాన్ని తన అద్భుత కల్పనాశక్తితో మలచి ఒక జీవిత తత్త్వాన్నే మనముందు పెడ్తాడు వారెన్. కథానాయకుడు జెరీబోమాంట్ ప్రపంచంతోటి, తను బతికిన సమయంతోటి విసిగి ప్రకృతి ఒడిలోకి జారుకుంటాడు, అందని ఆశయాలకు పోకుండా, కాలాన్ని



వృథాపర్చకుండా బతకాలని చెప్పకనే చెప్తాడు రచయిత.

'ఎ ప్లేస్ టు కమ్ టూ' (1977) అనేది వారెన్ వ్రాసిన నవలల్లో చిట్టచివరిదీ, పరాకాష్టకు చేరినదీనూ. దీనిని వారెన్ ఆత్మకథగా తీసుకోవచ్చు. వారెన్‌లాగే దీని కథానాయకుడైన జెడ్ టాక్స్‌బరీ కూడ తన స్వస్థలాన్ని వదిలి వలసవెళ్ళి పలు నగరాల్లో తిరిగి ఎన్నో డిగ్రీలను, మరెన్నో అనుభవాలను సంపాయించి స్వస్థలానికి తిరిగి వస్తాడు. అలా తిరిగి వచ్చినప్పుడు



అనుభవించిన ఆనందాన్ని పోయిన ఆట వస్తువు తిరిగి దొరికితే పసిపిల్లలకు కలిగే ఆనందంలాంటిది అంటాడు. జెడ్ తన గురువైన స్టాల్‌మన్ విరక్తి చెంది తన మధ్య వయసులో స్వస్థలానికి తిరిగివస్తాడు. వచ్చాకనే తన తల్లిదండ్రులను ఆదరించి, తన గతాన్ని నెమరువేసుకుంటేనేగాని తనకు విముక్తి లేదని అర్థం జేసుకుంటాడు. జీవితంలో ప్రేమ అనేది యెంత ముఖ్యమో మృత్యువుకూడ అంతే ముఖ్యమైనదని తప్పించుకోలేనిదని తెలుసుకుంటాడు.

చివరి మూడు నవలల్లో గ్రామ్య జీవితాన్ని చిత్రీకరించాడు. పారిశ్రామిక జీవిత విధానానికి అలవాటుపడి, దాని వెనుకనే పిచ్చి పరుగులెత్తే సామాన్య మూకలకు దూరంగా ఉండే ప్రకృతి ఒడిలో గడిపే జీవితమే పరమోత్తమమని చూపుతాయీ నవలలు. థామస్ హార్డీ ప్రభావం తేటతెల్లంగా కన్పిస్తుంది వీటిలో. 'ద కేవ్' (1959), 'ఫ్లడ్ ఎ రొమాన్స్ అఫ్ అవర్ టైమ్' (1964), 'మీట్ మీ ఇన్ ద గ్రీన్ గ్లెన్' (1971) అనే నవలల శీర్షికలే గ్రామ్య జీవితానికి ప్రతీకలూ, ప్రతిబింబాలూ.

వీటిలో మొట్ట మొదటిది 'ద కేవ్'. దీని ఇతివృత్తం ఒక గుహలో చిక్కుకుని పాఠకుల ముందుకు కూడ రాని ఒక వ్యక్తి గతాన్ని స్మృతిలో ముందుకూ వెనక్కూ పోతూ నడిపిన కథ. ఒక మనిషి గుహలో చిక్కుకుపోయిన అతి సామాన్య విషయాన్ని వార్తా పత్రికలు, దూరదర్శన్ ఎంతటి ప్రచారాన్నిచ్చిందీ చెప్పటమే కాకుండా దానికి సంబంధించి ముఖ్యవ్యక్తుల గతంలోకి తొంగి చూసి ఒక అంతర్లీనమైన జీవిత పరమార్థాన్ని పాఠకుల ముందు పెడ్తాడు వారెన్. మనిషి తన అంతర్గతమనే గుహలో చిక్కుకుని, తనెవర్నే విషయాన్ని తన గతావలోకనం ద్వారా ఆత్మావలోకనం చేయగలుగుతాడు. కథానాయకుని గాథలో ఎంతోమంది గతాలు ఇమిడి ఉన్నాయి. ఏకత్వంలో బహుత్వపు ఉనికిని చూడగల్గుతాం. 'ఫ్లడ్ ఎ రొమాన్స్ ఆఫ్ అవర్ టైమ్' అన్న శీర్షిక అదొక కాల్పనిక ప్రపంచమని సూచిస్తుంది. కథలు వ్రాసే కథానాయకుడు బ్రాడ్ టా లీవర్, చలన చిత్ర నిర్మాత అయిన యాషా జోన్స్‌తో కలిసి, ఆనకట్ట కట్టే మునగబోయే ఫిడలర్స్‌బర్గ్ అనే ఆ ఊరి కథను చలనచిత్రం తీయబోతారు. సృజనాత్మక రచయిత అయినా కూడా బ్రాడ్ భౌతికమైన ధనార్జనకు ఆశపడటంతో అతనిలోని సృజనాత్మకత కుంటుపడుతుంది. మునగబోయే ఆ ఊరి గతావలోకనం, ఆహ్లాదకరమైన ప్రాకృతిక

దృశ్యావలోకనం ద్వారాను అతనికి అవగత మవుతుంది. గతమనేది ఒక ప్రవాహ మనీ, మానవుడు కట్టే ఆనకట్టలు ఆ ప్రవాహాన్ని ఆపలేవనీ చూపిస్తాడీ నవలలో వారెన్.

ఈ వరుసలో పరిచయమయ్యే చివరి నవల 'మీట్ మి ఇన్ ద గ్రీన్ గ్లెన్'. ప్రకృతిలోని ప్రశాంతతను, నిశ్శబ్దతను, థామస్ హార్డీ బాణీలో మనముందు పెట్టాడు.

ప్రకృతి ఒడిలో ప్రశాంతంగా జీవిస్తూన్న 'కాసికిలిగ్రూ'లో సంచలనాన్ని కలుగజేస్తాడు హటాత్తుగా ఆ గ్రామంలోనూ, ఆమె జీవితంలోనూ ప్రవేశించిన ఏంజెలో. ఆమె జీవితంలో అతను అనేక మార్పులను తేవటమే కాకుండా, తన గతంలోకి ప్రవేశించేట్లూ చేస్తాడు. గత స్మృతులు వెంటాడుతుండగా తన ప్రశాంతతనూ పవిత్రతనూ పోగొట్టుకుంటుంది కౌసీ.

ఈ నవల భావానుభూతికి కవిత అనుకుంటే ప్రేమానుభూతికి తత్త్వం.

రాబర్ట్ పెన్ వారెన్ ఒక తత్త్వ చింతన కల్గిన నవలాకారుడు. అయినా ఆయన సృష్టించిన కథానాయకులు మాత్రం మామూలు మనుషులు, ధీరోదాత్తులెంత మాత్రము కాదు. కారణం, 'ఆస్మాసిస్ ఆఫ్ బీయింగ్' అనే ఆయన వాదం. అంటే మనిషి అనేవాడు ఉన్నత స్థితికి పోవటమే, మార్పు అనేది అతి సహజమూ, తప్పించుకోలేని నిజమూ అంటాడాయన. పతితస్థితి నుంచి పావనం పొందాలంటే పశ్చిమానికి వెళ్లాలనేది అతను సృష్టించిన కథానాయకుల తపన.

ఈ తపనే ఆస్మాసిస్‌కి మొదటి మెట్టైన మార్పు. సమాజంలోని మిగతావారితో సంబంధం పెట్టుకోవటం, వారి బాధ్యతను వహించటం, గతావలోకనంలాటి పాప ప్రక్షాళన మార్గాలు.

'గతం' అంటే వారెన్ దృష్టిలో సృష్టికర్త, గురువు, తల్లితండ్రులు, తన సమాజం, ప్రాంతం, స్వస్థలం, తదితరాలకు ప్రతీక. వీటన్నింటిలోని మంచిని గ్రహించి మననం చేయాలేగాని, బాధ్యతలను విస్మరించి, గతాన్ని గర్హించి పారిపోకుండా బాధ్యత వహించి, గతాన్నించి గ్రహించి, గర్వించి ముందుకు సాగాలనేది సందేశం.

గతమనేది నిరంతరం అవిరామంగా ప్రవహించే జీవనది. మానవుడు ఆ ప్రవాహం ముందు బుద్బుదప్రాయుడూ క్షణికుడూను. ప్రస్తుత క్షణాన్ని అర్థవంతం చేసుకోవాలంటే ఉనికి నుంచి ఉన్నతస్థితికి చేరుకోగలగాలి అంటాడు వారెన్. అందుకే ఆయన్ని దార్శనికుడు, తత్త్వచింతన గల నవలాకారుడు అంటారు. అందుకే ఆయన నవలలు ప్రజారంజకమైనవి కాదన్నా కూడ, తప్పకుండా ప్రజాహితమైనవని చెప్పాల్సిందే.

రాబర్ట్‌పెన్ వారెన్ 1930 నుంచి 1986 వరకు ఒక అర్ధశతాబ్దకాలం సాహిత్య వ్యాసంగంలో గడిపి అనేక పురస్కారాలను, గౌరవాలను, డాక్టరేట్లను పొందటం ఆయన ప్రతిభకు ఒక తులామానమైతే, 1986లో అమెరికా దేశము మొట్టమొదటి 'ఆస్థానకవి' పదవిలో నియమించబడటం 'కవిగా గుర్తింపబడాలనే' ఆయన స్వప్నాన్ని సాకారం చేసిన ఒక చర్య. ఈ పదవిని రెండేళ్లపాటు నిర్వహించి సెప్టెంబరు 15, 1989లో కీర్తిశేషుడయ్యాడు.

ఆ తర్వాత ఆయన జన్మదిన శతవార్షిక చిహ్నంగా 2005లో ఒక తపాలా బిళ్లను వెలువరించింది అమెరికా ప్రభుత్వ తపాలా శాఖ.

తానెక్కడ తనువు చాలించినా తను పుట్టి పెరిగిన మన్నైన 'గత్రీ'లో తనకొక స్మారకచిహ్నాం కట్టించమనేది అత్యంత గౌరవ పురస్కారంగా నెరవేర్చబడింది.

–వి.ప్రఫుల్ల

ఇది వేదం

# ధర్మకార్యాలకు స్త్రీలు అనర్హులా?

-సంధ్యావందనం లక్ష్మీదేవి

అనర్హత పేరుతో అనాదిగా స్త్రీలను ధర్మకార్యాల్లో పాల్గొనేందుకు అనుమతించలేదు సమాజం. అంటు, అపవిత్రం అంటూ వేదవిధుల్లో వారు పురుషుడితో సమాన భాగస్వామ్యాన్ని పొందకుండా నిరోధించింది. పురుషులు మాత్రమే యజ్ఞయాగాది క్రతువులు నిర్వహించాలంటూ నిర్దేశించింది. ఫలితం ధర్మంగా సంక్రమించాల్సిన బాధ్యతలు దక్కక అలనాటి అతివ అంధకారంలో మగ్గిపోయింది.

ధర్మార్థ కామమోక్షాలనే చతుర్విధ పురుషార్థాలు పురుషులను ఉద్దేశించి చెప్పినవేనని అప్పట్లో కొందరు విపరీత వాదనలు చేసేవారు. పురుషార్థం అన్న పదంలోనే 'పురుష' శబ్దం ఉందని వాదించేవారు. మరికొందరు ఇంకో అడుగు ముందుకువేసి ధర్మకార్యాలు పురుషులు చేస్తే సరిపోతుంది. వారి భార్యలుగా స్త్రీలకూ వాటి ఫలితం లభిస్తుందన్నారు. ఇలా స్త్రీలను ధర్మకార్యాలకు దూరంగా ఉంచారు.

నిజానికి స్త్రీలు ధర్మకార్యాలు చేయకూడదని ఏ ధర్మశాస్త్రాల్లోనూ చెప్పలేదు. పైగా ధర్మకార్యాలు ఎవరుచేస్తే వారికే దాని ఫలం దక్కుతుందని నొక్కివక్కాణించాయి. మహర్షులే స్వయంగా ఈ విషయం చెప్పారు.

**'అవశ్యమేవ భోక్తవ్యంకృతం**
**కర్మ శుభాశుభమ్...'** అన్నది శాస్త్రవచనం.

అంటే, ఎవరు ఏ కర్మ చేస్తారో వారే దాని ఫలాన్ని పొందుతారని అర్థం. భర్తచేసే కర్మఫలితాల్లో సగభాగం భార్యకు, భార్యచేసే కర్మఫలితాల్లో సగభాగం భర్తకు లభించదని దీనివల్ల తెలుతోంది. ఒకవేళ భర్తచేసే పుణ్యకార్యాలలో సగం భార్యకు దక్కితే భర్తచేసే వ్యభిచారాది దుష్టకార్యాల ఫలం కూడా అందాలి. మరి అలా అందడంలేదే. ఇది రానపుడు పుణ్యఫలం కూడా రాదు.

అసలు పురుషార్థంలోని పురుషుడు మనం అనుకొనే పురుషుడు ఒకటేనా? కానే కాదు. 'పురిశేత్ ఇతిపురుషః..' శరీరమనే పురంలో జీవుడు నివసిస్తాడు కనుక దేహానికి పురమని పేరొచ్చింది. జీవుడు ఆ పురంలో కాపురం ఉంటాడన్నమాట. ఆ జీవుడికి స్త్రీపురుష భేదం లేదు. లింగ వివక్ష అంతకన్నా లేదు. కనుక పురుషార్థాలనేవి కేవలం పురుషులకు సంబంధించినవి కావు. భార్యాభర్తలిద్దరూ కలిసి ఆచరించాల్సినవి. ధర్మాచరణతో వస్తువులను సంపాదించుకోవడం, వాటితో ధర్మబద్ధమైన కోరికలు తీర్చుకోవడం, చివరగా భగవత్ సాక్షాత్కారాన్ని అభిలషించడం.. అనే అంశాలు పురుషుడికెంత అవసరమో స్త్రీకీ అంతే అవసరం. అవి స్త్రీపురుషులిద్దరికీ సమానమే. ఈ సందర్భంలోనే మోక్షమనేది స్త్రీపురుషులిద్దరూ పొందవచ్చునని మహర్షులు స్పష్టంగా చెప్పారు.

**వేదసాహిత్యం ఏం చెబుతోంది?**

వేదసాహిత్యం, ఆర్షసాహిత్యంలో ఎక్కడ పురుష శబ్దం వచ్చినా... సందర్భానుసారంగా అది 'జీవాత్మ-పరమాత్మ'గా అర్థం చేసుకోవాలి. కానీ, లింగభేదంతో కాదు. వేదం ఆత్మకు లింగ భేదం లేదని స్పష్టం చేస్తోంది. శాస్త్రాధ్యయనంలో పురుషునికెంత అధికారం ఉందో స్త్రీకీ అంతే అధి

కారం ఉంది.

**'త్వం స్త్రీత్వం పుమానసి**
**త్వం కుమార ఉతవా కుమారీ'**

(అధర్వవేదం 10-8-7).

అంటే.. జీవాత్మకు శరీర సంబంధంతోనే స్త్రీ అని, పురుషుడని, కుమారుడని, కుమార్తె అనిపేర్లు వస్తాయని వేదమంటోంది. రుగ్వేదం స్త్రీని 'చతుష్కపర్దా' అంటుంది. అనగా పురుషార్థాలను తెలుసుకున్నదని అర్థం. కుటుంబానికి ఆధారం స్త్రీపురుషులే. వారి ఆలోచనాశక్తి సమానంగా ఉండాలి. కుటుంబమనే రథానికి ఇద్దరూ సమాంతర రథచక్రాలుగా ఉండాలని వివాహ ధర్మం బోధిస్తుంది. అందుకే, స్త్రీని రుషులు పురుషునితో సమానంగా విద్యావంతురాలై ఉండాలని అన్నారు.

**'స్వయం సా మిత్రం మనుతే'**

(రుగ్వేదం 10-27-12)

అలాగే, స్త్రీలకు తనకు తగిన భర్తను ఎన్నుకోమని అంటోంది. అది స్వయంవర వివాహం. సంతాన నిర్మాణంలో స్త్రీకి మహత్వపూర్ణమైన భూమిక ఉంది. బిడ్డల పాలన, పోషణ, చదువు సంస్కారాల అంశాలు మొదటగా తల్లిమీదే ఆధారపడి ఉన్నాయి. అలాగే, ధర్మకార్యాల్లో స్త్రీపురుషులిద్దరికీ సమానత్వం చూపే ఉదాహరణలు వేదాల్లో ఎన్నో ఉన్నాయి. భార్యాభర్తలు కలిసిచేస్తేనే ధర్మకార్యాలవుతాయి.

**'దేవో దేవేషు యజ్ఞాయః**

(రుగ్వేదం 1-142-3)

యజ్ఞంచేసే విద్వాంసుడు సుఖాలను పొందుతాడు. యజ్ఞంచేసే స్త్రీ ఉన్నతిని, శ్రేష్టత్వాన్ని పొందుతుంది. ఈ సూక్తంలో యజ్ఞంచేసే విద్వాంసుని 'యజ్ఞియః' అని, స్త్రీని 'యజ్ఞియాః' అని వర్ణిస్తుంది. ఉదాహరణకు-

**'ఇడా సరస్వతీ మహీ బిర్హి హీః!**
**సీదంతు యజ్ఞియాః!!** (రుగ్వేదం 1-142-9)

పురుషుడు పూర్ణుడు కావాలంటే వివాహ ధర్మాన్ని అనుసరించి నడుచుకోవాలి.

**'అర్థోహ వా ఏషా ఆత్మనో యజ్ఞాయా తస్మాత్**
**యావజ్జాయ విందంతే నైవ**
**తావద్ ప్రజ్ఞామతే!** (శతపథబ్రాహ్మణం)

పతి పత్నిని పొంది సంతానాన్ని నిర్మాణం చేసినపుడే పూర్ణ పురుషుడవుతాడని ప్రాచీన రుషులన్నారు. పతిలో సగం పత్ని. పురుషుడు వివాహ ధర్మాన్ని పాలించకపోతే అసంపూర్ణంగానే ఉంటాడు. వివాహం చేసుకుని సంతానాన్ని పొందితేనే అతడు పూర్ణ పురుషుడవుతాడని




రుషులన్నారు.

**'స హైతావా నాసయథా స్త్రీ**
**పుమాంసో సం పరిష్వక్తౌ**
**స ఇమమే వాత్మానం ద్వేధా**
**అపాతయత తీతః పతిశ్చ!**
**పత్నీచ వా భవతామ్**
**తస్మాదిద మథూ వృగల వివ!!**

(బృహదారణ్యక ఉపనిషత్)

భార్యాభర్తలు కలిస్తేనే గృహస్థమనే శరీరం తయారవుతుంది. దీన్ని రెండు భాగాలుచేస్తే పతీపత్నులు అవుతారు. పతీపత్నులిద్దరూ ఒక బీజానికి రెండు దళాలున్నట్లుగా గృహస్థమనే శరీరానికి రెండుభాగాలుగా ఉంటారు. అంటే ఇద్దరూ సమానమని అర్థం. ప్రాచీన వైదిక వ్యవస్థలో పురుషులతో సమానంగా స్త్రీలకు సమానాధికారాలుండేవి. వారు ధర్మకార్యాల్లో స్వయంగా పాల్గొనేవారు. శాస్త్ర చర్చలు, సంభాషణలు చేసేవారు. రాజనీతి, యుద్ధనీతి తదితర రంగాల్లో నిష్ణాతులుగా ఉండేవారు. విశేష ప్రతిభాసామర్థ్యాలు కలిగి ఉండేవారు. స్త్రీలు శాస్త్రీయ విద్యలు, భౌతిక విద్యలు రెండూ నేర్చుకునేవారు. సమాజంలో ఏ విధమైన తారతమ్యాలు లేకుండా కలిసికట్టుగా ఉండేవారు. అలా ఉంటేనే కదా.. సమాజానికి స్వర్ణభవిష్యత్ సమకూరేది.

ఓం శాంతిః శాంతిః శాంతిః 

# కొలువైన

ట్యాంక్ బండ్ 6 కథలు

వేద ట్యాంక్‌బండ్ అంచున రెయిలింగ్ పట్టుకుని నిలబడింది. కానీ చూపంతా సాగర్‌మధ్య కొలువైన తథాగతుడి మీదే! 'నీలా నేనూ అయిన వారందరినీ వదిలి సుదూర తీరాలకు వెళ్లాలనుకుంటున్నా.. ఆశీర్వదించు ప్రభూ' అని మూగగా వేడు కుంటోంది ఆమె మనసు.

అయినా తనేమన్నానని రఘు అంతగా రెచ్చిపోవడం?

'ఉంటే ఉండు... పోతే పో! బెదిరిస్తావా ఏంటి? ' అనేశాడు.

ఈ మూడేళ్లలో ఎప్పుడూ అంత పరు షంగా మాట్లాడలేదు. అంతమాట అన్నాక ఇంకా అతని చూరుపట్టుకుని వేలాడాల్సిన ఖర్మ తనకేం పట్టలేదు. నెలకు నలభైవేల దాకా తెచ్చుకుంటోంది తను. బాబిగాడ్ని ఉదయాన్నే ఏ క్రెచ్‌లోనో పడేస్తే సాయంత్రం ఎంచక్కా ఇంటికి తీసు కుపోవచ్చు.

అయినా తనేమందని అతనికంత కోపం రావాలి? అత్తగారు పొద్దున ఏమందో తనేమైనా విన్నాడా?

'అప్పుడే న్యాపీ తడుపుకున్నావా వెధవా? ఊఁ ఊఁ అంటావేంటి? వస్తున్నా ఉండు మార్చుతాను! మొన్నటి దాకా నీ బాబుకు చేశాను. ఇప్పుడు నీకు.. రేపు నీ కొడుక్కు! నాయనమ్మ ఉంది అందుకేగదరా నాయనా? '

బాత్‌రూమ్‌లోనుంచి వస్తున్న తనను ఆ మాటలు శూలాల్లా తాకాయి.

'మీ అబ్బాయికి మీరు చేసుకున్నట్లే నా కొడుక్కి నేనే చేసుకుంటా. కుదరకపోతే ఏ ఆయానో పెట్టుకుంటా. అనవసరంగా బాధపడకండి అత్తయ్యగారూ! వెధవని అలాగే నాననివ్వండి' తను అంది రక్కున.

ఆమె మొహం అదోలా పెట్టుకుని గది లోకి వెళ్లిపోయింది.

బాబిగాడికి న్యాపీ మార్చి, చకచక డ్రెస్ చేసుకుని ఆఫీసుకు తయారవుతుంటే-

'అమ్మను ఏమన్నావేంటి? ఆవిడ బాధ పడుతోంది' అంటూ వచ్చాడు రఘు.

మహానుభావా నేనేమంటాను? ఆవిడ గారే బాబిగాడ్ని ఇలా అందని చెబు తుంటే- ఎంతకీ విన్పించుకోడేం?

ఆవిడగారి మాటల్లో ఆయనకు ప్రేమే తప్ప మరేం కనబడలేదట.. తనమాటల్లో మాత్రం చాలా తప్పు కనబడిందట.

'పెద్దవాళ్లతో మాట్లాడేటప్పుడు ఒళ్లుద గ్గర ఉంచుకుంటే మంచిది' అంటూ పైగా హితోక్తులు.

'సంస్కారం గురించి నువ్వు నాకు చెప్ప క్కర్లేదు' అని బదులిస్తే ఇష్టమొచ్చినట్లు తన ఇంటిల్లిపాదినీ తిట్టిపోశాడు.

డిగ్రీ నుంచీ ఇద్దరం కలిసి చదివాం.. ప్రేమించుకున్నాం.. పెళ్లాడాం... ఓ బిడ్డకు జన్మనిచ్చాం అయినా అతను తనను అర్థంచేసుకున్నది ఇంతేనన్నమాట.

'రఘూ నీ పద్ధతి బాగోలేదు.. ఇలాగైతే ఎవరిదారి వారు చూసుకోవడం మేలు' అంది తనుండబట్టలేక.




'బెదిరిస్తావా ఏంటి? ఉంటే ఉండు పోతే పో' బైకెక్కి వెళ్లిపోయాడు. రోజూ తనను ఆఫీసువద్ద దించిపోయే మనిషి నీ చావు నువ్వు చావంటూ పోయాక కాళ్లా గడ్డాలు పట్టుకుని బతిమాలాల్సిన ఖర్మ తనకేంటి? ఒంటిగా బిడ్డను పెట్టుకుని తనేనా బతకలేంది?

★ ★ ★

రఘు లుంబినీ పార్కులో కూర్చుని ఉన్నాడు. అలలుగా వస్తున్న సాగర్ నీళ్లను ఎంతసేపటి నుంచీ అలా చూస్తు న్నాడో?

అమ్మపట్ల వేద వ్యవహరిస్తున్న తీరు బాగోడం లేదు. అయినా ఉదయం ఆవిడ ఏమందని అంతగా రెచ్చిపోవడం? 'నీ బాబుకు చేశాను.. నీకు చేస్తున్నాను.. రేపు నీకొడుక్కు చేస్తాను' అన్నదాంట్లో తప్పేంటో తనకెంతకీ అర్థంకావడంలేదు. అయినా అంత రియాక్ట్ అవ్వాలా? అమ్మ మనసు నొప్పించాలా? మనవడ్ని అనే హక్కు ఆవిడకు ఉండదా? కావలిస్తే ఆయాను పెట్టుకుంటాను.. అంటుందా? పొగరు కాకపోతే! వెళ్లిపోతుందట వెళ్తే ఎవరికన్నా భయమా? ఆమెకే అంతుంటే పదివేలు ఎక్కువ సంపాదిస్తున్న తనకెంత ఉండాలి?

★ ★ ★

అప్పుడే ఆరున్నర అయింది. బాబిగాడికి ఆ ముసలావిడ పాలుపట్టిందో? లేదో? వెధవ ఆకలికి ఏడుస్తున్నాడేమో? పొద్దున ఆవిడమాత్రం ఏం తప్పందిలే? మా చిన్న అమ్మమ్మ అయితే సరదాగా తిట్టడమే కాదు.. ముద్దుముద్దుగా మొట్టికాయలూ వేసేది. ముద్దేతప్ప మరేంకాదని తమంద

రికీ తెలుసు. అలాగే అత్తగారూ అనొచ్చుగా? దానికి తనంత కఠినంగా మాట్లాడాలా? సర్లే -ఎవర్నైనా క్షమిస్తాకానీ రఘును మాత్రం క్షమించలేను. అతని తీరు మాత్రం టూమచ్..

★ ★ ★

వేద విషయంలో పొద్దున అనవసరంగా తొందరపడ్డానా? ఏ సంబంధం లేకపోయినా ఆమె పుట్టింటివాళ్లను తిట్టిపోయడం తనది తప్పే. రాత్రంతా బాబిగాడు పావుగంటకోసారి లేచి ఏడుస్తునే ఉంటాడు. తెల్లార్లూ వేద వాడితో వేగుతూనే పగలంతా ఆఫీసులో రెక్కలు ముక్కలు చేసుకుంటోంది. చిరాకులో ఏదో అంటే తనెందుకు అలా మాట్లాడడం? అమ్మను అనడం తప్పే. కానీ తను మాత్రం చేసిన ఒప్పేముంది? తనూ అలాగే మాట్లాడేశాడే?

★ ★ ★

అప్పుడే ఏడున్నరయింది. బాబిగాడు ఏంచేస్తున్నాడో? వాడ్ని చూడాలని మనసు పీకుతోంది.. అనవసరంగా తను ఇక్కడ పడేడవడం ఎందుకు? అత్తగారు అసలే చేసుకోలేని మనిషి. ఇంటికిపోతే పోలా!

★ ★ ★

ఏడున్నర దాటుతోంది. దోమలు కుట్టుకుంటూ ఇక్కడెందుకు జపం? బాబిగాడేం చేస్తున్నాడో? పోయిచూస్తా.

★ ★ ★

వేద ఎక్కిన ఆటో.. రఘు మోబైక్ ఒకే సారి ఇంటిముందు ఆగాయి. ఇద్దరూ గేటుతీసుకుని లోపలికెళ్తే తలుపుకు వేళ్లాడుతూ తాళంకప్ప వెక్కిరించింది. ఇద్దరూ అయోమయంగా ఒకరిముఖం ఒకరు చూసుకుంటుంటే పక్కింటి పిన్నిగారు వచ్చి-

'బాబిగాడికి సాయంత్రం ఉన్నట్టుండి వాంతులు- విరోచనాలు మొదలయ్యాయి. బామ్మగారు కంగారు పడిపోయారు. పల్లెటూరి ఆవిడ కదా? మీ ఫోన్‌నెంబర్లూ వగైరా ఏం తెలియదట.. అందుకే సాయంత్రందాకా మీకోసం కళ్లలో వత్తులు వేసుకుని చూశారు.. ఎంతకీ రాకపోవడంతో గంటక్రితం ఆటో చేసుకుని ఆస్పత్రికి తీసుకువెళ్లారు..'

ఆవిడ మాటపూర్తికాక ముందే రఘు వేదలు ఎక్కిన మోబైక్ ఆస్పత్రివైపు పరుగుతీసింది.

★ ★ ★

కార్పొరేట్ ఆస్పత్రి! రిసెప్షన్‌లో ఎంక్వయిరీచేసి భార్యాభర్తలు నాలుగో అంతస్తుకు చేరేసరికి బామ్మగారు ఒక్కరే దిగులుగా బెంచీమీద కూర్చుని కన్పించింది.

'అమ్మా' అంటూ పరుగున ఆవిడను చేరాడు రఘు.

'హమ్మయ్య వచ్చేశారా? మరేం కంగారు లేదు. చంటాడికి సాయంత్రం నుంచీ వాంతులూ.. విరేచనాలూ.. డీలా పడిపోతుంటే తీసుకొచ్చాను. డాక్టర్లు గ్లూకోజు ఎక్కిస్తున్నారు.. టైంకి తీసుకురావడంవల్ల గండం గట్టెక్కిందన్నారు' అంటూ కళ్లొత్తుకుంది ఆవిడ.

'అమ్మా మరి డబ్బు?' రఘు సగంలో ఆపేశాడు.

'అడిగారు. నా దగ్గరేముంది.. అందుకే మెడలో గొలుసుతీసి వారి చేతిలోపెట్టా. ఎలాగైనా వాడిని కాపాడమని కాళ్లు పట్టుకున్నా'

ఆవిడ మాట ముగించకముందే వేద వెక్కుతూ అత్తగారిని చుట్టుకుపోయింది.

అంతలోనే చిరునవ్వు నవ్వుతూ తమ వద్దకు వస్తున్న డాక్టర్‌ను చూసి ఆ ముగ్గురి హృదయాలూ తేలికపడ్డాయి.

—చంద్రప్రతాప్

# మార్చి విజేతలు వీరే!

మార్చి చతుర ప్రవేశికకు వచ్చిన అసంఖ్యాక స్పందనల్లో సరైన సమాధానాలు పంపి డ్రాలో విజేతలైన ఈ అయిదుగురికీ అభినందనలు. వీరికి త్వరలో బహుమతులు అందుతాయి.



1. **కె. వేణుగోపాల్** - గుంతకల్, అనంతపురం
2. **ఆబోతు పూర్ణచంద్రరావు** - ఎర్రగొండపాలెం, ప్రకాశం జిల్లా
3. **జి.హరిప్రసాద్** - నర్సరావుపేట, గుంటూరు జిల్లా
4. **బొగ్గవరపు సూర్యకుమారి** - పెందుర్తి, విశాఖపట్నం
5. **పి.వి.రాజ్యలక్ష్మి** - గచ్చిబౌలి, హైదరాబాద్



## అన్ని సమాధానాలు సరిగా పంపిన ఇతరులు

1. కె. సులోచన, చింతల్, హైదరాబాద్ 2. యు. విజయశేఖరరెడ్డి, కూకట్‌పల్లి 3. కె. మధుసూదన రావు, నిజామాబాద్ 4. ఉప్పులూరి దుర్గాదేవి, నందిగామ, కృష్ణాజిల్లా 5. కలియుగం హుమాయున్ సంఘీర్ గోపాల్‌పేట్, నిజామాబాద్ 6. బందా శ్రీనివాసరావు, ఒంగోలు 7. నేమాని సుభాష్ చంద్ర బోస్. శ్రీకాకుళం టౌన్ 8. కె. సునీత, సరూర్‌నగర్, హైదరాబాద్ 9. కె. విద్యాసాగర్, గుంటూరు 10. ఎం. మైమూన్, చెన్నయ్ 11. ఎల్. శివరాజ్, కదెవరం, తెనాలి 12. పిళ్లా ప్రజ్ఞశ్రీ, విశాఖపట్టణం, 13. వి. కౌండిన్య, విజయవాడ 14. విద్యారాజేశ్వర రావు, హైదరాబాద్ 15. పారుపల్లి వెంకటేశ్వరరావు, నల్లకుంట 16. అక్కినపల్లి రామారావు, విశాఖపట్టణం 17. వెల్చేరు నాగేశ్వరరావు, విజయనగరం 18. కూతురు రాంరెడ్డి, హైదరాబాద్ 19. కె. కామేశ్వరరావు, జంగారెడ్డిగూడెం 20. కరులూరి పార్వతి, తణుకు 21. టి. ఆర్. బాలకృష్ణారావు, రాజమండ్రి 22. ఎన్. చంగలరాయశెట్టి, అనంతపూర్ 23. బి. కామేశ్వరి, విజయనగర్ కాలనీ 24. చుండూరు అప్పల నరసింహం, కూకట్‌పల్లి 25. వి. బి స్వామి, విశాఖపట్టణం 26. నెల్లుట్ల సుదర్శనరావు, హన్మకొండ 27. పి. ఎం. ఆర్. ఎస్. రాజేశ్వరి, పెద గంట్యాడ, విశాఖపట్టణం 28. నెమలిదిన్నె రమణారెడ్డి, పోలవరం, ప్రకాశం జిల్లా 29. రాయళ్లి లాలె ప్పచౌదరి, బళ్లారి 30. అరుణరేఖ, గుంటూరు 31. ఎస్. లలితకుమారి, న్యూఢిల్లి 32. సి. హెచ్. విఎస్. ఎన్. ఎల్. రాజేశ్వరి, కాకినాడ 33. బి. భారతి, తిరుపతి 34. పిశుపాటి దాక్షాయణి, హిమాయత్‌నగర్, హైదరాబాద్ 35. ముమ్మిళ్ల వందన, హన్మకొండ 36. అనుముల బదరీనారాయణ, జమ్మలమడుగు 37. ఎన్. విజయలక్ష్మి, ఒంగోలు 38. టి. రేణుక, దేవాపూర్, ఆదిలాబాద్ జిల్లా 39. ఎం. కేశవనా యుడు, ఆరిలోవ, విశాఖపట్టణం 40. కె. వి. ఆర్. డి. రాజు, పెందుర్తి 41. బి. యామిని, గుంటూరు 42. సి. హెచ్. మోహన్‌రావు, విద్యానగర్ 43. బి. ఉషారాణి, అరసవిల్లి 44. ఎ. కాశేశ్వరరావు, మల్కాజి గిరి 45. గంధం ఆదినారాయణ, బంజారాహిల్స్ 46. మామిడి వేదవర్ష, పూణె 47. కరీం అన్సారి, ఆది లాబాద్ 48. కొల్లు రాజశ్రీ, గుంటూరు 49. ఎస్. మహ్మద్‌రఫీక్, దిగువపల్లి, అనంతపురం జిల్లా 50. డి. వెంకట నాగిరెడ్డి, లక్‌డీకాపూల్ 51. పసుపులేటి మీనమ్మ, పేర్నిమిట్ట, ప్రకాశం జిల్లా 52. పి. ఎస్. లక్ష్మి, శ్రీకాకుళం 53. చాగం మాధవి, అనంతపురం 54. పద్మజాశాస్త్రి బులుసు, రామ చంద్రాపురం 55. సి. హెచ్. ప్రదీప్‌కుమార్, లక్సెట్టిపేట, ఆదిలాబాద్ 56. తిప్పావఝుల సుబ్రహ్మణ్యం, ఇందుకూరుపేట, నెల్లూరు జిల్లా 57. టి. సుగుణయ్య, కరీంనగర్ 58. ధరణికోట శివరాంప్రసాద్, బోర బండ 59. పి. సుబ్బారావు, సంగారెడ్డి 60. వి. వెంకట రమణయ్య, ఎర్రముక్కపల్లి సర్కిల్, కడప 61. కె. ఎం. కె. మూర్తి, చెన్నయ్ 62. డి. పద్మినీ శిరీష, విశాఖపట్టణం 63. కూరపాటి శ్రీనివాస రావు, విశాఖపట్టణం 64. యస్. హిమజ, నెల్లూరు 65. శ్రీపెరంబుదూరు నారాయణరావు, హైదరా బాద్ 66. రంగు చక్రపాణి, హన్మకొండ.



# చతుర ప్రవేశిక



## ఏప్రిల్ - 08

ఏప్రిల్ 'చతుర' చదివారా? అయితే ఈ ప్రశ్నలకు ఒకేఒక్క మాటలో జవాబు రాయగలరేమో ప్రయత్నించండి. అన్నీ సరిగా రాసినవారికి ఆకర్షణీయమైన బహుమతులు లభిస్తాయి.. (ఎక్కువమంది సరైన సమాధానాలు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. విజేతల ఎంపికలో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. సంపాదకులదే తుదినిర్ణయం).

1. ఆనందరావుని రాజకీయాల్లోకి ఆహ్వానించిందెవరు?
2. ఆనందరావుకి సిన్మాఅవకాశమిస్తానన్న డైరక్టర్?
3. ఆనందరావు ప్రేమని అభ్యర్థించిన కాలేజ్‌బ్యూటీ?
4. మాధవరావు పర్సులో పోయిన సొమ్మెంత?
5. పెళ్లిచూపుల్లో అనంతలక్ష్మి ఏ రోగిలా నటించింది?
6. ఆనందరావు మామగారి పేరు?
7. ఆనందరావును ట్రీట్ చేసిన మెంటల్‌డాక్టర్?
8. అనంతలక్ష్మి ప్రాణస్నేహితురాలెవరు?
9. ఆనందరావు మింగిందేమిటి?
10. శోభనం వాయిదా కోసం ఆనందరావు ఏం కోరాడు?
11. ప్రీనర్సరీ ఇంటర్వ్యూలో ఫెయిలైన స్టూడెంట్ వయసు?
12. సత్యం తండ్రి దేనిపై డిస్కౌంటుంటే బాగుంటుందంటాడు?
13. బానిసత్వ నిర్మూలనపై వారెన్ రాసిన నవలపేరు?
14. పురుషుడు పూర్ణుడు కావాలంటే ఆచరించాల్సిన ధర్మం?
15. వేద నెలకెంత సంపాదిస్తోంది?

---

పంపినవారి పేరు: ------------------------------------ వయసు (   )

చిరునామా: ------------------------------------------------

------------------------------------------------------------

------------------------------------------------------------

పిన్‌కోడ్:                    ఫోన్ నెం:

ప్రవేశికలు పంపాల్సిన చిరునామా : సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్–500 082

ప్రవేశికలకు చివరి తేదీ 19

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

# సాహసయాత్ర

చాలా మంది అవసరానికి ప్రయాణం చేస్తారు. కొందరు సరదాకి ప్రయాణం చేస్తారు. ఆకాశంలో, సముద్రంలోనూ ఇలాంటి సాహస యాత్రలు చేసినవారు అనేక మంది ఉన్నారు. తాజాగా ఆ జాబితాలో న్యూజిలాండ్‌కి చెందిన ఇద్దరు సాహసికులు చేరారు.

జేమ్స్ కేస్టిసన్(25), జస్టిన్ జోన్స్(24) అనే ఇద్దరు 2007 నవంబరులో ఇలాంటి ఓ సాహసం చేశారు. ఎలాంటి యంత్రాలు అమర్చని సాధారణ కయక్ అనే పడవలో వారు ఆస్ట్రేలియా నుంచి రెండువేల మైళ్ల దూరంలో ఉన్న న్యూజిలాండ్ పశ్చిమ తీరంలోని గామోటు బీచ్‌కి టాస్మన్ సముద్రం మీదుగా చేరుకున్నారు. తెడ్ల సాయంతో ఆ పడవని నడపడానికి వారికి 62 రోజులు పట్టింది. ఆ బీచ్ దగ్గరున్న న్యూప్లైవుడ్ అనే ఊళ్లోని వారికి ఈ విషయం తెలిసి దాదాపు రెండువేల మంది వారికి స్వాగతం చెప్పడానికి ఎదురెళ్లారు. అలసిపోయిన వారిద్దరికీ చల్లటి బీరునందించారు. ఆ యువకుల కుటుంబ సభ్యులు వారిని కౌగిలించుకుని ఆనందించారు. జేమ్స్ ఈ సందర్భంగా తమలాగే 2006 ఫిబ్రవరిలో ఒంటరిగా టాస్మన్ సముద్రాన్ని కయక్ పడవమీద దాటే ప్రయత్నాన్ని చేస్తూ మాయమైన ఆండ్రూ మెకాలేని స్మరించుకున్నాడు. అతడు మాయమవ్వడానికి ముందు తాను ప్రమాదంలో పడ్డ సంకేతంగా మేడే కాల్‌ని రేడియో ద్వారా పంపాడు. నిజానికి వీరు ప్రారంభంలో ఆస్ట్రేలియా నుంచి బయలుదేరి తమ దేశంలోని పెద్ద నగరాల్లో ఒకటైన ఆక్లాండ్‌కి క్రిస్మస్‌కి ముందురోజు చేరాలని అనుకున్నారు. అయితే ప్రయాణంలో గాలులు దూరంగా నెట్టివేయడంతో తమకు 1400 మైళ్లు ఉన్న ఆక్లాండ్‌కి బదులు 2000 మైళ్ల దూరంలో ఉన్న న్యూప్లైమట్‌కి చేరుకున్నారు.




పడవ మీంచి దిగాక వారికి వైద్య పరీక్షలు నిర్వహించారు. వారి కాళ్ల కండరాలు చాలా కాలం పరిశ్రమ లేకపోవడంవల్ల కొద్దిగా చచ్చుపడ్డాయని డాక్టర్లు చెప్పారు. అది తప్ప ఆరోగ్యం అంతా సరిగ్గానే ఉంది. ఆస్ట్రేలియా నుంచి న్యూజిలాండ్‌కి కయక్ పడవలో విజయవంతంగా చేరిన మొదటి సంఘటన ఇదే. దురదృష్టవశాత్తు ఆండ్రూ మెకాలే న్యూజిలాండ్ పర్వతాలు కనబడేంత దగ్గరకి వచ్చాడు కాని, తర్వాత మాయమయ్యాడు. అతని పడవ, అతను వీడిన ఆఖరి చిత్రాలుగల కెమెరా దొరికాయి. కానీ మృతదేహం మాత్రం లభించలేదు.



# చతుర కథలు

# బంగార్రాజు అల్లుడు

బంగార్రాజు గారి అల్లుడు ఏకాంబరం పండగకి వచ్చాడు. అల్లుడ్ని మెప్పించడానికి భారీ ఏర్పాట్లు చేశారు- బంగార్రాజుగారికేం తక్కువ? ప్రతి ప్రజాసేవకుడు కలలు కనే మంత్రిపదవిని వెలగపెడుతున్నాడు.

ఇదే అదనని ఏకాంబరం అలిగాడు. మామ ఎన్నో ఖరీదైన బహుమతులు, డబ్బు వగైరా ఏది కావలిస్తే అది ఇస్తానన్నాడు. వద్దన్నాడు 'ఏం కావాలో చెప్పుబాబు' అన్నాడు.

'నాన్నా! ఆయనకేదయినా పదవి కావాలి. ప్రజాసేవ చెయ్యాలన్న ఆరాటం ఆయనకి పట్టుకుంది' అంది కూతురు మీనా.

'దానికేం? మన చేతిలో పని-'




ఏకాంబరాన్ని ఓ పాడి కుండలాంటి సంస్థ అధిపతిని చేశాడు మంత్రి బంగార్రాజు. ఆకలి బాగా వేసినవాడు ఎక్కువ తింటాడు. కొత్త బిచ్చగాడు ఎండ ముదిరినా ముష్టికోసం ఉత్సాహంగా తిరుగుతుంటాడు.

ఏకాంబరం చిగుళ్ళతో ప్రారంభించి ఆ సంస్థని వేళ్ళదాకా తినేశాడు. కొంతమంది మంత్రిగారికి ఫిర్యాదు చేశారు.

'పోండయ్యా! అవినీతి ఎక్కడ లేదు? కంబళిలో తింటూ వెంట్రుకలు వస్తాయంటారేమిటి. బంగారంలాంటి నా అల్లుడి మీద అభాండాలు వేయకండి?' మంత్రి కోప్పడ్డాడు!

ఇంతలో ప్రజల తీర్పుకోసం ఎలక్షన్లు వచ్చాయి. బంగార్రాజు అలవాటుగా నామినేషన్ వేశాడు. ఆయనకీసారి నొప్పి కల్గించింది- ఏకాంబరం తన మీద పోటీ చెయ్యడమే. కూతురితో చెప్పించాడు. 'నీ అల్లుడు మొండివాడు- ఎవడు చెప్పినా వినడు నాన్నా!' అంది.

మామా అల్లుళ్ళ పోటీ ఎలా వుంటుందోనని నామినేషన్ వేసిన మిగతావారు తప్పుకున్నారు. మామా-అల్లుడు గోదాలో మిగిలారు.

అట్టహాసంగా ప్రచారం జరిగింది. ఫలితాలు వచ్చాయి. బంగార్రాజు తన సీటు నిలబెట్టుకున్నాడు! తిరిగి మంత్రి అయ్యాడు.

'మామా! నాకో పదవి కావాలి' ఏకాంబరం చనువుగా అడిగాడు వచ్చి.

'నువ్వు అవినీతిపరుడిగా ముద్ర వేయించుకున్నావు. ఎన్నికల్లో ప్రజలు నిన్ను తిరస్కరించారు. నీకు పదవి ఇస్తే ప్రజలు వూరుకోరు అల్లుడూ-'

'నేను ఎక్కువ అవినీతిపరుడ్ననే ప్రజలు తక్కువ అవినీతిపరుడవయిన నిన్ను ఎన్నుకున్నారు మామా! నేను పోటీ చేయకపోతే వేరే పార్టీ అభ్యర్థి నిన్ను చిత్తుగా ఓడించేవాడు. నా మహిమ తెల్సిందా?'

బంగార్రాజు బుర్ర మెరిసింది. అల్లుడ్ని కౌగలించుకుని మరో మంచి పదవి ఇచ్చాడు.

–బద్దిగం పాండురంగారెడ్డి

# డిస్కౌంట్



"నాయనా! ఊర్నించి ఎప్పుడొస్తివే. అమ్మా, చెల్లే బాగున్నారే? ...."అని కాలేజీ నుంచి వచ్చిన సత్యం తను వచ్చేకల్లా ఊరి నుంచి వచ్చి తన అద్దెగదిలో ఉన్న తండ్రిని అడిగాడు.

"అంతమంచిగనే ఉన్నారు. నువ్వేందిర ఇట్ల మొత్తం కట్టెపుల్లలెక్క అయితున్నావ్. తిండి తింటులేవు బిడ్డా!"

"నాకేమైందే...అట్ల ఫికర్‌బడ్తవ్? నేను బాగనేవున్నగాని నువు ఎపుడొస్తివే? చెప్పక, చెయ్యక ఎందుకొస్తివి. ఇంతకు తింటివా లేదా? " అని తండ్రి సమాచార మడిగాడగు సత్యం.

నైట్‌హాల్ట్ బస్‌కు వచ్చిన బిడ్డా! ఈడికి చేరేసరికి అంబటాళ్ల అయింది. వచ్చేతలికి నీ రూంకి తాళం వుంటే పక్కొళ్లకాడ చా బీ అడుక్కుని కాసేపుబన్న. తర్వాత నీకు మీ అమ్మ పంపిన పులిగోర వుంటే కొంత దిని నీకోసం చూస్తున్నా బిడ్డా!"

"సరెగానీ, అసలు ఎందుకొచ్చినట్లే? " మళ్లీ అడిగాడు సత్యం తండ్రిని.

"ఏంలేదురా...! నువు దస్రా పండుగకి వస్తావేమో అని చూస్తిమి. తాతీళ్లు (సెల వులు) లేవని రాకపోతివి. ఎట్లున్నవో, తిండిగింజలున్నవో లేవో పోయి చూసి రమ్మని మీ అమ్మ ఒకటే పోరు బెట్టబ ట్టె...అవుబిడ్డా! నువు కాలు పెయ్యి కడు క్కుని గీ పులిగోర తిను. నేను డబ్బుల జూసిన తిండి గింజలు తమామం దగ్గర బడ్డట్టున్నాయి కదా, కొనుక్కుందాం బజా

రుకు పొయ్యి"

"గవ్విటికోసం నువ్ ఇంత దూరం రావాల్నే. పైసల్ బంపితే కొనుక్కోనా? " ప్రశ్నార్థకంగా తండ్రిని అడిగాడు సత్యం.

"మనీతోనా వడ్లేడివిరా? కాలంగాక ఏడు స్తది. అందుకే ఓ మేకమర్కనమ్మి పైసలుదెచ్చిన. సరెగాని దుక్నానికి పదబిడ్డ" అని తండ్రి అనగానే సత్యం తిని అతడితో కల్సి బజారుకి వెళ్లాడు.

వీధిలో రంగు, రంగుల రకరకాల బానర్లను చూసి సత్యం తండ్రి-"ఏందిరా, సత్తీ! మళ్లీ ఓట్లొస్తున్నాయిరా? గిట్ల జెండాలు గట్టింద్రు"అని అడిగాడు.

"గయిజెండాలెందుకైతయ్ వాట్ని బ్యానర్లంటరు...."అని చెప్పాడు సత్యం షాపుల ముందు పండుగ డిస్కౌంట్స్ పేర్కొంటూ రాసిన బ్యానర్ల గురించి.

"అరె బిడ్డా! మంచిగసూడు గా జెండా మీద కారు బొమ్ముంది. అది తెలంగాణా పార్టోళ్లది గాదురా? ఇగో దీనిమీద సైకిలున్నది, తెలుగుదేశంది కాదురా? నాకు చదువు రాకున్నా ఓట్ల గురించి మస్తుగ దెల్సు. నువ్వు పుట్టకసంది నుండి ఓటేస్తున్న. ఇగ చూడు చెయ్యి ఉంటె ఇందిరమ్మది. సుత్తి కొడవలి కమ్యునిస్టులది. పువ్వు బిజెపిది"

"అదిగాదె అయ్యా! మొన్న సంక్రాంతి గదా! ఆ టైంల బట్టల దుకానపోల్లు, కార్ల దుకానపోల్లు, ఫ్రిజ్ లు, టి.వి.లు అమ్మేటోళ్లు ప్రైజులు, డిస్కౌంట్లు ఇస్తమని కట్టిన బానర్లే. గిపుడు ఓట్లేక్కడివి? ఇంకో యాడాది గావాల"అని సత్యం వివరించాడు.

"డిస్కౌంట్ అంటే ఏందిరా? "

"ఏంలేదు నాయినా! డిస్కౌంట్ అంటే నూరు రూపాయల ధర ఉంటే ఇరవైఅయిదు తగ్గించి, యాభై తగ్గించి ఇస్తరు"

"మరిగాండ్లకేం లాభంరా, ఇట్లా ఎకాఎకి ధర తక్కువ చేస్తే..."

"డిస్కౌంట్ ఇస్తే పాత స్టాక్ పోతది. ప్రైజులంటే కారుగిట్ట లాట్రీల యెల్తదనే ఆశతోడి జనం ఎగబడి కొంటరు..."అని తండ్రికి వివరించాడు సత్యం.

మొత్తానికి ఏమో అనుకున్నాంగాని నిన్ను యెగ్సానికి (వ్యవసాయం)తోలక బడికి పంపిందే మంచిదైంది బిడ్డా. మీ అమ్మ అనుకున్నట్లు మస్తు తెలివినబడ్డావు. నువు మంచిగ చదువుకుని గిర్దావర్ (రెవిన్యూ ఇన్‌స్పెక్టర్) అయి మనూరికే రావాలి బిడ్డా.. సరెగాని బిడ్డా గిట్ల డిస్కౌంట్ ఇస్తున్నారన్నావు కదా! బియ్యం ఎంత పాతవైతే అంత మంచిది డిస్కౌంట్ గదే...నూటికి యాభై తగ్గిచ్చే దుకనం చూపెట్టుబిడ్డా...నీకు యాభైకిలోలు కొని పెడతా. ఉగాది దాకా అయితయి" అన్న తండ్రి మాటలు విన్న సత్యానికి బియ్యానికి డిస్కౌంట్ ఉండదని ఎలా నచ్చచెప్పాలో తెలీక బిక్క మొహం వేసుకొని చూస్తూ నిలబడిపోయాడు.

– పి.అచ్యుతరావు

Owned, Printed, Published and Edited by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally-500 072, Ranga Reddy District. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore:25583804. & www.eenadu.net.

